

సంపుటి 1. | సంపాదకుడు : తిరుమల రామచంద్ర | సంయుక్త సంపాదకుడు : తిమ్మా... దండరామయ్య | సంచిక



సాహిత్యమీమాంస

# పారిజాతాపహరణము : పాదతాడనఘట్టము

శ్రీ తాపీ ధర్మారావుగారు

ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకనీ, ముక్కు తిమ్మన్న ముద్దుముద్దుగా ఏడ్చాడనీ, సహృదయులన్నారు. మెప్పుకోసము చెప్పిన ఈ టమాలు పాఠకలోకాన్ని తప్పుదారి పట్టించాయేమో అని సందేహం కలుగుతుంది. ఎందుచేతనంటే ఈ ప్రశంసవల్ల పాఠకులదృష్టి మాటల మీదనూ, వాటి ముద్దుతనం మీదనూ లగ్నమయి పోతుంది. ముద్దుమాటలు చూచి మురిసి పోతారు. అంతకంటే ఆ కావ్యంలో చూడవలసిందే లేదని అనుకుంటారు. భావంకోసం బాధపడవలసిన అవసరమే కనబడదు. అందుచేతనే కాబోలు పారిజాతాపహరణం అభిమాన ప్రబంధంగా పఠించిన వారిసంఖ్య చాలతక్కువ. తక్కిన ప్రబంధాలలోని ఘట్టాలకు ఘట్టాలే కంఠస్థంగా ఉన్నవారు చాలమంది కనబడతారు; కాని, పారిజాతాపహరణంలోనుంచి పట్టుమని పదిపద్యాలయినా నోటికి వచ్చినవారు కనబడరు.

ఆ పద్యాలయినా పాదతాడన ఘట్టంలోనివి. పాటలగంధి చిత్తమున పాటిలు కోపభరంబుతీర్ప కృష్ణుడు మ్రొక్కినపద్యము; ...లతాంతాయుధు కన్నతండ్రి శిరము సత్యభామ వామపాదంతో తొలగద్రోసిన పద్యము; ఈసునబుట్టి డెందమున హెచ్చిన కోప దవానలంబుచే గాసిలి సత్యఏడ్చిన పద్యము, ఇటువంటివి మాత్రము వినగలుగుతాము. ఆ చదివిన ధోరణిని పట్టుకొని, అప్పుడు జరిగిన వ్యాఖ్యానాలను పట్టుకొని, చూస్తే, సత్యభామ పాత్రను అపార్థం చేసుకుంటున్నామని తోచక తప్పదు. సత్య తెలిసి తెలిసి, "జలజాతాసన వాసవాదిసుర పూజాభాజనంబై తనర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమును" ఎడమ

కాలితో తన్నినదనీ, మగనికొట్టి మొగసాల కక్క బొల్లియేడుపు ముద్దుముద్దుగా యేడ్చినదనీ వారి భావమయినట్లు కనబడుతుంది.

## పూర్వకథ

ఇది సరికాదని వేరె చెప్పనక్కరలేదు. ముక్కుతిమ్మన ఎంతో నేర్పుతో చిత్రించుకొని వచ్చిన సత్యభామా కోప పరిణామాలను శ్రద్ధగా చూచినవారు ఈ దారినిపోరు. పారిజాత పుష్పవృత్తాంతము చెలికత్తె చెప్పినప్పుడు ఆమె కోప మంకురించింది. తననుగురించి నారదుడు పలికిన అసందర్భ ప్రలాపముల సంగతివిని,

అనవిని ప్రేంకణద్ఘృణోర
గాంగనయుంబలె; నేయిపోయ భ
గ్గన దరికొన్న భీషణహు
తాశన కీలయుంబలె

బుసకొడుతూ మండిపడ్డది. ఈ కోపము ఏ సపత్నికైనను సకారణము; మానవతియయిన సత్యభామకు సమంజసము. రుక్మిణితో సమాన ప్రతిపత్తిగల సౌభాగ్యవతి సత్య;

కులమును రూపమున్ మగని
కూరిమియున్ గలదానసంచు

అటు రుక్మిణి ఇటు సత్య భావించుకొనేవారు. అదే రవరవలకు కారణము. ఆ రుక్మిణి మందిరములోనే తనను గురించి

నా యంతటివారు లేరని య
హంకృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్
వింతునవచ్చు సత్యగరువం
బిక చెల్లదటంచు

నారదుడు వ్యాఖ్యానించాడని విన్నది. ఏ ఆడదీ సహించరాని మాటలు. భరించరాని అవమానము. రుక్మిణీ నారదులు పైవారు; వారినేమనటకు తనకధికారముగాని చనవుగాని లేదు. కృష్ణుడలా కాదు. తనభర్త. అనుటకూ అనిపించుకొనుటకూ తనకు చనవూ అధికారము ఉన్నది. ఈ కృష్ణుడు ఆ నష్ట వ్యాఖ్యానాలను వలదని వారించలేదు. కాబట్టి కోపము త్రిగుణీకృతమయి కృష్ణునిమీద కేంద్రీకరించింది. భర్తచేసిన దోషాలను గణించింది; తనకు కలిగిన అవమానం తలంచుకుంది; తన జీవితాశ భగ్నమయిందని గుర్తించుకుంది; ఉన్నవిలాసాల కన్నిటికీ వీడ్కోలిచ్చింది. నిందించవలసినదంతా నిందించింది. ఆడిపోయవలసినదంతా ఆడిపోసింది. మాసిన చీరకట్టి చీకటింటికడ కంకటిపై (=మంచము) పడి పొర్లుతూంది. అక్కడ, మాటలాడకపోయినా, ఇందాకటి నిందాది విషయాలన్నీ మనసులో తిరుగుతూనే ఉన్నాయి. ఆయా విషయాల కనుగుణంగా కన్నుమూస్తుంది, తెరుస్తుంది; వెగటునవ్వు నవ్వుతుంది; కానీ యన్నట్టు తల ఊపుతుంది. చివరకి

[1] మదహస్తి హస్తగత
పద్మినియుంబలె సొంపు పెంపరన్

మదించిన యేనుగు తొండానికి దొరికిపోయిన తామరతీగలాగ బలరహితమై జిగిబిగీ ఏమీ లేనట్టు ఉండిపోయింది.

## ఉపశమన ప్రయత్నము

ఆలా ఉండగా కృష్ణుడు వచ్చాడు. శోభారహితంగా ఉన్న లోగిలి చూచి ఇది పారిజాతం వల్ల కలిగిన గోలే అని గ్రహించాడు. కాని, చెలికత్తె ఎంతవరకు చెప్పిందో అది మాత్రం తెలియదు. ఒక చెలిచేత నున్న వీవన తీసుకొని తాను విసురుతున్నాడు. ఏదో "నూతన దివ్య వాసన" సత్యకు గోచరించింది. పారిజాత పరిమళం తనకు తెలియదు. కాబట్టే విస్మయం[2] కలిగి, ముసుగుతోసి చూచింది. తన భర్త; అదే పారిజాత పరిమళము; నిదర్శనంతో కనబడిన ద్రోహి; ఇందాకటి విచారానికి పునరుజ్జీవనం కలిగింది. దుఃఖము పొర్లుకొనివచ్చింది. కన్నీరు కారుతూ ఉంది. ఏడుస్తూ ఉన్నట్టు కనబడడం తన కిష్టం లేదు. మళ్ళీ ముసుగుపెట్టింది.

ఉన్నమితావరణాంశుకాంతపై

పెద్దనిట్టూర్పు తీసింది. మంచానికిచుట్టూ కట్టిన

---

1. అప్రేంకణద్ఘృణోరగాంగన అభీషణహుతాశనకీల ఈ మదహస్తిహస్తగత పద్మినిగా పరిణమించింది. ఈ పరిణామ సోపానాలను అత్యంత కౌశలముతో నిర్మించ గలిగిన తిమ్మన్న సిద్ధహస్తమును శ్రద్ధతో పరిశీలించదగును.

2. ఈ విస్మయానికీ, నారదుడు పూవు నిచ్చినప్పుడు "వినయంబు విస్మయంబును మనమున బెనగొనగ" కృష్ణుడి కలిగిన విస్మయానికీ ఉన్న వ్యత్యాసము చూడదగినది. కృష్ణుడికి పరిమళం పూర్వ పరిచితమేకదా!

తెర అంచులు చలించాయి. ఏమనడమో తెలియదు. "మానక్రోధములచే కుమారిలి" పోతూవుంది.

ఆ సమయములో కృష్ణుడు ఉపశమన వాక్యాలారంభించాడు. నగలు ధరించలేదేమి, నావైపు చూడవేమి- అని నంగిరిమాటలు. సత్యకు ఎంతవరకు తెలుసునో తనకు తెలియదు కాబట్టి ఆమె చేతనే పలికించాలని, అసలు కోపకారణము సంగతే ఎత్తడు. ఆ కారణమేమిటో కృష్ణుడికి బాగా తెలుసునని సత్యభామకు తెలుసును. ఇదంతా కపటమే, తనను వంచనచేయడమే. చేసిన ద్రోహానికి తోడు ఈ నటన, ఈ కపటం! సహించడం కష్టం. ఇంతలో "ఇతర కాంతలకు గారవము

మెరమెచ్చులకై పచరింతుకాని, పా
యని యనురక్తి నీయెడల ..."

అని కృష్ణుడు ఏమో అంటున్నాడు. ఇదే మెరమెచ్చుల కంటున్న మాట యని సత్యకు నిరూపితమవుతూంది. అసహనం అధికమయి అసహ్యంగా పరిణమిస్తూంది. ద్రోహి, వంచకుడు, కపటి నమ్మించి గొంతకోసే వాడిలాగ పొడచూపుతున్నాడు. అతడు తనకంత దగ్గరగా ఉండడమే బాధగా కనిపిస్తూంది. అది కృష్ణుడు గుర్తించుకోలేదు; సాధారణమయిన అనునయ సూత్రాల ప్రకారము "బాహుపరీరంభము కాకపోయినా కడకంటి చూపయినా తన కనుగ్రహించరాదా" అంటూ సత్య చీరచెరగు పట్టుకోబోయాడు. సత్య సైచునా? "ఛీ! దూరముండు" అన్నంత అర్థముతో

చేవిరిదమ్మి [1]వ్రేయుటకునై
యుంకించి జంకించినన్

చేతితో (విరిదమ్మివంటి చేతితో) కొట్టబోయింది—చెవిదగ్గర అసహ్యంగా గోల పెడుతున్న జోరీగను విదిర్చినట్టు.

ప్రయోజనము లేదు. దానితో కృష్ణుడు తన విధానము మార్చక తప్పిందికాదు. ప్రణయకలహాను నయాలలో పురుషుల పాలిటి సమ్మోహనాస్త్రమయినది నమస్కారము. దానుడి తప్పేకాదు, ఘాతుడి తప్పుగూడా, దండంతో తీరిపోతుంది. ఈ సాధనను ఉపయోగించి కృష్ణుడు "అర్మిలిమ్రొక్కె." [2] మ్రొక్కినన్—

ఇక్కడే ఉంది చిక్కు. ఆ జగన్నాటక సూత్రధారి యదునందను డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్ అని చదివి, ఊపిరైనా తీయకుండా పా. వా. పాఠకులు ఉత్సాహంతో, కంఠమెత్తి, ఒక్క బిగువున

జలజాతాసన వాసవాదిసుర
పూజా భాజనంబై తన
ర్చులతాంతాయుధుకన్న తండ్రిశిర
మచ్చోవామ పాదంబునన్
తొలగంద్రోచె లతాంగి......

అని చదువుతారు—అదంతా ఆ సత్యకు గుర్తున్నట్టు; ఎంతటి జంత! ఎంత దుర్మార్గురాలు ఈ సత్య అని మనచేతగూడా అనిపించేస్తారు. సత్యపాత్ర దానితో సర్వనాశన మవుతుంది. ముక్కుతిమ్మన యింతవరకు మహాకౌశలముతో నిరూపించుకుంటూ వచ్చిన కోపభావ పరిణామ పరంపరంతా బూడిదనుపోసిన పన్నీరవుతుంది. ఈ కథతో కృష్ణరాయ అంతఃపుర విషయాన్ని చక్కట్లు దిద్దాలని కవిచేసిన (నిజమయితే) ప్రయత్నమంతా గంగలో కలిసిపోతుంది. ఇటువంటి దుష్టప్రవర్తనగల సత్యతో మహారాణీని సరిపోలుస్తాడా తిమ్మన?

---

1. చేవిరిదమ్మిగా—చేతిలో ఉన్న వికసించిన పద్మముతో. అని అర్థము చెప్పిన కాలేజీ పండితులున్నారు. ఆ సన్నివేశములో, ఆ కోపపరిణామ చిత్రణములో, ఈ అర్థము చెప్పడము చాల ఘోరము. ముక్కుతిమ్మనకు మహాపరాధమని చెప్పనక్కరలేదు. ఈవిధంగా అర్థం చేసుకోవడం వల్లనే గాబోలు ఈ మహోత్తమ కావ్యముమీద మన సహృదయుల కుండవలసినంత ఆదరము లేకుండా ఉంది.

2. ఇక్కడ "అర్మిలి మ్రొక్కు మ్రొక్కినన్" అని పఠిస్తే బాగుంటుందేమో. కృష్ణుడు అర్మిలితో మొక్కలేదని మనకు తెలుసును. అతని హృదయంలో అర్మిలి ఉంటే ఉంటుంది; కాని తానా ఆవేశంతో మ్రొక్కడం మాత్రంలేదు. ఉద్దేశపూర్వకమయిన ఉపాయ రూపంగానే మ్రొక్కాడు. అది అర్మిని సమయాలలో ఉపయోగించే మ్రొక్కు "అర్మిలి మ్రొక్కు" కాదా? మ్రొక్కులలో రకాలులేవా?

కూడదు; కాదు; మ్రొక్కె-నన్ అన్న తరవాత వచ్చిన ఈ జలజాతాసనవాసవాది...అన్న సోద అంతా కథకాదు; కల్పన; కవి ఊహ-అంతే. అసలు కథ ఏమిటంటే "మ్రొక్కె-నన్, శిరమచ్చో వామపాదంబునన్ తొలగంద్రోచె లతాంగి" తన్న లేదు; తొలగ ద్రోసింది. ఇందాక పైటచెరగు పట్టబోయినప్పుడు చేయి విదిల్చినట్టే, ఇప్పుడు పాదాన్ని తాకుతూ ఉన్న తలను తొలగించింది. ఆ తల యెడమకాలికి కొంచెం దగ్గరగా ఉండడంవల్ల ఆ వామపాదం తోనే తొలగద్రోసింది. ఆ తల మోచేతికి తగుల్తూ ఉండిఉంటే మోచేతితోనే తొలగించి ఉండేది. అంతేగాని, ఎంచి యెంచి ఎడమకాలే ఉపయోగించాలని చేసిన పనికాదు. అసహ్యాన్ని తెలియజేసే అమాయకపు చర్య.

ఇకను ఆ తలగురించి చూస్తూఉన్న కవికీ, కావ్యపాఠకులకూ, అది జలజాతాసన వాసవాది సుర పూజాభాజనమూ, లతాంతాయుధు కన్న తండ్రి శిరమూను, కాబట్టి మహాపవిత్రము కావచ్చును. ఆడువారు పురుషులయందుకోరే చదువు సంపద, చక్కదనము అన్న మూడు విషయాలలోను అగ్రగణ్యులనిపించుకునే జలజాతాసనుడు (బ్రహ్మ) వాసవుడు (ఇంద్రుడు) లతాంతాయుధుడు (మన్మథుడు) అన్న ముగ్గురిని మించినవాని శిరమని రసజ్ఞులనుకోవచ్చును. కాని ఆనాడా సన్నివేశములో సత్యభామకు ఆ దృష్టి లేనే లేదు. తానొక ఆడుది. ఆ శిరము మహాద్రోహ మొనర్చిన తన భర్త శరీర భాగము మాత్రమే. తనను ఏ ఆడదిగూడా (అందులో ముఖ్యంగా సత్యవంటి మానవతులు) సహించరాని ఘోరమయిన అవమానం పాలుచేసి ఇప్పుడు వచ్చి మెరమెచ్చులకై కపటపు మాటలాడుతూవున్న తన మగనిది. చేరువకువచ్చి చెరగుపట్ట దానినే సహించలేక ఇందాక చేయి విదిల్చింది. ఇప్పుడు ఆ ద్రోహి శరీరాన్ని తాకుతున్నాడు. సామీప్యాన్నే సైచలేని సత్య సంస్పర్శను సైచగలదా? ఇప్పుడు కాలు విసిరింది. రెంటియందూ భావమొక్కటే; దోషముంటే దోషమూ ఒక్కటే. ఈ భావాన్ని గ్రహించగలిగినవారికి మన కవి కోప పరిణామాలను నిరూపించడానికి ఎంత శ్రద్ధ తీసుకున్నాడో, ఎంత మానవ స్వభావ పరిశీలనానుభవము కనబరిచాడో, ఎంత అనన్య సామాన్యమయిన ప్రతిభను ప్రకటించాడో తేటతెల్లము కాకపోదు. ముక్కు తిమ్మన్న ప్రఖ్యాతి ముద్దుముద్దు పలుకులలోనే కాదనీ, మనఃప్రవృత్తుల క్రమచిత్రణము మొదలయిన అనేక అమోఘ విషయాలలో నున్నదని స్పష్టమవుతుంది. గ్రంథము అధిక సంఖ్యాకులకు అభిమాన ప్రబంధమయేది; వందలకొలది పద్యాలు కంఠస్థములయి ఉండేవి.

ఈ అమాయక (మహాసహజ) చేష్టను-తొలగ ద్రోయడాన్ని—తాపు అని పేరుపెట్టి పిలిచిన వాడు కృష్ణుడు—సమయస్ఫూర్తిగల కార్యార్థి, ప్రజ్ఞావంతుడు. దీని నొక సాధనంగాచేసి తన కార్యము సాధించాలని చూచాడు.

నను భవదీయదాసుని
మనంబున నెయ్యపుకినుక బూని తా
చినయది నాకు మన్ననయ,
......................

అన్నాడు. తొలగ ద్రోయడానిని తాచడం (తాపు) అన్నాడు. [1]ఇందాక చేయి విసిరినప్పుడు ఆ చేయి తనకు తగిలియుండిఉంటే, నను భవదీయదాసుని మనంబున నెయ్యపు కినుకగాని కొట్టిన యది నాకు మన్ననయే అని అనేవాడే. అప్పుడు తగలలేదు; ఇప్పుడు కాలు తగిలింది. ఆ విషయాన్ని సంపూర్ణంగా ఉపయోగించుకుంటున్నాడు కృష్ణుడు. ఈ తాపు కృష్ణుడి తలను పుట్టి, నోటను బయటపడ్డదే. సత్యభామ తన్నినదికాదు.

---

1. ఈ పదప్రయోగంవల్ల సత్య మనసులో కలిగిన సంచలనము (ఆందోళన) దాని ఫలితము తిమ్మన్న సిద్ధహస్తముతో చిత్రించాడు.

# ఆరంభం పెద్ద అవస్థ !

## శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు



"రావద్దు రావద్దు లోనికి
రాస్తున్నానొక గీతం
రావద్దు రావద్దు లోనికి...
నను చూడక, కాదిది వేళ
నామనః కార్మికశాల
క్రక్కేది చండాగ్ని సెగలు
క్రమ్మేది..........."

సరే. ఏమయితేనేం ? లోనికి రావద్దని మొదటే చెప్పి తర్వాత లోపల జరుగుతున్నదేమిటో వర్ణించబోవడం. అందుకే ఆరంభించిన గీతం పూర్తి కాలేదు. ఈవిధంగా నేను మొదలుపెట్టి వదిలిపెట్టిన గీతాలు చాలా ఉన్నాయి.

"తలలో పుట్టి
కలలో పెరిగి
ఉద్రేకంలో నిండి
ఉన్మాదంలో పండి
కాలకూటపు గాటపు పొగలలో
గంధక ద్రావక కాసారంలో
గండభేరుండాల కౌగలింతలలో..."

తర్వాత జ్ఞాపకం లేదు.

"వాకిట్లో చీకట్లో ఎవరా కేక ?
నేనేలే... నేనేలే... నేనే..."

అసంపూర్ణంగా ఉండిపోయేవి ఒక్క గీతాలే కావు. కథానికలు, ఉదాహరణకి : గురజాడ అప్పారావుగారు ఎన్నో కథలకోసమని నోట్సు రాసిపెట్టుకున్నారు. చిత్రకారుని రచనలు, మాటవరసకి ! "ఈ బొమ్మ చాలా బాగుందండీ. పూర్తి చెయ్యలేకపోయారా ?"

ఎలాగైనా ఆరంభం పెద్ద అవస్థ.

"క్షితిజరేఖకు ప్రారంభం ఎక్కడ" అన్నాడొక కవి.

కాని అసలు ఆరంభమనేది ఉన్నదా అని వేదాంతితోబాటు మనం ప్రశ్నించుకోవాలి. "సాయంకాలమైంది. పూటకూళ్లమ్మకు సంతలో సామాను కొనిపెడతానని..." అని ప్రారంభమవుతుంది కన్యాశుల్కం నాటకం. కాని అప్పటికే ఎంతో కథ అయిపోయింది. ఈ సంతలో సామాను కొనిపెడతాననడమే ఒక నెలరోజుల కిందట ! గిరీశం ప్రవేశించడమే పోలెడంత పూర్వకథతో ప్రవేశిస్తాడు. అలాగే ఆ నాటకంలోని ప్రతీపాత్రా కూడా.

అలాగే కావ్య ప్రపంచంలోని ప్రతి గీతానికీ ప్రారంభానికి ముందే పుష్కలమైన పూర్వకథ ఉంటుంది. "దూరాన నా రాజు కేరాయి జానో" అని ఎంకి ఆక్రోశించినప్పుడు మొదటి మాటలోనే మనం యెంకికీ నాయుడుబావకీ మధ్యనున్న మూగాన్ని గ్రహించుకుంటాము.

"మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది."

ఈ విధంగా ప్రారంభమైన గీతానికి పూర్వం నా మనస్సులో ఏం జరిగింది ?

ఈ గీతాన్ని నేను 1934 వ సంవత్సరం ఏప్రిల్ నెల 12 వ తేదీనాడు రాశాను. దీన్ని రాయడానికి నాకు అయిదు నిమిషాలకంటె ఎక్కువ పట్టలేదు. మరో ప్రపంచం అని ప్రారంభించి భుగభుగలు అని ముగించేదాకా పెన్సలు ఆపలేదు.

ఔను. ఈ గీతాన్ని పెన్సలుతోనే రాశాను. ఒక వ్యాసం రాదామని "మరో ప్రపంచం" అనే శీర్షిక కాగితంమీద రాసేసరికి కలంలో సిరా అయిపోయింది. సిరా పోస్తూ ఆలస్యం చెయ్యడమెందుకని కాపీయింగ్ ఇంకు పెన్సలు తీశాను. నాన్‌స్టాప్‌గా నడచిన పెన్సలు భుగభుగలు అనేమాటదగ్గర హఠాత్తుగా ఆగిపోయింది. రాసిందంతా చదివేసరికి అక్కడితో గీతం అంతమయిందని తెలిసింది.

ఒక్క మార్పు కూడా చెయ్యకుండా మర్నాడు యీ గీతాన్ని ఒక సుప్రసిద్ధ మాస పత్రికకి పంపించాను. పంపిన మూడవరోజుకి "రిటర్న్డు విత్ థేంక్సు" అనే వర్తమానంతో గీతం నా దగ్గరికి తిరిగివచ్చింది. అప్పటికీ గీతానికి "మహాప్రస్థానం" అనే పేరు పెట్టలేదు. తర్వాత గీతంలో ఒకే ఒక్క మార్పు చేశాను.

"కదం తొక్కుతూ పదం పాడుతూ
కాంద్రు కాంద్రుమని గర్జిస్తూ..."

అని తొలిపాఠం...

కాండ్రు కాండ్రుమని పులికేకకీ, గర్జించడం సింహంచేసే ధ్వనికీ ఉపయోగిస్తాం కాబట్టి ఈ ప్రయోగం నాకు సంతృప్తికరంగా లేక పోయింది. అంచేత

"కదం తొక్కుతూ పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ"

అని మార్చాను.

ఈ గీతం రాసి కొన్ని నెలలయిపోయిన తర్వాత మహాప్రస్థానం అనే శీర్షికతో జ్వాల పత్రికలో ఇది ప్రకటితమయింది. అంతకు ముందు సంచికలో వేదులవారి "కాగడా" అనే గేయం, దానికి ముందు సంచికలో అడివి బాపిరాజుగారి "ఎగురనివ్వండోయ్ జ్వాలల్" అనే గేయమూ పడ్డాయి. అయితే మరో ప్రపంచం పాట విశాఖపట్టణం టర్నరు సత్రంలో నేను చదివి వినిపించిన తర్వాతనే తాను జ్వాలకి పాట రాసినట్లు బాపిరాజుగారు ఒప్పుకున్నారు.

ముందుగా అడివి, వేదులవారి పాటలు వెయ్యడమే కాక, మహాప్రస్థానం ప్రకటించిన సంచికలోనే దానికన్న ముందు పుటలో "జ్వలనా" అనే అనుకరణ రచన ముద్రించటంలో జ్వాల సంపాదకునికి గాని అప్పట్లో అతనికి సలహాలు చెబుతూవచ్చిన వారికిగాని దురుద్దేశాలున్నాయని నే నాడోపించను. జరిగిన యీ సంగతులను నేను గుర్తించానని మాత్రం చెబుతున్నాను.

ఈ పాటలోని ఆవేశానికి ప్రధాన ప్రోద్బలాలు లా మర్సెయ్యేజ్, లా ఇంటర్నేషనాల్, బరన్సు కవి రచించిన 'జెన్నాక్ బగన్' అలెగ్జాండర్ బ్లాక్ వ్రాసిన "ది ట్వెల్వ్", దరిమిలాని యీ ట్వెల్వ్‌ని నేను

'నల్లని రాత్రి
తెల్లని మంచు
ప్రభంజనం, ప్రభంజనం'

అని ప్రారంభించి కొంతవరకు తెనిగించాను. నజ్రుల్ ఇస్లామ్ గీతాలూ — హారీంద్రకవి 'షురూహులు హై జంగ్' అనే పాటా నజ్రుల్ ఇస్లామ్ గీతాలూ నా మనస్సులో ఏవో మారుమూలల్లో మారుమోగుతూ ఉండి ఉండాలి. అలాగే కవికొండల కవి కంఠంకూడా. ఫలానాచోట అని చెప్పడానికి లేకుండా మొత్తం నా కవితా వ్యాసంగం అంతటిమీదా ఎడ్గర్ అల్లన్ పో, గురజాడ అప్పారావుల ప్రభావం పనిచేస్తుంది. ఇంచుమించు ఆ రోజుల్లోనే వేమన్నని నేను మహాకవిగా శిరసావహించాను. లేకపోతే

"తలుపు గొళ్ళెం
హారతి పళ్ళెం
గుర్రపు కళ్ళెం
కాదేదీ కవితకనర్హం
ఔనౌను శిల్ప మనర్ఘం."

అనగలిగిన పాటి ధైర్యం వుండేదికాదు.

మరో ప్రపంచం గీతం రాయడానికి ముందు 1934 వ సంవత్సరం ఫిబ్రవరినెల 18 వ తేదీని ఎడ్గార్ పో గంటలని అనుకరిస్తూ (అనువదిస్తూ కాదు) ఒక గేయం రాశాను. అందులో

"హారోం హారోం హార హార హారహార
హారోం హారా అని పలికే గంటలు"

అన్న పాదాలు తతిమ్మా గేయంతో బేలన్సు కాకపోవడంవల్ల వాటిని ఉపసంహరించాను. రెండు నెలల ఆ 'హారోం హారోం హార' నించే మరో ప్రపంచం గీతం వెలువడిందనీ అనవచ్చును.

ఇదే విధంగా ధ్వని సామ్యాన్నే వెతుక్కుంటూ వెళ్లితే అప్పట్లో బరంపురం నవ్య సాహిత్య పరిషత్తులో శ్రీ శివశంకర శాస్త్రిగారు చదివిన

"మారోమారో, మార్రోమార్రో,
ఒకటి రెండూ మూడూ నాలుగు,
మార్రో మారో మారో మార్రో"

అనే శిష్ట్లా ఉమామహేశ్వర రచనకూడా ఒక ప్రోద్బలమే అని చెప్పాలి.

భావకవిత్వ పద్ధతులూ, గ్రాంథిక భాషలో పద్యరచనా వదలిపెట్టి వ్యావహారిక భాషలో నవీన ధోరణిలో సాగించిన నా మొదటి రచన—

"నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను"

అన్నది. దీన్ని 1933 జూన్ 2 వ తేదీని రాశాను. అప్పటికే శిష్ట్లా ఉమామహేశ్వర విలక్షణమైన ఒక నవీన ధోరణిలో రచన సాగిస్తున్నాడు. కాని సరాసరిగా అవి నా రచనను ప్రేరేపించలేదు. శిష్ట్లా ప్రభావంతో ముద్దుకృష్ణ వ్రాస్తున్న వచన గీతాలు ఎప్పటికప్పుడు ముద్దుకృష్ణ ముఖతానే నేను వినేవాడిని. వచన

గీతాన్ని కళారూపంగా తీర్చి దిద్దడానికి ముస్ముందుగా నేను కొంత శోధనా, సాధనా సాగించాను. హారీంద్రనాథ్ గీతాలూ, మరికొన్ని ఆంగ్ల గీతాలూ తెనిగించడం ద్వారా యీ పరిశోధన చేశాను. స్వతంత్రంగా రాసిన నా మొట్టమొదటి వచన గీతం విగ్యన్మాలికలు.

> "బారులు బారులుగ తీరిన
> మబ్బు గుబ్బలుల దారుల
> దారి తప్పి చరించె ఆరేయి
> తరళ సర శేరమ్మదములు..."

ఇత్యాది గీతం. ఇది గ్రాంథిక భాషలో ఉండడం ఇక్కడ గుర్తించాలి. ముద్దు కృష్ణనీ శిష్టాని ప్రవేశపెడుతున్న పాశ్చాత్య కవుల దగ్గరికి సరాసరిగా వెళ్లాను. ఆంగ్ల కవులతో సంతృప్తి కలుగలేదు. ఫ్రాన్సు జర్మనీ దేశాల కవుల ఆకర్షణకి ముగ్ధులయ్యాను. ప్రపంచ విశాలమైన దృష్టితో అంతటా కలయజూస్తేనేగాని కావ్య స్వప్నం సఫలీకృతం కాదని అప్పటికీ, ఇప్పటికీ నా అభిప్రాయం. ప్రపంచం అంతటా అభివృద్ధిని కాంక్షించే కవుల స్వప్నాలు రష్యన్ విప్లవంలో ఆకృతి ధరించడం నాకు కనబడింది. సామాజిక విప్లవానికి పురోగామిగా సాహిత్య విప్లవం సాగాలన్న దృఢ నిశ్చయం ఏర్పడింది.

ఒకసారి గురజాడ వర్ధంతి సభలో కొంత మంది విద్యార్థుల ఎదుట ఉపన్యసిస్తూ నేను "ఆడంబరంతో ఆర్భాటంతో కూడుకున్న సంస్కృత చ్ఛందస్సులను నిరాకరించి సాహిత్య లోకంలో గురజాడ మహాకవి ముత్యాల సరాన్ని చేపట్టడం జాతీయ జీవితంలో గాంధీ మహాత్ముడు అన్నిరకాల దుస్తులూ మానివేసి అంగవస్త్రాన్ని ధరించడం వంటి"దన్నాను. నిజానికి గాంధీజీ యీపని చెయ్యడానికి అనేక సంవత్సరాల కిందట గురజాడ కావ్యరంగంలో విప్లవ మార్గం తెరిచాడు. దేశీయ చ్ఛందస్సులలోనే అచ్చమైన తెలుగుతనం ఉందని నిరూపించాడు. అవే ప్రజల జీవితానికి అత్యంత సన్నిహితమైన వాహనాలని మరచిపోయిన సంగతిని మళ్ళీ జ్ఞాపకం చేశాడు.

"ముత్యాలసరం : ఒక కృషి" అని ఆ రోజుల్లో నేను వ్రాసిన వ్యాసం ఒకటి ఉదయిని పత్రికలో వచ్చింది. మరో ప్రపంచం ఛందస్సు మీదకూడా అంత సమగ్రంగానూ చర్చించడానికి వీలుంది. అయితే అదిప్పుడు కాదు. ఇక్కడ సూచనాప్రాయంగా మాత్రమే పరిశీలిస్తే చాలుననుకుంటాను.

చతురశ్రగతిలో నడిచే ఎనిమిది మాత్రల ఛందస్సు మరో ప్రపంచం. 'పుత్తడి బొమ్మా పూర్ణమ్మా' అనే పాటలోని ఛందస్సుకూడా ఇదే. బొబ్బిలిపదం కోయ్యోడిపాట ఒకటేమిటి, ఎన్నో జానపద గేయాలూ స్త్రీలపాటలూ యీ ఛందస్సులోనే వున్నాయి. మహాప్రస్థానం, జ్వాలా తోరణం, నవకవిత, ప్రతిజ్ఞ, శైశవ గీతి మొదలైన నా రచనలూ.

> "అలసిన కన్నులు కాంచేదేమిటి?
> తొణికిన స్వప్నం!
> తొలగిన స్వర్గం!"

అనే గీతికలోని ప్రశ్నోత్తర పూర్వకమైన విరుపులు యీ ఛందస్సులో వైవిధ్యం సాధించడానికి నేను చేసిన ప్రయత్నం.

> "ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన
> సోమరులారా చావండి!
> నెత్తురు మండే శక్తులు నిండే
> సైనికులారా రారండి!"

అన్నచోట అంతఃప్రాసలూ, అంత్యప్రాసలూ "గీతగోవిందం" లోని

> "ముఖర మధీరం త్యజమంజీరం
> రిపుమివ కేళిషులోలం
> చలసఖి కుంజం సతిమిర పుంజం
> శీలయ నీల నిచోళం"

అన్న పోకడతో పోలికకు వస్తాయి.

> "మరో ప్రపంచం మరో ప్రపంచం
> మరో ప్రపంచం పిలిచింది"

అని ప్రారంభంలో ఒకే పద సముచ్చయాన్ని ముమ్మారు పలికించడంలో

> "భజగోవిందం భజగోవిందం
> గోవిందం భజ మూఢమతే"

అనే శ్రీ శంకర భగవత్పాదుల అమేయగేయం స్ఫురణ కొస్తుంది. మూడవసారికూడా భజ గోవిందం అనకుండా గోవిందం భజ అని తిప్పి కొట్టడంలో ఆచార్య శంకరుల అసాధారణ ప్రజ్ఞ సుస్పష్ట మవుతుంది.

> "సముద్రం సముద్రం స్మేర సముద్రం
> నిసీల విశాల విలోల సముద్రం"

అని నేను ప్రారంభించి పూర్తి చెయ్యని ఇంకో గీతం వుంది. ఇంగ్లీషులో సరిగా ఇదే విధంగా

"ది సీ ది సీ ది స్పార్క్లింగ్ సీ" అని ప్రారంభ మయే ఒక గీతాన్ని చాలీనతర్వాత నాపాట పూర్తిచెయ్యాలనే ధ్యాస పోయింది.

మరో ప్రపంచానికి అంధానుకరణ ప్రాయంగా "మరో వసంతం" అని ఒకరిద్దరు రాశారు. అంతకన్న

"పొగాకు తోటలు
పొగాకు తోటలు
పొగాకు తోటలు పండింతున్."

అని ఎవరైనా పేరడీ చేస్తే నేను ఎక్కువసంతోషించిఉందును.

పద్యాన్ని గద్యంనించి వేరుచేసి మాత్రేది ఛందస్సే అయినా ఛందోనుబద్ధంగా రచన సాగించి కావ్యత్వం సాధించడం సాధ్యమే అని వచన గీతాల సంవిధానం రుజువుచేస్తుంది. రొమాంటిక్స్ అనే కావ్యానుశీలన విధానాన్ని పాశ్చాత్య కవితా కళాభిజ్ఞులు ఇటీవల చాలా విస్తరంగా అభివృద్ధిచేశారు. ముఖ్యంగా ఆంగ్ల కవయిత్రి ఎడిత్ సిట్వెల్ తన గీతాలసంపుటి ఒకదానికి ఉపోద్ఘాతం రాస్తూ యీ నూతన విమర్శలో కొత్తకొత్త లోతులు చూపించింది. రొమాంటిక్స్ అంటే కవిత్వంచేసే సవ్వడి.

"త్రిభువన శుక దృష్ట పంజర
విభవమకుటుండవు సమస్త విష్టప నిర్లో
కభుజగపతిక్, నిఖిలజగ
దక్షిన్న రూపుండవు——"

అని ఛందోబద్ధమైన కంద పద్యంలోనే కాక

"ఆ చెలరేగిన కలగాపులగపు
విలయావస్తపు
బలవత్ ఖురపత్ పరివర్తనలో
నే నయే పీథులలో
చంక్రమణం చేశానో"

అన్న గణబద్ధంకాని పాదాలలోకూడా యీ సవ్వడి వినిపిస్తుంది. తిక్కన మహాభారతంలోని ఎన్నెన్నో వచన గమకాలలో కవన మణిగణ రణన గంగణలు వినపడతాయి.

వచనాన్నే పిన్న పెద్ద పాదాలుగా పంచి రాసినంతమాత్రంచేత వచన గీతం సిద్ధించదు. లేదా ఏకందపద్యాన్నో గీత పద్యాన్నో ఇక్కడోమాత్రా, అక్కడోగణం లాగేసి కుంటించినా వచన గీతంకాదు. వచన గీతానికి కవిత్వం అంటే ఇదీ అని నిర్ధారణగా చెప్ప గలిగినప్పుడే వచన గీతం అంటే ఇది అని చెప్ప వచ్చును. చాలామంది మాత్రాచ్ఛందస్సులో గేయానికీ వచన గీతానికీ ఉన్న తేడాని తెలుసుకోలేరు. కొన్నిమాత్రం ఛందోబద్ధమైన గేయాలు అక్కడక్కడ విరిగిపోయి వచన గీతానికి చేరువగా వస్తాయి.

"ఎగిరించకు లోహ విహంగాలను
కదిలించకు సుప్త భుజంగాలను
ఉండనీ,
మస్తిష్క కులాయంలో
మనో వల్మీకంలో."

అనే గీతంలో మధ్యని పడ్డ ఉండనీ అనేమాట అంతకుముందు వచ్చిన రెండు పాదాలనీ అడ్డగించి నిలబెడుతుంది. స్థూలదృష్టికి ఇది ఇందాకా నేను చెప్పిన కందపద్యాన్ని కుంటించడం లాంటిదే. కాని ఇక్కడ ఒక ప్రయోజనంతో ఈపని జరిగింది. ఈ గీతాన్ని మాత్రాచ్ఛందం లోనే చేర్చాలిగాని వచన గీతం అనడానికి వీల్లేదు.

'మహాప్రస్థానం' గీత సంపుటిలోని చాలా రచనలు ఒక్కమాటు ఒక్కచోట ఒక్క పూటలో రాసినవే. కాని నాలుగైదు గీతాలు మాత్రం మొదట ప్రారంభించి తర్వాత కొన్నాళ్లకు పూర్తిచేసినవి. "దేశచరిత్రలు" వరుసగా రెండుమూడురోజులు కూర్చుని రాశాను. ప్రారంభించిన తేదీకాక పూర్తిచేసిన తేదీనే విషయానుక్రమణికలో ఇచ్చాను. మొదట కొంతవరకు రాసి, తర్వాత చాలా కాలానికి పూర్తిచేసిన గీతాలలో ముఖ్యమైనది 'జగన్నాథుని రథచక్రాలు.' ఇది ఎప్పటికీ అసంపూర్ణంగా ఉండిపోతుందేమో అని ఒక్కొక్కప్పుడు నాకే సందేహం కలిగేది. ఇదిలేకుండా మహాప్రస్థానం పూర్తికావడానికి వీల్లేదు. కాని తొందరపడి ఏదోవిధంగా రాసెయ్యడానికి యిష్టంలేదు. మహాప్రస్థానం సంపుటిలో మొట్టమొదటి గీతం మహాప్రస్థానం, చిట్టచివరి గీతం జగన్నాథుని రథచక్రాలు ఉండాలని నా ఉద్దేశం. ఎలాగైతేనేం అనుకొన్న విధంగా 1940 లో ఒకరోజు రథచక్రాలు రాయడం పూర్తి అయింది. కాని

# అగుమంచికథ

శ్రీ వేటూరి - ఆనందమూర్తిగారు

—(1)—

యాదవభారతమున ప్రధాన పురుషుఁడు కాటమరాజు అయినప్పటికి, నాతని నంటిపెట్టుకొని యవాంతరకథలు పెక్కులు, తత్కథాపురుషుని కాలమునకుఁ దర్వాత నాంధ్రదేశమున ప్రచారములోనికి వచ్చినవి. వానిలో కెల్ల కాటమరాజు చరిత్ర ప్రధానమైనది. కథాసంగతియుఁ గవితాసారస్యమునుగల యీ కాటమరాజుకథ జానపదుల నుత్సాహోద్వేగములను గొల్పి తత్కథావిస్తరణమున కవకాశమిచ్చినది. కాటమరాజు కథ నాధారముగా గొనియే యాదవచరిత్ర చిలువలుపలువలై భారతమంత యుద్గ్రంథమైనది. కాటమరాజు పశువుల మేపుకై నెల్లూరు కేగుట, పుల్లరి యొడబడి పశువుల మేపుట, నడుమ కారణాంతరముల వలన పుల్లరి నెగవేయుట, తత్కారణమున నెల్లూరి నలసిద్ధికిని గాటమరాజునకు నెఱగడ్డపాట యుద్ధము జరుగుట యాదిగాగల కాటమరాజు కథలోని రసవంతములైన పెక్కు కథాభాగములను విస్తరించి విడివిడిగా తర్వాతి కవులు తీర్చికొనినారు. వారజ్ఞాత పురుషులుగ నుండిపోయినను, వారి రచనలు మాత్రము నేటికిని చిరస్థాయిగ నిలచిపోయినవి. అట్టివానిలో భట్టు రాయబారము, ఎఱగడ్డపాటి పోట్లాట, కోటపాటి తాటివృక్షము తెచ్చుకథ, మొదలగున వితఃపూర్వము ప్రకటితములు. ఇట్లుదాత్తుఁడు, యాదవులకీర్తి ప్రతిష్ఠల నినుమడింపఁజేసిన వాఁడునైన కాటమరాజు ప్రధానముగాగల యాదవచరిత్ర కేవల మాతనిజీవిత చరిత్రతో మాత్రమేకాక తద్వంశపూర్వపురుషుల చిత్రవిచిత్రగాథలతోఁ బెరిగి పెద్దదైనది. ఇట్లెంచిచూడ యాదవచరిత్రయందు కథలో కాటమరాజునకు సంబంధించిన వ్యక్తులందఱిపేరిట తలకొక గాథ కలదనవచ్చును. వలురాజుచరిత్ర, వలురాజుయుద్ధము, పోలురాజు చరిత్ర, పంచలింగాల కొండయుద్ధము, పెద్దిరాజుకథ, కాటమరాజు చరిత్ర, ఆవులమేపు, భక్తిగన్నకథ, అగుమంచికథ — మొదలైనవన్నియు నట్టివే. ఇవి యన్నియు వినసాంప్రగ నుండి తెనుఁగువారికిఁ గథావాఙ్మయముపైగల మక్కువను చాటుచున్నవి. పోగా, నివియెల్ల యాదవచరిత్రకు సంబంధించినవే కావున యాదవులే వానిని చక్కజేసికొని సంరక్షించుకొనినారు, ప్రచారములోనికిని దెచ్చినారు. ఇది తెనుఁగుభాషలోని తీపి నెఱుఁగగోరువారి భాగ్యవిశేషము. వానినెల్ల సేకరించి, సంస్కరించి, ప్రకటించుట మనకర్తవ్యము.

ప్రస్తుత ప్రసంగము విషయము అగుమంచి కథ. ప్రాయికముగా నీకథ యాదవభారతమునందుది పర్వమనవచ్చును. పాలేటికడ జరగిన పోరులో నిరుపక్షములవారును సమసిపోవుదురు. యాదవ పురుషులకుఁ గైలాసపయనములు కలుగును. ఆవార్తలను బసువన్న దొనకొండకుఁ గొనివచ్చును. అంతట నచటి యాదవస్త్రీ లాభీర

---

కాలేదు. అందుచేత 40 తర్వాత వ్రాసిన నీడలు, నిజంగానే, గర్జించు రష్యా అనే గేయాలు కూడా యీ సంపుటిలో చేర్చాను. 1930 నుండి 50 దాకా చాలా అధివాస్తవిక గీతాలూ, హాస్యపద్యాలూ వ్రాసినప్పటికీ వాటిని విడివిడిగా అచ్చువెయ్యవలసి ఉంటుందని మహాప్రస్థానం సంపుటిలో చేర్చలేదు.

ఇదీ నా కవితా ప్రస్థానం కథ. అయితే 1930 కి పూర్వం వ్రాసిన పద్యాలను గురించి గాని, 50 తర్వాత రాస్తున్న రచనలను గురించి గాని ఇక్కడ ప్రస్తావించలేదు. కవిత్వమే కాదు ఏది రాద్దామనుకున్నా కృత్యాద్యవస్థే. అయిదు నిమిషాలలో రాసినా, అయిదేళ్ళలో రాసినా కృత్యాద్యవస్థే. ఒకసారి నేను ఒక్కరోజున పది సినిమాపాటలు రాశాను. పదిపదిహేను ఏళ్ళనుంచీ రాయాలనుకున్న 'సదసత్సంశయం' కింద చేడే ప్రారంభించాను. ఇంకా పూర్తి చెయ్యలేదేమని కొందరు మిత్రులు విసుగ్గా అడుగుతారు. వారికేమని జవాబు చెప్పడం? మరి కొంచెం వ్యవధి ఇవ్వండని అడగడం తప్ప?

(ఆల్ ఇండియా రేడియో, మద్రాసు కేంద్రం వారి సౌజన్యంతో.)

ణము లూడ్చి, యగ్ని కల్పించుకొని, యాహుతై పోవుదురు. పురుషులనుగూడి వారికిని గైలాస పయన మబ్బును. దానితో యాదవచరిత్ర సరి. ఈ కథలోకెల్ల ప్రధానపాత్ర యగుమంచి. ఆమె సిరిదేవి కూతురు. కాటమరా జామెకుఁ బితృవ్యపుత్రుఁడు. కాటమరాజాదులు యుద్ధమున కేగగా, వారి యాడువా రింటివద్ద దైవములను ప్రార్థించుచు, నన్నల క్షేమమ్మరయ గోరుచుండిరి. పాలేటి కడనుండి యుద్ధవార్తలు వడివడి రావయ్యెను. అప్పు డన్నల క్షేమ మ్మపేక్షించి యగుమంచి శివరాత్రి యుండగోరును. జంగములను, బ్రాహ్మణులను బిల్చి సత్కరించి, విందుగావించి, వారి యాశీర్వాదములను బడయును. ఆడువా రాసాడు శివుని ప్రార్థించి శివరాత్రి జాగరముంగురు.

“శివ! నీలకంఠ! యోాశ్రిత పారిజాత!
శివ! లోకరక్షక! చిన్మయాకార!
త్రిపురసంహార! యోదీనమందార!
పాపవిదూర! యోభక్తమందార!
గౌరీమనోహర! కైలాసవాస!
కరుణాంతరంగ! శ్రీకంఠ! సర్వేశ!
నందివాహనరూఢ! నాగభూషణుడ!
యెందును సరిలేరు చంద్రశేఖరుడ!”

అని కైవార మొనరింతురు. శివారాధన సేయు సందర్భమున శ్రీతాళి బిచ్చెము చెదరిపోవును. దాన నేదేని దోషము వాటిల్లునని వారి భయము. తద్దోషపరిహారణమునకై యగుమంచి తల్లి సిరిదేవి యనుజ్ఞగొని యుల్లమున్నను బంపి జయవారము చాటింపు సేయించును. పిదప వదినగారితో పగడసాల లాడును.

“ఇరుగో దుగాయని వదినయు వైచె
వదిగో బారాయని యగుమంచి వైచె
పగడసాలలనట్లు పడతు లిద్దఱును
సరిపంచె మాయెనని చాలించి రంత.”

శివరాత్రియుండిన మరునా డుదయమే యగుమంచి తలయంటుకో గోరి తల్లికి విన్నవించును. ‘కూతురి మాటకు గృపనిరికేవి-నీతితో కోడండ్ల నేర్పుతోఁ బిలచి - తరుణి యగుమంచికి తలయంటు’ మనును. అపుడు నల్లమేడ, పీర్లగంగ, మరిపోత, నూరమాంబ, నాగమాంబ, బయ్యమాంబ, చినమల్లు, మొదలైన కోడండ్లెడుగురు తామామె తలయంట తగమని మనవి చేసి

కొందురు. ఈ పట్టు చాల హృద్యముగనుండును. మచ్చున కొకకొంత—

‘కనుజాజి పూబంతి కస్తూరి మెకము
మన్నె రాజులదేవి మగువరోగంగ
అవులన్న కుచెల్లె లగుమంచికీవు
వేవేగ శిరసంట వెలదిరావమ్మ.’

* * *

‘అళినీలములబోలు నలివపెన్నెరులు
నెలతకు నేనంటు నేరమ్ము తగదు.’
మరిపోత మాటలు మదికిరానిచ్చి
పేరున బిలచెను నూరమాంబికను.
‘కట్టాణి ముత్యమ! కొంత నూరమ్మ!
అగుమంచి శిరసంట వమ్మగోకొమ్మ.’
ఆరూఢి సిరిదేవి యాడినందులకు
నూరమాంబిక పల్కె సుదతితోనపుడు.
‘తుమ్మెదరెక్కలు తోయ్యాలికురులు
నెమ్మితో నేనంట నేరనోయత్త!’
నూరమ్మమాటలు సుదతి సిరిదేవి
తీరుకాదని నెల్ప తిలకించి యంత
‘తిలకంబు నుదుటను దిద్దినావమ్మ
కలికినో బంగారు కళ్యాణ బొమ్మ
నాగమ్మకోడల నాతి! వమ్మ
అగుమంచికిని శిర సంటి పోవమ్మ.’
ఆరూఢిసిరిదేవి యాడినందులకు
నాగమాంబిక పల్కె నాతితోనపుడు
‘నీలమాణిక్యాలు నెరిగలకురులు
నీలవేణికి నంటు నేరమ్ము తగదు’
నాగమ్మమాట వినంగ సిరిదేవి
బాగుగా యరణప్పబయ్యాను బిలిచె.
‘అణిముత్యపు బొమ్మ అమ్మబయ్యమ్మ
చాన భూదేవికి సరివత్తువమ్మ.
మరిమరి చెప్పెద మగువ యగుమంచి
శిరసంటుదువుగాని శీఘ్రమే రమ్మ.’
ఆరూఢి సిరిదేవి యాడినందులకు
బయ్యమాంబికపల్కె భామతో నపుడు
‘మతిగల యగుమంచి మాధవునిచెల్లె
లతివల కాయమ నంటగారాదు’

ఇట్లు వారువారనగా తదుపరి సిరిదేవి ముద్దుకోడలు సిరిగిరమ్మను బిల్చి తలయంటు మనును. ఆమె దాని కొప్పి బంగారు గిన్నెలో నూనె బట్టుకొని తలయంటగా తరలివచ్చును. మార్గమున ద్వారబంధము తాకి తలచమురు చిందును. అందుకు భయమంది శ్రీదేవితో నావార్త తెలు

దగా వారెల్లరు నద్దాని నపశకునముగా నెంతురు. పిదప నల్లచెర్వుసమీపమున గల శృంగారపు పూదోటలో స్నానమున కమర్చి సిరిగిరమ్మ తల యంటును.

తలయంట నగుమంచి తరుణికి నేడు
పసిడిగిన్నెలను సంపఁగినూనె బోసి
చందన జవ్వాజి సఖియలు తెచ్చి
నలుఁగిడు డని చెప్ప నాతి యగుమంచి
కావేళ నలుఁగులు వేవేగ నిడిరి.
తులలేని శృంగారతోటలోపలికి
నలుగాడ నగుమంచి నయమైన యట్లు
నడకర యంచలు నడయాడునట్లు
నెమ్మదిగా తోడు నెలతలు రాగ
నిమ్మమ్రాకులనీడ నీటుగా రత్న
ఖచితమైనటువంటి కనకపీఠమున
నగుమంచి కూర్చుండె నంతలో సఖులు
మక్కువతో శీకాయ మర్దించినారు.
శీకాయ వేవేగ శిరసున బెట్టి
కురులు వెళ్ళంగ సఖులు తలరుద్ది
వరుసతో జలకము వాంఛ తీర్చికపుడు
చెలువైన బంగారు చెంబులముంచి
తలమీద బోసిరి దాదులందరును
జననాథు చెల్లెలు జలకంబులాడి
పొడవైన వస్త్రంబు పొలుపుగా జుట్టి
పిదప వేసుకు తల పీఠంబు పైని
పొలుపైన పుత్తడి బొమ్మయన్నట్లు
నిలుచుండి సురపొన్న నీడల చేరి
శిరసార్చుకొనియెను సిరిదేవి పుత్రి.

ఈ లోపుగా నగుమంచి యాడిన నీరంతయు వెల్లువలై పూదోటలో నరటులకుఁ బనసలకుఁ బ్రవహించును. అదిచూచి యచ్చటికేతెంచిన యత్తకొమరమ్మ శివరాత్రి తానుండి శిరసంటుకోగా పారిన నీళ్ళు లగుట, దానివలన కలిగిన దుష్ఫలితములు వివరించుచు, వలురాజు, పోలురాజు, సింహాద్రిరాజు, పెద్దరాజు, ఎరనూకరాజు, నలనూకరాజు, అయితమరాజు మొదలగు వారి కథాప్రసంగములను గొనివచ్చును. తానా నాడాడిన నీళ్ళేలగుట కారణముగనే తనవారు మడిసిరట. అందలాలగ్గి పాలాయెనట. అన్నియు రుత్తలయ్యెనట. తరతరముల పెద్దలు తమవద్ద చెల్లిరట. ఇట్లుగా నేమేమో విషపువార్తలు కొమరమ్మ మేనకోడలికి విని పించిపోవును. దానితో నగుమంచి గుండెలు నీరగును. అపశకునమాడినందుల కత్తమీఁద కోప మున్నను వెఱపుమాత్ర మామెను వీడి పోలేదు. కొమరమ్మ వెడలిపోయిన తర్వాత కోడ లరమదినిండిన వెఱపుతోడ నేయలంకరించు కోబోవును. అన్నలు తనమీఁద నతిప్రేమతో నిచ్చిన వారవారాలసొమ్ములు వరుసతో పెట్టుకొని, చీరలు సొమ్ములు తీరుగా దిద్దుకొని, యందమద్దములోఁ జూడబోవును. కాని యన్నియు నపశకునములే గోచరించునవి. అద్దములో చీరమాసినట్లగుపించును. నగలు నాణెము తప్పినట్లుండును. తడవ తడవ కామె గుండెలు దడదడ లాడిపోవును. భక్తిరన్న, కొటయ్య, అయితన్న, వల్లభన్న, కరియావులన్న, ఎరనన్న, ముమ్మయ్య, భీమన్న, బీరన్న మొదలుగాగలవార లిచ్చిన చీరలు నగలు తీరు తప్పిపోవును. ఇక—

“అన్న లిచ్చిన సొమ్ము లనువుగా ననుచు
వన్నెగ పురుషుని వారాలసొమ్ము
లగుమంచి తాలిమినపుడు తా బెట్ట
పూలమాంజిష్ఠను బూని తాగట్టె
పులిగోరు అవికెను బూని తాదొడిగె
మొలకచన్నులమీఁద మెఁగి బన్నసరము
లత్తుకొన ముత్యాల హారాలు బెట్టి
సందిట కడియాలు సఖియ తాజుట్టి
బంగారు కుచ్చుల బవిరంచుకమ్మ
పొంగుచు నలివేణి పొసగంగ బెట్టి
పసిడి వడ్డాణంబు బాగుగా బెట్టి
చెంగైన బంగారు చెరగుల చీర
రంగుగా ధరియించి రత్నాలసొమ్ము
లగుమంచి యంతట నందాలభరిణె
వేడ్కతో నద్దంబు వేమారు జూచె.”

అప్పుడు—

“అద్దంబులోపల నాచీర నగలు
పుడమీశు చెల్లికి పూలమాంజిష్ఠ
పొంకమై యుండెను పులిగోరు అవిక
పిక్కటిలి యపుడు బిగువుగా నుండె
నరయంగ సొమ్ముల కటుకాంతివచ్చె
మేనికి బంగారు మేలిమి హెచ్చె.”

అందుల కామె యానంద మొంది తమకు కైలాసపయనాలు తప్పక కల్గునని తలచును. అగుమంచి పేర్పేర నతివలందఱను బిలచి కొమరమ్మతోఁగూడి ముత్యాలపాలకినెక్కి పయనమగును. గుడిలోని గంగను గూడ వేడంగ నాడు

వారు తోడరాగ నందరును బోవుదురు. అగుసు గంధములతో గంగ నలంకరింతురు ధూపదీప ములు పెట్టుదురు. కాని గంగ కళదప్పి కన్ప డును. దూర్వాసుశాపంబు దొనకొండ తగిలె ననుకొందురు. గంగను నిష్ఠతో ప్రార్థనజేసి పడతులందరును హారతి పళ్లెములఁబట్టి వేమారు గంగను వేడుకొందురు. బోనాలు పెట్టింతురు.

'చక్కని మాయన్న సంగ్రామజయుఁడు
కక్కసపు వైరి కంఠీర వుండు
సేనలు దానును క్షేమానవస్తె
మానిని! యెత్తైనమలల నున్నట్టి
యేపెలు నరికించి యెలమి బండిసిల్లు
మ్మాపటి కాడింతు మా తల్లి నీకు.'

అని యగుమంచి పరిపరివిధముల ప్రార్థించును. ముందు జడ లిడుదుననియు, చేతిపూటిత్తు ననియు, బొరిగుండము జొత్తుననియు, పదివేల దివ్వెలెత్తింతుననియు, కుంకుమబండ్లు తోలింతు ననియు, మ్రొక్కుకొనును. తుదకు

'బసువన్నగోకుల పరమపుణ్యుండు
నెస లక్ష్మయాదవ పీరకంపటము
నక్షయ మొనరించి యాదుకోవమ్మ
దక్షిణపాలేట తల్లిగో గంగ!'

అని వేడును. అప్పుడు గంగ పొరిపొరి దుఃఖించును. 'దడదడ మని గంగ తల్లడమంది—గుడి లోని గంగమ్మగుడి యెత్తు పెరిగె', నందుకు 'సిరి దేవి మొదలైన నెలువలందరును - పొరిపొరి దుఃఖించి పొగిలి రందఱును, తామరసీకులై తల్లడమంది — కుమిలిపోయిరి మేనుకుమ్మ రావమగ.'

'ఇంతిరో యాదొలకిలవేల్ప వనగ
కాంతిఃహసితివేమి గతియేమి మాకు!
మున్నుఃహకెల్లను ముదముతోనీవు
మిన్నుఃదిగివచ్చి మీఁద వ్రాలినను
అరచేత నాపెద నంటివోతల్లి!
అరచేతి నాపక నన్నలమీద
దయదప్ప విడచితె తల్లిరోగంగ!-"

అని దీనాలాపము గావించి యిక్కట్టు తెలుప నోరాడదేని తనకు స్వప్నమున యావద్వృత్తాంత మును తెలుపుమని యగుమంచి గంగను వేడు కోగా, నంతయు నింటికివత్తురు. రాత్రి నిద్దురలో నుండగా పలదేవత గంగ యగుమంచిని లేపి కలనికార్యమెల్ల కలలో వివరించును. కానికలను జెప్పి గంగమ్మ కదలిపోగా తత్తరమంది యగు

మంచి దాసులఁ బిలచి, యత్తచే నంపించుకొని, తల్లికీవార్తఁ దెలుప నారాతిరే బయలుదేరి పోవును. అర్ధరాత్రిపూట నయితన్న పేరుబెట్టు కొని తలుపుఁ దట్టగా సిరిదేవి యాతఁడే వచ్చె నని తటాలున తలుపు తెఱచును. కాని యెదుట నగుమంచి ప్రత్యక్షమగును. అప్పుడామె వెఱగంది యిట్లనును.

"నాతిరో! అక్కన్న నాముద్దుపట్టి
నీతికాదీవేళ నీకు రాదగునె?
రాజులేకనె నగరంబును వెడలి
గాజెల్లు నటవమ్మ రమణిరో నీకు?
మీయత్త కొమిరమ్మ మేనవారనుచు
వీయ మందుట నాకు విషమాయెనమ్మ!
యేప్రొద్దు నాడిక లెవరెవరితోడ
తాపత్రయపుమాట తలపోయునమ్మ!
కలవారియిండ్లను గడుపేదవారు
తెలియక వియ్యము నిలచేయరాదు.
పుట్టింట నుందని యూరివారలతో
నట్టిట్టు లాడునే యత్తకొమరక్క.
అలవిగానివేళ నర్ధరాత్రాయె
ఫలితంబు తెలిసియు పడతిరాదగునె
యేమివార్తలయిన నింతలే దనక
యామెతో చెప్పినీ వంపించుకొన్న
మేనవారముమందె మేలమ్మ చేయ
మనవంటివారికి మరినీతికాదు."

అనును. దాని కగుమంచి యత్తచేత నంపించు కొన్నవార్త వివరించి, కలఁగాంచిన కలవరము తెల్పును. అమ్మ శ్రీదేవియు దాన నపశకునము నెంచును. ఆవులన్న దేవియైన గంగ దివ్య విషయములు తెలిసినది కనుక కలను వివరింపఁ గాంతలు వేడుదురు. అగుమంచి కల జెప్పును. గంగమ కల విప్పును.

కొంగలవార్తలు కలగానువచ్చె.
నావార్త పరిణామ మెఱుచెల్లిరంత
దేవరేవుండిదే తెలుపంగవచ్చె.
తెల్లవారగవచ్చె తెలియంగలేవె
కలనెంచి యగుమంచి ఘనవీరగంగ
కలజెప్ప కలవిప్ప కడుతెల్లవార
నుదయాద్రి శిఖరాన నుదయించె నినుడు
సేప్పన యాదవ నెలత లందరును
నతివేగ లేచిరి "హరహరా!" యనుచు."

ఇంతటితో నసంపూర్ణముగా నగుమంచికథ ముగియుచున్నది. లభ్యమైన వ్రాతప్రతిలో

నింతకుఁ దర్వాత శిథిలమై యున్నది. దీని పై కథ యేమగునో యిందు తెలియరాకున్నను తదితర కథాప్రసంగములబట్టి తెల్లముగా దెలియనగును. అట్లు మన కుపయోగపడు కథాభాగములలో "భక్తిరన్నకథ" యొకటి. ఇదియు నగుమంచికథ వలెనే యాదవ చరిత్రలో తుదిఘట్టమున నుండును. భక్తిరన్న కూడ కొటమ రాజాదులకు పితృవ్యపుత్రుఁడు. అతఁడు చిన్ననాటనే కాశికిఁ బోవును. అతని చరిత్రయు చిత్రమైనదే. తుద కొకనాడు గయలో పిండము బెట్టుచుండగా నాతనికి యాదవులు కైలాసమేగుట గోచరించును. అప్పు డాతఁడు దొనకొండకు తిరుగు ప్రయాణము చేయును. అప్పటికే పాలేటివార్తలు బసువన్న కొనిరాగా దొనకొండలోని యాదవ స్త్రీలు అగ్ని కాహుతి యగుదురు. [ఈ పట్టున కొంత "భక్తిరన్న" కథాభాగ ముదరింతును. పాలేటినుండి బసువన్న రాగా కాలగతి తెలియగోరి

చేమపూ కడియాలు చేర్చుక్క బొట్లు
బంగారు కడియాలు పసిడిరేకలును
కొల్లగా ముత్యాల కుచ్చుల పేర్లు
కనకంపు మట్టెలు కాళ్ల పిల్లెండ్లు
వీరబొబ్బిలికాయ వెండుంగరాలు
పైరైన సొమ్ములు పెట్టెనగుమంచి
పణతికంకణములు పట్టుపుట్టములు
వారాలసొమ్ములు వరుస ధరించి
బసువన్న కడకును పయనమై వచ్చి

దీనమై యున్న బసువన్న మోముజూచి సంగతి యేమని, గతియేమని ప్రశ్నించును.

అగుమంచి మాటలకా బసువన్న
యాకాళమునుజూచె నత్తెత్తి యపుడు
జలజల కన్నీరు జడిబట్టినట్లు
రక్తము కన్నుల రాలిచె నంత

అపుడు—

అడలంగ బసువన్న నగుమంచి చూచి
పాలేటి వారల పగవారికిచ్చి
"నీలకంఠదేవుడా నిజవార్త దెస్తివా ?
పరిణామములు చెప్ప బసువన్న వస్తివా ?"

అని పృచ్ఛించును. చేయునదిలేక సూరివారందరిని పేర్వరబిలచి పురిటివారిని, పసిబిడ్డలను, ముసలులను పట్నము వెళ్ళనంపును. గొలుసులు తప్పించి పక్షులను మృగములను విడిపించును. గుండము త్రవ్వించి, "గంధపు తలుపులు ఖండించి పేర్చి-మందర సనిమూక మేళమ్ము మ్రోయ" తనవారి నందరిని బిలచును.

"మత్తేభముల నడుపు ముత్యాల బొమ్మ
బత్తిరన్న నల్లమేడ కట్టాయత్తపడుమా
సిరిముద్దు మెంగముల చింతాకు ప్రతిమ
కరియానులనాగ కట్టాయత్తపడుమా
నాతిగోనిమేను నల్లరటెపండు
నేలివారి పోత కట్టాయత్తపడుమా
మల్లెపూవులబంతి మగువ చామంతి
వల్లభన్నయ సూర కట్టాయత్తపడుమా
మాటకు మాంచాల మగువగో గంగ
కొటమన్నగంగ కట్టాయత్తపడుమా
కొదమసింహము చిలుకకోకిలవాణి
పద్మనాయని తల్లి కట్టాయత్తపడుమా"

పిదప నందరును గలిసి గుండమునకు నడతురు.

మరి వేగ నగ్నిచే మడిసిరందరును
భక్తుని నల్లమేడ పడతివీరగంగ
కరియానులగంగ కొంతలందరును
అరగిరి యానాడు అద్భుతంబుగను
కనకరథములలో కైలాసమునకు

భక్తిరన్నయు వీరిని కలిసికొనును. అందరకుఁ గైలాస మబ్బును.]

ఇదియే నగుమంచి కథాసారము. కథావస్తువల్పమైనప్పటికి కవితాసామగ్రి యనల్పమైనది. తెలుఁగుదనము పుక్కిలించు తీరుగల దేశిరచన. పామరుల నోళ్ళలోఁబడి భ్రష్టమై లభించినదిగాని లేకున్న దీనిరచన లోకోత్తరముగ నుండియుండునని యూహింపనగుచున్నది. చక్కనిభావన, జతగూడిన కవితకల్గి యీకథ తెల్గుజాతీయేతివృత్తములో [illegible] ను మీరి యున్నది. కొంత యానాటి తెల్గునాటి యాచార వ్యవహారముల ప్రతిబింబించునదిగా నున్నది. మేనవారితో సంబంధము, కలిగిన వారితో లేనివారి బాంధవ్యము—తత్సందర్భములు నిందుకొంత వివరింపఁబడినవి.

పదజాలము :- దేశి తెల్గుపదజాలముతో నీ రచన సాగి వన్నెవచ్చినది. తురుటు వార్తలు (గొంచు); యత్తి (లయ్యాని); బండినిల్లు; వావ్వరంబులరీతి (వదినెలందరును - చెంపలు ముడిచిరి చేరకొప్పుల్లు); వారాలసొమ్ములు; సూర్యసోమవీథులు—ఇత్యాది చిత్రార్థములుగల పదజాల మిందున్నది. వీని కించుక వివరణము.

తురుతువార్త:-వేగముగా వచ్చువార్త. త్వర త్వరగావచ్చువార్త. (తొరతొరగారావాలి-వ్యవహారము.) త్వరితశబ్దము హిందీ, మరాఠీ లలో తురంతు గామారిన పరిణామమే తుఱుతు. (తుఱుతుగా రమ్ము అనియు వ్యవహారమున్నది.)

రుత్త:-నాశము అని రూఢ్యర్థము. వ్యర్థమగుట యని యౌగికార్థము. రిక్త శబ్దభవమని తలతును. (వానిరూపు రుత్తాయెనుపో; రుత్తు మాట లెంకకు— అని వ్యవహారము.)

బండిసిల్లి:- శివుఁడు త్రిపురాసురులఁ గూలఁదోలుట శివమహిమలకు ప్రతీకరము. "అంభోధరము క్రింద నసియాడు నైరావతియుఁ బోలె సిడి త్రేలె తెలియవచ్చె" పాం.మా. 3 ఆ.-సిల్లి గంపసిడి, గాలపుసిడి అనిద్వివిధము లని శ.ర. లో గలదు. గంపసిడియే బండసిడి కావచ్చును.

వాపురము:-వాపువశబ్దమునకు వ్యత్యస్తరూపము (పావురము—పావుఁవమువలె) వాపురంబుల రీతి చెంపలు ముడుచుకొను తీరని. గుజ్జుపు తోకవలె వంపుతిరిగి చెవుల వెనుకకు జారు చెంపకట్టు నిట్లందురు. ("నిలతాల్పు నేవ డమ్ములకు నై వేల్పుబోనమ్మ యిచ్చిన వావు రమ్ము వాయు" అని రాజవాహన విజయము లోని ప్రయోగమునుజూపి దీనిఁ సరియైన ప్రయోగము చిక్కనందుకొరకు —అని శ.ర. కారులు వ్రాసినారు.)

వారాలసొమ్ములు: వారమనగ మూఁడు. వారాల సొమ్ములనగా దినదిన మొకటిగా వరుసగా పెట్టుకొను సొమ్ములని యర్థము. పెద్దింటి వారు, కలిగినవారు పెట్టిన సొమ్ము పెట్టకుండ వారమున కొకటి చొప్పున యేడు వారములకు నేడు రకముల నగలు పెట్టుకొందురు. ఈ యలవాటు నేటికిని మన దేశమున గలదు. వీనినే వారాల సొమ్ములని, ఏడువారాల సొమ్ములని, ఏడువారాల సొమ్ములనియందురు. (ఏడువారాల సొమ్ములు పోయినట్లేడుస్తావేం? అని వ్యవహారము)

సూర్యసోమవీధులు : ఈ శబ్దమయితే పలుచోట్ల కానవచ్చినది కాని దీని యర్థమేమో యిటీవలి దనుక నాకెఱుగరాలేదు. 'సూర్యసోమవీధు' లని తాళ్లపాకవారి సంకీర్తనల లోను; 'సూర్యసోమవీధులు తిరిగి' యని కృష్ణమాచార్య సంకీర్తన ములలోను; 'సూర్యసోమవీధులఁ జొచ్చి' యని కాటమ రాజు కథలోను; 'సూర్యసోమవీధులు చాటి' యని యిందును గానవచ్చినది. నాలుగు వీధులు చాటుట, నాలుగు వీధులు తిరుగుట యని వీని యర్థమగునని స్థూలముగా సందర్భమునుబట్టి గుర్తించితినిగాని స్పష్టముకాలేదు. ఇటీవల దక్షిణ హిందూదేశ శాసన సంపుటి ఏడవవాల్యూం చదువుచుండగా చిత్రమైన పైపద స్వరూపమందు నాకు కానవచ్చినది. [1]సోమసూర్యవీధులు కలియు దిక్కు ఈశాన్యమట. అనఁగా, తూరుపు, ఉత్తర వీధులు కలియుదిక్కు; సూర్యవీధి-తూర్పు వీధి, సోమవీధి-ఉత్తరవీధి. ఈ యాధారమునుబట్టి నే నూహించిన యర్థము సరియైనదే నని నిర్ధారించుకొంటిని. సూర్యవీధి మొదలు సోమవీధి వఱకుఁగల నాలుగు వీధులను చుట్టుట, ప్రదక్షిణము సేయుట అని యర్థమగును. (ఈ శబ్దము శబ్దరత్నాకరాదులలో కానరాలేదు.)

ఇవికాక కొన్ని యాభరణముల పేరులిందుదాహరింపఁబడినవి. వానిలో "గింటెన గంటి" అని యొక యాభరణము పేరున్నది. ఇదియేమో యెఱుగరాలేదు. (కుంటెన కుచ్చులను పేరుగల యొడ్డ్యాలనెడి కర్ణభూషా విశేషమొకటి శరలో నుదాహరింపబడినది.)

ఇట్లు సుందరమైన యగుమంచి కథారచనా సారస్యము నెఱుగుట కిది స్థూలమాత్రమైన ప్రశంస, కీర్తిశ్రేష్ఠులు శ్రీ వేటూరి-ప్రభాకర శాస్త్రిగారు సేకరించియుంచిన యీ కథను, గండరాయి యాదవులు కొనివచ్చి యిచ్చిన ప్రతులతో సంప్రదించితిని. శ్రీవారు నాకు కల్పించిన కాటమరాజు కథాపరిచయ పరిజ్ఞానముతో వానినెల్ల పరిశీలించి సంస్కరించియుంచితిని. అగుమంచి కథను స్వయముగా చదివి యానందింపగోరువారికై దానిశుద్ధ ప్రతిని మరుచటి సంచికలో ప్రకటింపఁ దలచితిని. ఇది యే కాక క్రమమున మాయొద్దగల యాదవకథల నన్నిటిని సంస్కరించి ప్రకటింప నుత్సహించుచున్నాను. సహృదయులు స్వీకరింతురు గాక

1. S. I. vol., VII No. 736 (A. R No 113 of 1902)
[illegible] గ్రామములోని శాసనము. "...అంగడి ఉత్తరవీధి కడపట

# రాజమహేంద్రవరం పూర్వపు పేరేమి?

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావుగారు

సముద్రగుప్తుడు దక్షిణ హిందూదేశంలోని కొన్ని రాజ్యాలను క్రీ.శ. 342-43లో జయించి, తన విజయాలన్నిటిని అలహాబాదు శాసనంలో పేర్కొన్నాడు. అతను 'ఆవముక్తక' ప్రదేశాన్ని పాలిస్తూన్న నీలరాజును జయించేనని తెలిపేడు. 'ఆవముక్తక' లేక 'ఆవముక్త' ప్రదేశమేది? Early Dynasties of Andhra Desa [1] అను పుస్తకంలో చరిత్రకారుడు ఆవముక్తమను దేశం గోదావరి ఉత్తర ప్రాంతంలో రాజమహేంద్రవరానికి ముప్పైమైళ్ళ దూరాన ఉండవచ్చునీ, అక్కడఉన్న రామదుర్గం అను ఊరిలో కోటఉండిన చిన్నెలు ఉన్నాయనీ, ఆ రామదుర్గాన్నే సముద్రగుప్తుడు జయించిఉంటాడనీ చెప్పిఅంతటితో ముగించక 'అర్వర్ నాయ్' అనుమరొక మాటయొక్క ప్రదేశాన్ని గుర్తించబోయి, మొదటచెప్పిన అర్థాన్ని విడిచిపెట్టి, క్రమక్రమంగా ఆవముక్తం అనేది కడప, కర్నూలు జిల్లాలలో ఉంది అని చెప్పేరు. మొదట సరియైన దారిలోనే బయలుదేరి తర్వాత తప్పుదారిలో పడిందని చెప్పవలసి వస్తుంది.

ఆవముక్తం ఏది?

రాజమహేంద్రవర పట్టణంతూర్పుపరిసరాలలోని కొంత ప్రాంతాన్ని 'ఆవ' అంటారు. ఇదంతా బురదనేల. ఇక్కడ పూర్వకాలంలో గోదావరి యొక్క ఉపశాఖ ఉండేదనీ, అదినశించి ఈ బురదనేల తయారయిందనీచెప్పుతారు. నశించిన ఆ ఉపనది పేరే 'ఆవ' అని చెప్పవచ్చు. ఆ ఉపనది ప్రవహించిన స్థలమంతా ఆవముక్తకం లేక ఆవముక్తం అని గ్రహించవచ్చు. ఈ ఆవముక్త రాజ్యాన్ని పరిపాలించిన రాజు పేరు నీలరాజు అని పైశాసనంలో చెప్పబడింది.

## ఆ వ లు

ఆవలు అనుజాతివారు సాతవాహనుల పరిపాలనకాలంలో [2] ఉన్నారని చెప్పబడింది. వారు ఆంధ్రులా కారా అనువిషయం ఆలా గుంచుదాం. వారు ఆవముక్త దేశస్థులని వారి పేరునుబట్టి తెలుస్తూంది. క్రీ. పూ. 200 కి పూర్వంనుంచి ఈ తెగవారు ప్రసిద్ధిచెంది ఉన్నారు. వీరి పూర్వచరిత్ర అంతమట్టుకే తెలుస్తూంది. కాని వీరు సముద్రగుప్తుని కాలంలో క్రీ. శ. 342 ప్రాంతంలో సుప్రసిద్ధులుగా ఉంటూన్నట్లు పై శాసనమే చెప్పుతూంది. ఆవలు దేశీయులా (Natives), లేక విదేశంనుంచి వచ్చినవారా అని చర్చించడానికి మనకు తగిన సామగ్రిలేదు. కాని గోదావరిజిల్లాలలో అవకుపాములు అను ఒకనుడిఉంది. దీనిని బట్టి ఆవలు నాగజాతికి సంబంధించిన వారేమో అనిపిస్తూంది. అవ అంటే వ్యాఘ్రము అని ఆంధ్ర వాచస్పత్యంలోని అర్థం.

## ఆ వ రా జు లు

సంస్కృత భాగవత, విష్ణుపురాణాలలో 'ఆవలు' అను రాజులు పేర్కొనబడి, వారు ఆంధ్రులు అని చెప్పబడ్డారు. తెలుగుదేశంలో ఉన్నవారి నందరిని 'ఆంధ్రులు' అని పేర్కొనడం సహజం. అదటుంచి, ఆవముక్తకదేశాన్ని పాలించిన రాజులు ఆవరాజులు అని తెలుస్తూంది. అలహాబాదు శాసనంలోని నీలరాజు ఆవరాజులలో ఒకడు అని గ్రహించవచ్చు. రామచంద్రపురం తాలూకాలో నీలంపల్లికి, నీలరాజు పేరుకి ఏమైన సంబంధముందా? నీలంపల్లిలో నీలంరాజు గోవాలుఅను మామిడిమళ్ళు ప్రసిద్ధమైనవి. ఈ నీలంరాజు పైరాజుయొక్క పేరే కాని మరొకటికాదు- అని చెప్పవచ్చు. దీనినిబట్టి మరొక అంశం బోధపడుతూంది. ఆవముక్త దేశం పైన జెప్పిన నీలంపల్లివరకు ఉండేదనిచెప్పవచ్చు. ఇంకా ఎంత విస్తారమైన రాజ్యమో చెప్పలేము.

---

1. Early Dynasties of Andhra Desa by B. V. Krishna Rao Garu, P 368-369.
2. Early Dynasties of Andhra Desa P 347.

## ముఖ్యపట్టణం పేరేమి?

ఆవముక్తరాజ్యం యొక్క ముఖ్యపట్టణమేదై ఉండవచ్చు అను ప్రశ్న బయలుదేరుతూంది.

కళింగరాజైన ఖారవేలుడు (క్రీ. పూ. 200 ప్రాంతం) 'పితుంద' అను ముఖ్యపట్టణాన్ని ఏలుతూన్న ఆవరాజును జయించేనని తన శాసనంలో తెలియచేసేడు. ఆవరాజుయొక్క పేరు మాత్రం తెలియడంలేదు. టాలెమీ అను విదేశ భూగోళశాస్త్రజ్ఞుడు 'మైసోలియ' (కృష్ణానది ప్రదేశం)కు తూర్పుగా 'పితుంద్ర' అను పెద్ద పట్టణముంది అన్నాడు. ఇక్కడ ఒక అంశం విశదమౌతూంది. ఆవరాజ్యానికొక ముఖ్యపట్టణముంది; దానిపేరు పితుందలేక పితుంద్ర. అయితే ఇది ఏదై ఉండవచ్చు? ఆవముక్తరాజ్యం గోదావరీనదికి ఉత్తరతీరాన రాజమహేంద్రవరం చుట్టుపట్ల ప్రదేశమని ఇదివరకే తెలుసుకొన్నాము. రాజమహేంద్రవరం ఉన్నస్థలానికి సహజరక్షణ ఉంది. ఒకవైపు గోదావరి, రెండోవైపు దాని ఉపశాఖయైన ఆవ ఉన్నాయి. ఈస్థలం ముఖ్యపట్టణంగా గ్రహించతగి ఉంది. కాబట్టి ఆవముక్తరాజ్యానికి ముఖ్యపట్టణమని చెప్పబడ్డ పితుంద్ర ఇప్పటి రాజమహేంద్రవరంయొక్క పూర్వపు పేరు కావచ్చు. రాజమహేంద్రవరానికి సుమారు పదిహేనుమైళ్ళ దూరంలో మహేంద్రవాడ అను ఊరు ఉంది. అది ఎంతకాలంనుంచి ఉందో తెలియదు. కాని అదిచాల చిన్నస్థలమై సహజ రక్షణ లేనిదవడంచేత పితుంద్రనగరం అదికాదని చెప్పవచ్చు.

రాజమహేంద్రవరంలోని 'మహేంద్ర' పదానికి 'పితుంద్ర'కీ మాటపోలిక కొంత ఉంది. పితుంద్రపదమే నానాటికి మహేంద్రగా మారి ఉండవచ్చు. అప్పటి రాజమహేంద్రవరం చాల పురాతన పట్టణమవుతుంది. ఆ ప్రాంతాన్ని ఎప్పుడో పాలించిన రాజు 'పితుంద్ర' అను తన పేరున పట్టణం కట్టించిఉంటాడు. పితుంద్ర యొక్క అర్థాన్ని తెలుసుకోడానికి ప్రయత్నించుదాం.

ఆంధ్రవంశరాజులు కొంతకాలం వేంగి ముఖ్యపట్టణంగా వేంగినాటిని పాలించేరు. ఆంధ్రవంశంవారు పైశాచీజాతికి చెందినవారు.[1] ఆర్యులకంటె పూర్వులు పైశాచీజనులు. వారంటే ఆర్యులకు గర్భశత్రుత్వం. కాబట్టి వారిపదాలన్నిటికీ తాము దుష్టార్థాలనుసాధించుకొన్నారు. ఆర్యులు రాకపూర్వమే తెలుగుభాషలో చేరిపోయిన పైశాచీపదాలు తొలిఅర్థాలలోనె ఇప్పటికి మనలో వాడుకలో ఉన్నాయి.

ఉదా:—పిసాళించు అంటే ప్రకాశించు అని అర్థం. ఇది పైశాచీభాషలోంచి వచ్చిన పదమే[2]! పిశాచ అనుమాటకు ఆర్యులు దయ్యం అనే అర్థాన్ని ఏర్పాటుచేసుకొన్నారు. అది శత్రుత్వఫలితం.

'పితంద్ర' అనుపేరు వేంగినాటి రాజైన ఒక ఆంధ్రరాజు పేరై ఉండవచ్చు. ఆ వంశంరాజుల పేర్లచివర 'ఆంధ్ర' అనుపదం ఉండక తప్పదు.

ఉదా:— శ్రీకాకుళాంధ్ర. ఇట్టిదే పితంద్ర పదంకూడా. ఈ పదంయొక్క అసలు అర్థాన్ని గ్రహించడానికి ప్రయత్నించుదాం.

ఆంధ్రవంశ రాజుల నామాలన్నీ సూర్యుడికి సంబంధించి ఉంటాయి. ఎందుచేతంటే వారు సూర్యారాధకులు. పితృ అను మాటకు సూర్యుడు అని ఒక అర్థం. ఆ పదమున్న ఒక సమాసాన్ని చూడండి:—

పితృ ప్రసువు = ప్రొద్దు పొడుచుటకు ముందైదు గడియల వరకును, ప్రొద్దు గుంకిన వెనుక మూడుగడియల వరకును (ఆంధ్రవాచస్పత్యం). కాబట్టి పితృసంబంధమైన పేరు పిత. రాజు పేరు పితాంధ్ర. అది ప్రాకృత భాషలో పితంద్ర. ఇట్లు ఆంధ్రవంశి రాజులలో ఒకడైన పితంద్ర తన పేరున ఆ పట్టణాన్ని నిర్మించేడు అని చెప్పవచ్చు. ఈ పేరే క్రమంగా మహేంద్ర అని మారింది. దీనికి జననాథపురమని మరొక పేరు పర్యాయపదం మాత్రమే కావచ్చు. జన

[తరువాయి 65 వ పేజిలో]

1. మన ప్రారంభఘట్టం అను నా వ్యాసములో ఈ విషయం వివరించబడింది.

2. J. A H. R. S. Vol. XVI లో చిలుకూరి నారాయణరావుగారి Dardic and Dravidic అనువ్యాసం.

# పలుకుబళ్లు - పదబంధాలు

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు



ఈ నడుమ అన్నమాచార్యుల లఘుకృతులలో నొకటగు 'శృంగార మంజరి' యను ద్విపద రచనను చదువుచుండగా నందొకచో, "తొలంగక పులకలు తోఁద్రోపులాడ" యను పాదమున "తోఁద్రోపులు" అను పద మొకటి కనంబడినది. దీనికి పుట క్రింద నీయబడిన టిప్పణిలో 'తో'-వెంబడిగా' అని అర్థము చెప్పబడియున్నది. "తోఁద్రోపులాడు" అనునట్టి పలుకుబడి, లేదా పదబంధము-తెలుఁగుభాషలో కలదా యను సందేహము కలిగి శబ్దరత్నాకరమున జూడగా అందు "త్రోద్రోపు" అను రూపములే గాని 'తోఁద్రోపులాడు' అను రూపము గ్రహింపబడి యుండలేదు. ఆ "త్రోద్రోపు"-అనునది త్రోపు+త్రోపు-శబ్దముల కూండికచే నేర్పడినట్లును, దానికి "మిక్కిలి త్రోపు"-అని యర్థమైనట్లును, త్రోద్రోపులాడు-అనుదానికి 'మిక్కిలి త్రోయు, (బలాత్కారము చేసి త్రోయు)' అని యర్థమైనట్లును దెలుపబడియున్నది. ఒకవేళ పదాదియందలి రేఫ సంయుక్తాక్షరములలో రేఫ మొక్కొకపుడు జారవిడువబడుచుండుట యిటీవలి సంప్రదాయముగాఁ దెలుగుభాషలో గానవచ్చుచుండినను (cf మ్రాను-మాను, వ్రేలు-వేలు, క్రిందు-కిందు, మ్రోగు-మోగు, క్రొవ్వు-కొవ్వు త్రోయు-తోయు ఇత్యాదుల నేకములు గలవు) "త్రోద్రోపు" అను పదబంధములో తొలి యక్షరమునందలి రేఫ జారవిడువబడినట్లగపడదు. ఒకవేళ పై శబ్దములలో వలెనే యీ పదబంధమునగూడ జారవిడువబడిన రూపమునే అన్నమాచార్యులు వాడెనేమో యనుకొన్నాను. అప్పుడది 'తోద్రోపు' కావలెనే గాని 'తో' తరువాత నరసున్న వచ్చుటకు కారణము లేదు. ఈ శబ్దము 'త్రోద్రోపు' అని కాక 'తోఁద్రోపు' అని తలంపబడుటచేత నే-అనగా నా తెలుగు పలుకుబడి గుర్తింపబడక పోవుటచేతనే - తొలివర్ణము 'సహార్థకం'బగు తోడ శబ్ద రూపంబగు'తో' అని తలంపబడుటయు, తరువాతి 'ద్రోపు' అను దానిలోని సరళ'ద'కారమును సమర్థించుటకుగా నరసున్న స్వరమును దాని పూర్వముగ జేర్చి, తోఁ-వెంబడిగా అని యర్థము వ్రాయుటయు దటస్థించి యుండు నని తోచినది. 'త్రోయు' ధాతువునకు 'తోయు' అను రూపము వ్యవహారములో నున్నను, ప్రామాణిక ప్రయోగము లందగపడకుండుటచేత నే గావలయు శబ్దరత్నాకరమున తోయు గ్రహింపబడనే లేదు. కావున 'తోఁద్రోపు' అను రూపము గాని ఆ పలుకుబడి గాని తెలుగుభాషలో ప్రసిద్ధము కానే కాదని తలఁప వలసియున్నది. అయితే యీ పదబంధమునుగూర్చి యింతగా బరిశీలింప వలసిన పని యెందుకు గలిగినది యను ప్రశ్న కలుగవచ్చును. ఈ పదబంధము మూలముగా దేశీయం బగు తెలుగు పలుకుబడులలో గానవచ్చునొక సంప్రదాయమును మనము గుర్తింపవలసియున్న దని సూచించుటకే. ఈ సంప్రదాయ మేమనగా-అతిశయార్థమును సూచించుటకుగా ధాతువునకు లేదా శబ్దమునకు ద్విరుక్తి కల్పించి చెప్పుట. కావుననే 'త్రోచు' ధాతువునకు అతిశయముగా త్రోచు, మిక్కిలి త్రోచు, బలాత్కారముగా త్రోచు - అను నర్థమున-నా ధాతువునకు ద్విరుక్తి కలిగి - త్రోద్రోఁపు అయినది-దానిపై సహాయ ధాతువుగా ఆడు- చేరి 'త్రోద్రోఁపులాడు'-అను పదబంధమేర్పడినది. ఇట్టి పదబంధము లనేకము తీ భాషలో నేర్పడియుండుటే గాక, వీనిలో గొన్ని యా ధాతువులయొక్క ప్రాచీన నవీన రూపముల కలయికచే నేర్పడినవిగాఁ గూడ నుండుటచే, నాయా ధాతురూపముల పరిణామ రీతిని తెలుగుభాషయొక్క పరిణామక్రమమును గూడ గనిపట్టుట కవకాశము వీనిమూలముగా నేర్పడగల దని తోచుచున్నది. ఈ 'త్రోయు' ధాతువు కన్నడమున 'తౌర' అను రూపమున నున్నది. (Milk to form, to come with the breast, to be filled with milk)

తోరగు = to flow down. స్రోసుకొనివచ్చు అని యర్థము. తమి. చొరి. మళ. చురి = to gush out. ఈ "తొరగయు" - నుండియే 'స్రోయు' అను తెలుగు ధాతు వేర్పడియుండును.

ఇక నీ 'స్రో స్రోపులాడు' అను శబ్దమునకు ప్రయోగమును జూపుచు శబ్దరత్నాకరమున రామాభ్యుదయములోని యీ క్రింది పద్యమీయ బడినది.

గీ. సిగ్గు వెనుకకు దిగియంగ నగ్గలంపు
రాగ రజ్జువు ముంగల సాగ దివియ
నంగులకుం దోడు స్రోస్రోపులాడం జెలుల
నడుమ బిరుపీకు లయ్యె నప్పడతి యపుడు.
(రామా. 4. ఆ)

ఈ రామాభ్యుదయపు పద్యమునందు, "స్రో స్రోపులాడు" అను పదబంధమునకు దోడు "పిరుపీకులయ్యె" అనుమఱియొక పదబంధము కూడ నట్టిదే లభించినది. ఈ "పిరుపీకు"- శబ్దము (పీకు+పీకు) అని పీకు ధాతువు ద్విరుక్తివలన నేర్పడినట్లును, 'పీకులాట' అని దీని కర్థ మైనట్లును, ఇట్లే-పిరుపీకులాడు, పిరుపీకు సేయు అను పదబంధములకు 'పెనగులాడుట' అని యర్థమగునని యు శ.ర.న తెలుప బడినది. కాని యిచ్చట 'పీకు+పీకు='పీపీకు' అనియౌను గాక 'పిరుపీకు' యెట్లగు నయ్యెనో, మధ్య రేఫ మెట్లు వచ్చెనో తెలియవచ్చుట లేదు. ఈ 'పిరుపీకు-శబ్దమునకు "పెనగులాడు"- అనుటకంటె 'పీకులాడు' అనియే అర్థము చెప్పినచో నది యాశబ్దార్థమునకు మరింత సన్నిహితమగునని తోచుచున్నది. ఏమనగా 'పిరు పీకు'లోని 'పీకు' అనునది 'పెరుకు' శబ్ద రూపాంతరమే యనవచ్చును. ఈ 'పీకు' శబ్ద మేమిటి-అక్కడ్లు వచ్చినది అనునది మఱొక ప్రశ్న. ఈ [illegible]లాట తీరుటకు మనము దాని మునుగన్న 'పీకు' శబ్దసహాయము నే పొందవలసి నట్లున్నది. 'పీకు' ధాతువు కన్నడభాషలో గూడ కలదు. కిట్టెల్ నిఘంటువులో 'పీకు' తెలుగు ధాతువుతో సమానార్థకముగనే యున్నట్లు తెలుపబడినది. "to pull out, to pluck up" పెకలించుట, పెఱుకుట అను నర్థము గలదై యున్నది. దీనినిబట్టి 'పెఱుకుట'కు 'పీకుట'కు దగ్గరసంబంధ మేయున్నట్లు తోచకపోదు. సంబంధమే కాదు, అభేదమే చెప్పవచ్చు ననిపించక పోదు. మళయాళమున 'పి(ఴ్)' అను ధాతువు, తమిళమున 'పిడుంగు', 'పిఴుర్' అను ధాతువులుకూడ సమానార్థకములుగ గ్రహింపబడినవి. దీనినిబట్టి ప్రాచీన ద్రావిడభాషలోని 'పి(ఴ్)' ధాతువు-పి(ఴ్)కు> పిఱుకు>పెఱుకు>పీకు అను రీతిని పరిణామమునుబొంది-తెలుగు కన్నడములలో-పెఱుకు> పీకు రూపములలో నిలిచిన దని తలంపవలసి యున్నది. ఇట్లు పెఱుకు-పీకులకు సన్నిహిత సంబంధమే గాక 'పీకు'లోని యరసున్న-దీని పూర్వరూప మగు 'పిఱుకు-పెఱుకు' అను దానిలోని శకటరేఫము లోపించుటచే దాని స్థానమున నడుము జేరినదని నిశ్చయింపవచ్చును. దీనిని బట్టి యీ 'పిరుపీకు' అను పదబంధములోని తొలి పదము 'పిఱుకు'కు సంబంధించిన దని తెలియుచున్నది. కావున నిది పీకు+పీకు- అని పీకు శబ్దద్విరుక్తిచే నేర్పడినది కాక 'పిఱుకు+పీకు' అను ప్రాచీననవీనరూపముల చేరికచే నేర్పడిన ట్లూహింపదగియున్నది. ఈ పదబంధములో 'కు' వర్ణలోపము రెండవ దానిలోని 'పరుష 'ప' వర్ణమునకు-'వ' కారాదేశము (గ-స-డ-దవాదేశము) గల్గి "పిరుపీకు"-అనుశబ్ద మేర్పడినది. దీనికి 'పై పద్య సందర్భములోగూడ' పెనగులాడుట అనుట కంటె 'పీకులాడుట' అని అర్థము చెప్పుకొనుటయే యుక్త మగును. ఏమనగా సిగ్గు వెనుకకు, రాగము ముందుకు స్రోయుచుండగా, చెలులు ఒకరిటు ఒకరటు స్రోస్రోపులాడుచుండగా పడతి వారినుండి పెకలించుకొని-తన్ను ఈవలకో ఆవలకో వారినుండి పీకికొనవలసిన స్థితి గలిగిన దని చెప్పుటయే యుక్తము కాని వారితో "పెనవేసికొని" - పెనగులాడుచు నే యుండు స్థితి గలిగిన దని చెప్పుట యుక్తముగా గనబడదు. 'పెనగు'—ధాతువు — పెనవేయు — పేనుట — మెలిపెసికొనుట అనుదానితో సంబంధించినది. ఈవిధముగా 'పిరుపీకులాడు' అను తెలుగు పదబంధములో ప్రాచీన భాషలోని 'పిఱు' ధాతువునుండి యేర్పడిన రెండు రూపము లెట్లొండొంటితో పెనవేసికొని కాలక్రమమున నొక క్రొత్త పలుకుబడిగా నేర్పడి యీ తెలుగు భాషలో నెట్టి భావస్ఫురణకు దోడ్పడినవో యను విషయమును గమనించినచో నది యాశ్చర్యమును గొలుపక మానదు. ఇది యొక్కటే గాదు. ఇట్టి

వింక ననేకము లీ భాషలో గలవు. ఇట్టివానికి ధాతుపల్లవము లని, శబ్దపల్లవములని లాక్షణికులు పేరుపెట్టిరి. ధాతు, పదసంయోగరూపము లగు నిట్టి పల్లవముల నపారముగా బెట్టుటచేత నే యీ దేశభాషావృక్షము చక్కగా పెంపొంది గుబురుకొన్నది. ఈ పదబంధ రీతులలోని అర్థములలోని చమత్కారములును గమనింపదగినవే. కాలక్రమమున నీ 'పిఱువీఁకు' అను శబ్దస్వరూపము వలెనే అర్థమును మారి-పీకులాడు, బాధించు అనునర్థ మేర్పడినది.

"కని చుట్టువారుకొని యిట్టునట్టుం బిఱువీఁకు సేయుచు"--(పరత. 5. ఆ)

"ఇట్లు బహువిధంబుల బొదివి కాలకౌశికునిం 'పిఱువీఁకు సేయు' బ్రహ్మచారులకుం బ్రియంబున వందనం బొనర్చి" - (హరిశ్చం. 1. భా) "అసహ్యవర్తనలం బిర్వీకులం బెట్టుదు గాతున్" (పాండు. 4. ఆ) ఇత్యాది ప్రయోగములందు "పిఱువీఁకులాడు" 'ఆడు' ధాతు సహాయమున గాక, చేయు, పెట్టు-ధాతువుల సహాయమును బడసి 'యీపదబంధమే-'బాధించు' అను నర్థమును వ్యక్తము చేసినది.

ఇట్లు - త్రోపు + త్రోపు = త్రోద్రోపు—, (పిఱుకు) పీకు + పీఁకు = పిఱుపీఁకు అయినట్లే- త్రొక్కు + త్రొక్కు = తొఱుద్రొక్కు, తొఱుద్రొక్కులాడు. త్రొక్కు-తొక్కు, పీకు-వీకు వలెనె-'త్రొక్కు' అనునది కూడ ప్రాచీనంబగు నొక మూలధాతువుయొక్క పరిణతరూపమే. మూలధాతువు కన్నడమున - తుఴుక్కు (to tread upon, to trample) అను రూపమున నున్నది. 'తుఴుక్కు'- అనునదె - దానికి గలిగిన వర్ణవ్యత్యయము చేత- తుఱుక్కు < తొఱుక్కు < త్రొక్కు-అయినది. తెలుగుభాషలో ప్రాచీన రూపములోని 'ఴ' కారము శకటరేఫమై, తుఱుక్కు - తొఱుక్కు - అని యుండగా తొఱుక్కు + త్రొక్కు = తొఱుద్రొక్కు' అని యైనది. మిక్కిలి త్రొక్కుట అని యర్థము కలిగినది. ఇట్టివింకను ఈ భాషలో ననేకములు.

వఱువట్టు = మిక్కిలి వట్టిపోవుటలు. 'అది వట్టిది-అనగా అబద్ధము - నిజము కానిది అని యిప్పుడు అర్థము వచ్చినది. 'వట్టికుండ'-కుండలో ఏమియు లేదు' అని అర్థము-కాని యివి లాక్షణికార్థములు. అసలు ఈ ధాత్వర్థము-'ఆవు వట్టిపోయినది-పాలిచ్చుటలేదు-' అను సందర్భమున 'ఎండిపోయినది.' అని వ్యక్తమగుచున్నది. "వట్టి గడ్డి"-అన్నప్పుడు కూడా ఎండిపోయిన గడ్డి- అని దీని సహజమైన అర్థము తెలియుచున్నది. కాని "వట్టి" అనునది మాత్రము మూలరూపము కాదు. 'వఱు' అనునదే దీని మూలరూపము- 'వఱు'- అనునది విశేషణముగా నున్నప్పు డిందలి 'ఱ' ద్విత్వమును బొందుట ద్రావిడభాషా సహజ లక్షణము - కావున నే-వఱు-వఱ్ఱు-అయి-వట్టు) వట్టు-'వట్టి'అనున వేర్పడినవి. (cf చిఱు-చిఱ్ఱు-చిట్టు)-చిట్టి-చిటిపి; ఏఱు-ఏఱ్ఱు-ఏట్టు)-ఏటిగట్టు. మాఱు - మాఱ్ఱు - మాట) అత్యంతము వట్టిపోవుట = వఱువట్టు వట్టుట. నన్నిచోడుడు తిక్కనగూడ దీనిని ప్రయోగించినారు. పంచమాశ్వాసమున నగజచెలులు "వలవంత వఱువట్టు వట్టిన నాలుకతల ముద్దుమాటలు మెలఁగియాడ, పరము డెన్నఁడొకో ప్రత్యక్షమై తన రూపు తెలసుతకు జూపు నెలమి"-అని యందురు. వలవంతచేత నగజనాలుక వఱువట్టు వట్టినదట. అనగా మిక్కిలి వట్టిపోయిన దయినది. తడిలేక యెండిపోయిన దయినది. ఇట్లు తడిలేక యెండిపోయినవే 'వరుగులు' - 'ఎండి వరుగై పోయినది.' అందురు. భారతములో విరాటపర్వమున పాంచాలి రావించి సుధేష్ణ తృష్ణ భావించుచు నిట్లనియె.

క. "ఒదవెడుతృష పెల్లిదమున
వదనము వఱువట్లు వట్టె, వాసితరాజ
న్యదిరారస మానఁగ నా
హృదయాంబుజ వేడ్కఁ యొసక పోఁగాడుఁ
[తరుణీ.]

క. కీచకుని యింట నెప్పుడు,
వాచవిగగు బహువిధముల వారుణిగలుగున్
వే చని యిచటికిఁ గొనిర
మ్మా, సూతము గాని నీగమన వేగంబున్."
అని పంపెనట.

ఇచ్చట సుధేష్ణ కొదవెడు తృష పెల్లిదమున నామె వదనము 'వఱువట్లు' వట్టినదట- మిక్కిలి యెండితడి యారిపోయినదని యర్థము. ఇట్టి సందర్భములో మిక్కిలి యెండి వట్టిపోయి నవుటకు నీ వఱుధాతువు యొక్క తొలిరూపము మఱిరూపము రెండునుగలిసిన పదబంధమీ యర్థమును ఎంత చక్కగా వ్యక్తముచేసినది. ఈ పదబంధమునకు దుదిని జేర్పబడు సహాయధాతు భేదమువలన చేత నీ తెలుగు పలుకుబడికి అర్థమునందు కొ

భేదము క్రొత్త అందము కూడా కలుగుచున్నవి. "వలువల్లువట్టు" - వలువల్లువారు, వట్టిపోవు - ఇల్లే - పిరుపీకు -డు = పెనుగులాడు, పిరుపీకు సేయు, (బాధించు) మొదలగునవి.

ఇట్టిదే మరొక తెలుగు పలుకుబడి- ఇట్టంకు లింకుట = మిక్కిలి కుష్కించు, క్షీణించు మిక్కిలి ఇంకిపోవుట - అనునది మూలార్థము. ఇట్టంకులు-(ఇంకులు+ఇంకులు) మిక్కిలి ఇంకిపోవుటలు-అని శ. ర. ఇంకులు + ఇంకులు- కలసి 'ఇట్టంకు లగుట' సంభవమ్ము గాలేదు- కావున 'ఇంకు' ధాతువునకు బూర్వరూపములో నొక 'ఱ' కార ముండవలె - అది 'ఇఱుకు' ధాతువై యుండును. తమిళమున 'ఇఱంకు' అనునది కలదు. దానికిని 'ఇఱుకు' కొనుట, అడగిపోవుట అనియే అర్థము. నీరు క్రమముగా అల్పదేశములో నిఱుకుకొనిపోయియే 'ఇంకి' పోవుటయు దటస్థించును. కావున 'ఇఱంకు' ధాతువే నీటికి సంబంధించి - ప్రత్యేకార్థమున 'ఇంకు' ధాతువైనది. కాబట్టి - అత్యంతము 'ఇఱుకు' కొనుట లేక-'ఇంకులు' - 'ఇట్టంకులు' యైనది.—

సీ. ఇట్టంకు లింకి బీరెండఁ బెన్ బీటికల్
గాతంబులై తటాకములు బలసె."
(శ్రీ ర.మా. 4 ఆ)

ఇచ్చట - తటాకమునందు నీరు అత్యంతము ఇంకిపోయి, అనునర్థముననే ప్రయోగింపబడి-క్రమముగా లాక్షణికార్థమున-పస్తుండు, కృశించు అను నర్థముకూడ వచ్చినది.

సీ. "భానువారపు వీరభద్రపల్లె రమిడు
కృశాకృవతంబు లిట్టంకు లింక"—
(ఆము.4 ఆ)

నీరింకు, కృశించుట-అనుదానినుండి క్రమంగ బడు ఆను నర్థముకూడ వచ్చినది.

సీ. "ఎవ్వాఁడు సింధ్వాద్రి నిట్టంకు లింకించె
గంభీరహుంకారగర్జనమున."
(భీమ. 2 ఆ)

'ఇట్టంకు లింకుట, ఇంకించుటయే గాక - ఇట్టంకులు చేయు (= అడచు) అను పలుకుబడి గూడక విప్రయుక్తమైనది. శ్రీనాథుఁడు-నైషధములో:

ఉ. "మంకెనపువ్వుమీఁది యళి
మాడ్కి నృపాధరపలవోదరా
లంకృతి యైన దంతపద
లాంఛనముం గని కన్నుగోనలం
దంకురితంబులైన దర
హాసలవంబులు పద్మనేత్ర యి
ట్టంకులు సేసెఁ బత్కముల
యాయమిఁ గాటుక చిమ్మచీకటిన్."

దీనినిబట్టి 'ఇనుకు-ఇంకు ధాతువు - ఇఱుకు-ఇఱుంకు-ధాతువుయొక్క పరిణతరూపమే గాని మూలధాతువు కాదని స్పష్టమగుచున్నది.

"ఇట్టంకులు" లాంటిదే 'ఇల్లిగ్గులు' కూడాను. ఇగ్గు+ఇగ్గు=మిక్కిలి ఒఱగుటలు అని అర్థము. ఇగ్గు- ధాతువునకు = వెనుక కొఱగుట యని అర్థము. కావచ్చు గాని-ఇగ్గు-ఇగ్గు-కలసి 'ఇల్లిగ్గుట' యేమి యనునది ప్రశ్న.

తమిళకన్నడాలలో ఇఴిగు = లాగు, జాఱు ఒఱగు-అను నర్థముగల ప్రాచీనధాతువు కలదు- ఇఴిగు>ఇగ్గు అయియుండును - ఇఴిగు అను ప్రాచీన ధాతుస్వరూపమే యీ 'ఇల్లిగ్గులు" అనుపదబంధములో బొడసూపుచున్నట్లున్నది.

"లొల్లి యగువగలత్రొక్కన,
నిల్లిగ్గులు గానవచ్చుహృదయములోనన్,
మల్లామడి యగుమదనుడు,
మెల్లనకూర్చుండెఁ దాల్మి మినుమినుకనఁగన్."
(ఉ. హరి. 5 ఆ)

ఈ ఉత్తర హరివంశ పద్యములో 'మల్లామడి'-'మినుమినుకు' అను మఱి రెండు పదబంధము లీ జాతికిఁ జెందినవే కానవచ్చుచున్నవి. 'మల్లామడి'-శబ్దమునకు 'పేడితుఁడు' అనిఅర్థము మాత్రమే శబ్దరత్నాకరకారు డిచ్చి యూరకున్నాఁడు గాని అతిశయార్థ మందున్నట్లు సూచింపలేదు. కాని 'మల్లామడి'-అనుదానికి-మిక్కిలి మడగిపోయి-అని యర్థమేమో యని తోఁచును. మిక్కిలి మూగిఁపోయినవాఁడే పేడితుడును కాకమానడుగదా. కాని 'మడగు'-ధాతువునకు-'మల్ల' శబ్దమునకు గల సంబంధము స్ఫురించుటలేదు. మినుకు+మినుకు='మినుమినుకయ్యె' నమటకు సందేహము లేదు. ఇట్టి ద్విరుక్తి మూలముగా నొక యనుకరణమును-లేదా అనుకరణధ్వనిని లేదా రీతిని సూచించు శబ్దములపాఠముగా తెలుగుభాషలో కలవు-వీనిని గూర్చి తరువాత వ్రాసెదను.

ఇఱ్ఱింకులవంటిదే- ఉఱ్ఱూతలూఁగు అనునదొక పదబంధము. దీనికి 'మిక్కిలి యూఁగు' అని అర్థము-(ఊఁగు+ఊఁగు)

"ఉఱ్ఱూత లూఁగెడు నుదయాస్తగిరులచే నాకౌశలక్ష్మి కోలాటమాడ." (అని ఉత్తర హరివంశము. 4-ఆ) దీనికే "ఉఱ్ఱటలూఁగు" అనునది మఱియొక రూపముగా గనబడుచున్నది. "ఉఱ్ఱూత"లే "ఉఱ్ఱట" లైయుండును. దీనిని బట్టి 'ఊఁగు' ధాతువునకుఁ బూర్వరూపము 'ఉఱుగు' అనునదై యుండునని తోఁచుచున్నది. 'ఉఱుకు'-అనునది 'దుముకు' అనునర్థమున గలదు. కాని యిందు చలన మున్నను-ఊఁగుట యనునర్థమున్నట్లు కానరాదు. రేఫముతోఁ గూడిన 'ఉరియు' ధాతువునకు చలించు నను నర్థము కలదు. దీనినుండి 'ఉరియాడు' ఊఁగులాడు, ఉరియాట = ఊఁగులాట అను శబ్దములు వాడుకలో గలవు. కాని శకటరేఫ మైనగాని యిట్లు ద్విత్వమును జెంది 'ఉఱ్ఱూతలూఁగు' వంటి పదబంధమునకు మూలము కాదేమో యని సందేహము. ఒకవేళ ఉరియాడు-లో గూడ తొలుత శకటరేఫమే కలదేమో. తొలుత శకటరేఫము - రేఫముగా మార్పునొందుట పెక్కు సందర్భములలో గాననగును. ఉఱుగు+ఉఱుగు = ఉఱ్ఱూఁగు-అయి యుండును. ఊఁగు-ధాతువులోని యరసున్న శకటరేఫ స్థానీయము గావచ్చును. లేదా 'ఇఱుంకు'-ఇంకులో వలెనే 'ఉఱుంగు > ఊంగు > ఊఁగు - అయి యుండును. ఈ 'ఊంగు' ధాతువునుండియే తమిళమున 'ఊంజల్' = ఊంజెల తెలుగు ఊయెల శబ్దము లేర్పడియుండును. ఊఁగు నుండి నామవాచకరూపము - ఊంత - ఊత. ఉఱ్ఱూఁగుట = ఉఱ్ఱూత. ఉఱ్ఱూతలుగా ఊఁగుట- ఉఱ్ఱూత లూఁగుట యగును.

బిఱ్ఱబిగియు = మిక్కిలి బిగిసికొను (బిగియు+బిగియు)

"పెద్ద లయ్యును కడు బిఱ్ఱబిగిసి యింద్రు
వట్టియభిమానములను గర్వములబట్టి."

(కాశీ. 7 ఆ)

"బిఱ్ఱు" ధాతువునకే 'బిరుసగు' అని యర్థము కలదు. బిరుసు = అనగా కాఠిన్యము. "నెత్తుటన్ బేరిన క్రొరమీసములు, బిఱ్ఱిన వెంట్రుకలున్" (భో. 4 ఆ)-బిఱ్ఱిన = బిరుసెక్కిన, కఠినత వహించిన. బిగియుటయు-బిరుసె కఠినత వహించుటయే యగును. కావున 'బిఱ్ఱగుట'యే "బిగియుట" అని చెప్పవచ్చును. బిఱు+అగు= బిగువగు. మిక్కిలిబిగియుట బిఱ్ఱబిగియుట' 'బిరడా' - శబ్దములోని రేఫముకూడ-నీబిఱ్ఱు శబ్దములోని శకటరేఫస్థానీయమే యనవలె. బిగువగుటకుగా త్రిప్పునప్పుడు గలుగు ధ్వన్యనుకరణమును బట్టియే యీ 'బిరబిర' బిఱ్ఱు, బిఱడా మొదలగు శబ్దములు బయలుదేరి యుండును. ఈ బిఱ్ఱు-నుండియే "బెట్టు" "బెట్టుసరి"-వచ్చియుండును.

చ. "బిరబిర ద్రిప్పి నైచుటయు
బెట్టుగ నెత్తుదు నోర గ్రక్కుచున్
ధరణితలంబునం బడియె"

(వి. ప. 7 ఆ)

చ. "దంపతుల్ బిఱబిఱఁ జుట్టుచున్
బికిలిపిట్టలకైవడిఁ బోరి రెంతయున్"

(చంద్రాం.)

ఈ 'బిఱ్ఱ' నుండియే ద్విరాభవంబున 'బిట్టబిఱ్ఱ' శబ్దముకూడ నేర్పడినది. (బిఱ్ఱ+బిఱ్ఱ)= మిక్కిలిబిగువు — (భోజరాజీయము. 4 ఆ)

చ. "అనవుడు సట్ల కాక యని
యాసతి విప్రుని యింటి కేగి యు
ల్లన నతఁ డొంటి యున్కి పది
లంబుగఁ జూచి సమీపమందు ని
ల్చినఁ గని బిట్టబిఱ్ఱ దన
చిత్తము జల్లన మోము దేరకోఁ
గనుగొని యింత ప్రొద్దటకుఁ
గామిని నాఁ గత మేమి నావుడున్".

ఇట్లు బిట్టబిఱ్ఱు అనుదానికి మిక్కిలి బిగిసిన-అని యర్థ మగుచున్నది. విశేషణముగా నిలిచినపుడు బిఱ్ఱు-బిట్రు-గా పలుకబడు నసుట ద్రావిడ భాషలలో సుప్రసిద్ధమే.

విఱ్ఱవీఁగు-(వీగు+వీగు) మిక్కిలివీగు-నిక్కు. దీనిలోని 'వీఁగు' ధాతువున కిప్పుడు 'నిక్కు' అని యర్థము. ఈ 'నిక్కు' ధాతువుకూడ "నిల్+కు" = నిక్కు అనగా "నిలచు 'నిలచు' అను దానినుండి యేర్పడినదే. "నిటాక్కు నిలబడినా"డని చెప్పుటయు కలదు. నిట్ట=నిక్కు, నిట్టనిలుచు = సరిగా నిలుచు, నిట్టరాడు = నిలువు కంబము మొదలగు శబ్దములలో నీ 'నిట్ట' = నిలువు, శబ్దము గానవచ్చుచునే యున్నది. కాని 'వీఁగు' - అనుదానికి 'నిక్కుట' - నిలబడుట అను నగ [illegible]

కలుగవచ్చును. ఈ 'వీఁగు' అనునది 'విఱుగు' ధాతువునుండి యేర్పడిన దని గ్రహించినచో నీ సందేహము పోవచ్చును. విఱుగు అనుదానికి ఱుసుగు అను నర్థము కలదు గాని, విఱుగబడు, గర్వించు, ఒడలు విఱుచుకొనుట, విక్కు = విజృంభించు, గర్వించు, వికృతికియు మొదలగు సందర్భములలో-విజృంభణ-గర్వప్రదర్శనార్థమై ఒడలు నిగుడించి-విఱుచుకొని 'నిక్కు' మాపుట యనునర్థము సిద్ధించుచునే యున్నది. ఇట్లు 'విఱ్ఱవీఁగు' అనునది విఱుగు>వీఁగు శబ్దముల కలయికచే నేర్పడిన దని తలంపవలసి యున్నది.

ఇక 'నిట్టనిలుచు', 'నిట్టకనిలుచు' అను పదబంధములు కలవు. ఇవి (నిలు+నిలు) అను వాని చేరికవలన నేర్పడినట్లు చెప్పబడి యుండలేదు. కాని నిట్ట-శబ్దము వాస్తవముగా 'నిడు'-నిడుపు - శబ్దమునకు సంబంధించినదై - నిడుపుగా నిలుచు = నిట్టనిలుచు అనియే యేర్పడె నని చెప్పవగియున్నది-పరిశీలించినచో నిడు-నిలు - రూపము లేకధాతుజన్యములే యని తోచకపోదు. నిడువు, నిడుపు, నిడివి అను వానికి 'దైర్ఘ్యము' అని యర్థము. వీనికిని 'నిలువు'-నిలుచుటకును సంబంధము సన్నిహితమే యనిపించును. 'నిల్'+కు=నిక్కు కాగా-'నిక్కు'-అనునది మరల ధాతువుగా గ్రహింపబడుచున్నప్పుడు నిల్+టు = నిట్టు-అనునదికూడ మఱియొకధాతువై యేర్పడి యుండవచ్చును. నిడు-విశేషణముగా నిలిచి నడుము-నిట్ట-యగును. ఇట్లే-నడు-నట్ట యగును. కావుననే - నడుము + నడుము = 'నట్టనడుము' అయినది. 'నడినడుమ'-అని యూహింపదగును. నడు+అడవి-నట్టడవి యైనది. కాని 'నట్టనడు'మనియే గాక 'నట్టకనడు మ'నియు నొక రూప ముండు యుక్తమున గానవచ్చుచున్నది. 'నట్టకనడుమ-యి' అని వేంకటనాథుని పంచతంత్రమునుండి యొక్క ప్రయోగము కలదని శ.ర.లో తెలుపబడినది. ఈ 'నట్టనడుము' వంటి శబ్దము లనేకములు కలవు. కాని యింకను పెక్కింటిలో నీ నడుమ వచ్చు 'ద్విరుక్త టకారాగమము' సహేతుకముగా లేదా సమర్థనీయముగా గనబడదు. శకటరేఫములో గూడిన శబ్దములు విశేషణములైనప్పుడు ద్విత్వమునుబొంది-అద్విత్వ నందలి రేఫోచ్చారణము వదలిపోయిన ప్పుడా శబ్దము ద్విరుక్తటకారముతో బలుకబడినట్లే-కడు, నడు, నిడువంటి 'డు' వర్ణాంతశబ్దములును విశేషణములై నిలిచినపుడు వీనియందలి 'డ' కారము ద్విరుక్త టకారముగా బలుకబడుట ప్రాచీన ద్రావిడభాషా సంప్రదాయ మగుటచే, (ఇప్పటికిని తమిళభాషా సంప్రదాయ మదే) నట్టి 'డు' వర్ణాంతశబ్దములపై-ద్విరుక్త టకారాగమము సమర్థనీయమే యగుచున్నది. కావుననే-నట్టిల్లు, కట్టలుక, నిట్టూరుపు మొదలగు పదబంధములు, చిట్టెలుక (చిఱు+ఎలుక), కుట్టుసురు (కుఱు+ఉసురు), నిట్టుపాసము (నిఱు+ఉపాసము), మిట్టమిఱ్ఱు, (మిఱ్ఱు+మిఱ్ఱు)-మొదలగు వానివలనే ద్రావిడధ్వని సంప్రదాయానుకూలములై సమర్థనీయములే యగుచున్నవి. కాని మఱికొన్ని.—

పట్టపగలు = (పగలు + పగలు) = మట్ట మధ్యాహ్నము.

చిట్టచివర = (చివర + చివర) = అన్నిటికి చివర.

కొట్టకొన = (కొన + కొన) = అన్నిటికి కొన.

తుట్టతుద = (తుద + తుద) = కేవలమాతుద.

మొట్టమొదలు = (మొదలు + మొదలు) = అన్నిటికి మొదలు.

తెట్టతెరువు, తెట్టతెన్ను, ఎట్టయెదురు, కట్టకడ = (కడ+కడ) వంటి పదబంధములలో నీ ద్విరుక్త టకారాగమమునకు కారణము గానిపించుట లేదు. ఇట్టి రూపము లన్నియు పై రూపముల సామ్యముచేతనే (Analogy) భాషలో నేర్పడిన వని తలంపవలసియున్నది.

ఇట్లే పదముల ద్విరుక్తిచే నేర్పడిన పదబంధములు మఱికొన్ని కలవు. కాని వీనిలో తొలిపదమున చేరిన వర్ణము లెట్లొచ్చుట చేరినది సులభముగా గ్రహించుట కనువుగా లేదు. మూలశబ్దములకంటె భిన్నములగు శబ్దముల కలయిక గలిగినట్లు గ్రహింపవలసి యుండును. అవానిలో కొన్ని :—

తెకతేర = (తేర + తేర) = బొత్తిగా సంబంధము లేనిది.

పారిజాతాపహరణము. 4 ఆ.లో దీని ప్రయ

సీ. "వినుడు సురేశ్వరు వనపాలకులు వార్థిఁ
బొడమిన యీదివ్యభూరుహమున
క్రింద్రాణియెవ్వతె? యింద్రుఁడు డెవ్వఁడు
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక
తెకతేర యిది యేమి తెరకరిసామ్మె."

'ఇది యేమి తేరగా వచ్చిన సొమ్మా-తీసికొనుటకు'-అను నర్థమున 'తెకతేర' ప్రయోగింపబడినది. తేర + తేర = తేతేర గావచ్చును గాని 'తెకతేర' యెట్లయ్యెనో తెలియవచ్చుట లేదు. 'తేరగా' అనునది. 'తేటతేరు'-పైకి దానంతట అది తేరివచ్చు' అను నర్థమున-'తేటతేరు' అని కావచ్చునేమో గాని 'తెకతేరు' కాదు. తుడుకు + తుడుకు = తుందుడుకు అయినది. అట్లే తునుకలు తునకలు = తుందునుకలు, (=చిన్న చిన్న ఖండములు); తుమురు + తుమురు = తుత్తుమురు. (= మిక్కిలి తుమురు-అనగా పొడి) అయినవి. కావున తేరు + తేరు = తేతేరు-తెత్తేరు కావచ్చును. కాని మరియొక పదబంధము 'తేరకుఁదేర' (తేరకున్ + తేర) అనునది మిక్కిలి అనాయాసముగా ననుకూలమున గానవచ్చుచున్నది.

'బళిరా తేరకుఁదేర చిక్కెనిటు నీ బంగారు కుండంచు' అని పాండురంగ మాహాత్మ్యమున తెనాలి రామలింగని ప్రయోగ మొకటి కానవచ్చుచున్నది. దీనినిబట్టి 'తేరకుఁదేర'-'తెకతేర' అయిన దేమో యని యూహింపవలసియున్నది.

ఇట్టివి మఱికొన్ని గలవు. వీనిలో మూల ధాతువున లేని క్రొత్త యక్షరములు తోడిపదమునఁ జేరుచున్నవి. ఇవి భిన్నశబ్దములతో జేసిన పదబంధము లేమో!

తొప్పదోఁగు ( = తోఁగు + తోఁగు) = మిక్కిలి తోఁగు.

తుప్పలుదూలు (తూలు + తూలు) = మిక్కిలి చలించు.

చుప్పనచూర (చూఱ + చూఱ) = పెద్ద కొల్ల.

తెట్టతెరువు (తెరువు + తెరువు) = నడివీధి.

తొప్పలు దోగలు = కోటానకోటులు.

కుప్పనగూర = కుప్పవడుట.

చెల్లాచెదరు-చెల్లచెదరు (చెదరు + చెదరు) మిక్కిలి చెదరినది మొదలగునవి.

ఇంక భిన్నపదములతోఁ గూర్పబడిన మఱికొన్ని పదబంధములు :—

తికమకలాడు = తొట్రుపడు.

తట్టుముట్టాడు = ముట్టుకొను. 'తట్టుముట్టాడు నిట్టి పీఠికము' (భాగ. 10 స్కం)

తకపికలాడు = ఇట్టట్టు చలించు. 'నవరత్నపు పాపటబొట్టు మోమునం దకపికలాడ-"

తాలుమాలుపడు = వ్యత్యస్త మగు

తబ్బిబ్బులాడు = తత్తరపడు.

తలకొనుచెంచు = కలుగు

తరతీపుసేయు = ఉపేక్షించు

తరితీపులాడు = పెనగులాడు

తీన్‌తేరగా = తారుమారుగా

తుంపెసలాడు = చలించు.

తుంపెసలు గునియు = చలించు. 'నొసటిపై గురులు తుంపెసలు గునియ' (భాగ)

మాటుమడగు = నిశ్శబ్ద మగు 'అంత నక్కౌశవుం డూరియాలబలంబు మట్టుపడ జూచి యిదె మాటు మడగ ననుచు' (శుక. 2 ఆ)

ముచ్చముడుగు = మిక్కిలి ముడుగు. 'ముచ్చముడింగి వ్రాలె వెడ మూర్ఛతనున్ బొదవెన్ రథంబుపై' (జై. భా.)

సదమద మగు = నలగినది అగు. సదమదము సేయు = నలపు, చంపు.

సగ్గిసముగ్గిసలు = ఉడుగుకుపులు = ఊపిరి త్రిప్పలేక బాధపడుట.

కకావికలు = యాథాయథలు, చెల్లాచెదరు.

"సిగ్గునకుం గకావికలు,
చిత్తమునన్నతి పేరివార్తకున్
గగ్గులకాడు, శంకలకు గన్కని
యొగ్గుకుఁ బట్టుడల్కకున్
సగ్గిసముగ్గిసల్, నిలుపు
సైరణకుం గనని గొత్తి కో
శిగ్గజయానకుం బలికి
నయ్యె యథేష్టరహఃప్రసంగముల్."
(కవిక. 4 ఆ)

వికావికలు = చెల్లాచెదరు.

గగ్గులకాడు = ధాన్యము రాల్చిన కంకుల సమూహము.

క. "సిగ్గువడి విరియ బాఱెరి
బగ్గన బొరివుచ్చువీరభద్రుని ధాటిన్,

నగ్గులయి యివురుసవురయి,
గగ్గలకాఁడై వికావిక లయి యమర్త్యుల్.'
(కాశీ. 7 ఆ)

కక్కుఱిబిక్కుఱి = తాలుమారు.

ఇవురుసవురగు = ఎండిపోయి చెదరగు.

హల్లకల్లోలము = తాలుమాలు.

ఒంటర మింటరములు = విరోధము, సంకటము.

'క. ఒంటమి లేనివి యొంటర
మింటరములు పలుకు టనుచితమే.'
(భార. ఉద్యో. 4 ఆ)

అలిగోడు బాలగోడు = పెడబొబ్బలు.

ఇంచుమించు = న్యూనాధిక్యము.

అఱగొఱ = న్యూనత

అల్లిబిల్లిగొను = పెనగొను - 'మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొనుకొంతారంబునందు'
(స్వా. మ. 2 ఆ)

అట్టాకళి = (ఆకళి + ఆకళి)? = మిక్కిలి క్షుత్తు.

అమ్మకచెల్ల = ఔర! — 'అమ్మకచెల్ల నా హృదయ మమ్మకచెల్లదు వీని కియ్యెడన్.'
(విజ. వి.)

అదవదపడు = కలతపడు.

ఉవ్విళ్ళూరు = త్వరపడు.

ఈఱతాఱలు = సక్రమము.

''వంక దైఱుకతలం బెల్ల వసుమతీశ
యరయ వ్యత్యయపడం బగు న్యాయవాన్వి
తంబు బ్రహ్మపదం బింత తథ్య మేల
యీఱతాఱతలంపుల నీఱువాఱ.''
(భాగ. అశ్వ. 1 ఆ)

కంచుమించు = అగోచరము.

కొందారిమొందారిప్రొద్దు = అర్ధరాత్రము.

గాసట బీసట, చికమక, చింపఱ వందఱ, చీకిలిమాకిలి, చిఱ్ఱుముఱ్ఱాడు,

ఇట్టి వనేకములు దేశిభాష తెలుగుపలుకుబళ్లు ఇంకను గలవు. కాని యివి చాలవఱకు ప్రాచీనసాహిత్యమునందే నిలిచిపోయి నట్లున్నవి. సమానార్థకములగు సంస్కృత పదముల ప్రయోగించు నలవా టెక్కువ యగుటచే క్రమముగా నట్టివి సామాన్యవ్యవహారమునందుండి జారిపోయి కోశములందు మాత్రమే వెదకుకొన దగినస్థితికి వచ్చినవి. దీనినిట్టి సంయోగాత్మకమైన ద్రావిడభాషలలో నొకటి యగు దేశి తెలుగున-ధాతుపద సంయోగముచే నెట్టి శబ్ద పల్లవములు కల్పింపబడుచు వచ్చెనో, యర్థభేదములను, భావచ్ఛాయలను సూచించుట కీదేశి శబ్ద పల్లవరచన యెన్నివిధములుగా నుపయోగపఱుప బడుచుండెనో వ్యక్తమగుచుండుటే గాక దేశి తెనుగు సామాన్య భావ ప్రకటనమునకు చాలదను వాద మెంత బలహీనమో తెలియవచ్చుచున్నది. సంస్కృత శబ్దజాల ప్రయోగమున కలవాటుపడి దేశిపదజాలము నొప్పరికించుటం జేసి యెంత దేశి శబ్దజాల మంతరించినదో యూహించుట కూడ కష్టమే.

ఒక్కొక ధాతువు మూలముగా నేర్పడు శబ్దకూట మపారముగా నుండి అనేక విధముల భావచ్ఛాయలను వ్యక్తీకరించుచుండును. అట్లే ఒక్కొక శబ్దమున కనేకవిధము లగుధాతువులు చేరి అనేకవిధము లగుభావచ్ఛాయలను సూచించును. ఆడు, కొను, తెంచు మొదలగు ధాతువుల మూలముగా నేర్పడు పలుకుబళ్లు ఎన్ని విధములో చూడుడు—

ఆడు—మాటాడు, వేటాడు, కొట్లాడు, కొండాడు, కొనియాడు, చెండాడు, తూటాడు, ఈడాడు, ఈసులాడు, తీర్థంబాడు, నోనాడు, సరసమాడు, నవ్వులాడు, పంతాలాడు, అట్టాడు, పీగియాడు, మిట్టాడు, పోరాడు, పొరలాడు, నీళ్లాడు, తునుమాడు, తుంపెసలాడు, చిట్టాడు, చిటచిటలాడు, క్రోడాడు, కోరాడు, ఎగురులాడు, గుముగులాడు, పెనగులాడు, ఎక్కాడు, నడయాడు.

తెంచు—ఏతెంచు, చనుదెంచు, తోతెంచు, తాకుదెంచు, పీతెంచు, నడతెంచు.

కొను—పూన్కొను, చేకొను, కొనగొను, మేల్కొను, పసికొను, తీసికొను, పట్టుకొను, తగుల్కొను, ప్రోదిగొను, ప్రోవుగొను, సమకొను, ప్రేటుగొను, వేడకొను, వడిగొను (మెలిగొను), మురకొను = ఖండించు, మునుకొను, ముంపగొను (=గుంపుగూడు) మరులుకొను, గుబులుకొను, పొదిగొను, పగగొను, పైకొను, రగులుకొను, కారుకొను = నల్లబారు. కలగొను, కయికొను, కడుకొను = (అతిశయించు) మున్నగునవి.

కొను—తొలిపదముగా నేర్పడినపదబంధములు.—

కొనిపోవు, కొనియాడు, కొనివచ్చు, కొను గోలు, కొనుబడి మొదలైనవి.

ఇట్లే—వెను:—వెనుబాటు, వెనుబడు, వెను దీయు, వెనుకద్రొక్కు, వెనుకవేయు, వెను చఱచు, వెనుతవులు, వెన్నంటు, వెన్నడించు, వెంబడి, వెన్నిచ్చు, వెన్నాడు, వెన్నుదన్ను.

ధ్వన్యనుకరణమును సూచించుచు పద ద్విరుక్తిచే నేర్పడిన పలుకుబళ్ల నేకము లీ భాషలోఁ గలవు. ఇతరభాషలలో నిట్లేర్పడిన పదబంధము లిన్ని గలవా యను సందేహము కలుగకమానదు.

ఇంతకుఁ బూర్వము తెలిపిన 'కకావికలు, వికావికలు' గూడ నిట్టివే. పికపికలు=చెల్లా చెదరు.

"ఒకమతి విరిగినయసురులు
పికపికలై పోవ"

తకపికలాడు, తఱతఱలాడు, బుగులుబుగులన

"...నాగేంద్రుం డ
బ్బిగువున మొగంబు లదరుట
బాగ లెగయగ విషము బుగులు
బుగులన గ్రక్కెన్." (భీమ-4 ఆ)

బుడిబుడి=తొట్రుపాటు. బుడిబుడి మాట లాడుటయు (భార. ఉద్యో. 3 ఆ)

బుసబుసలాడు=బుసగొట్టు

బెకబెకలాడు = కప్పలకూఁత యందలి ధ్వన్యనుకరణమును సూచించును.

బొడబొడ - కారుటయందలి ధ్వన్యను కరణము.

'నోటనుంబొడ బొడరక్తముండొరుగ'

బొసబొస-'వెడలుశ్రేవుల ప్రోవులడిమి'

బొళుకు బొళుకు=గ్రక్కుట.

మట మటలాడు = మండు, మలమల=మాడు.

మిటమిట=మండువేసవి. 'మిటమిటని కటికి యెండన్'

మిడుమిడుకను=పరితపించు.

'పాలేటిరాచకన్నియ
మేలారెడు చూపులేక
మిడుమిడుకంచున్.' (భాగ. 8 స్కం.)

మినమినలాడు=తళతళ

'మినమిన లీనెడునును మే నున'

మినుకు మినుకని మెఱయు.

మిలమిల, మినమిన.

'మిలమిలని ప్రొద్దుపొడుపున'

మిఱుమిట్లు. 'మిగులకన్నులు మిఱుమిట్లు గొనగ'.

ముఱముఱ = మూల్గుట, అణగుట.

'మనుకొని ముఱముఱ మూల్గువారు'
(రా. యు. కాం)

క. 'దురదుర బరువిడి బిరుసున
హరిహరి నిలు నిలువుమనుచు నసురయు [గధిసెన్,
ముఱముఱ దివిజుల హృదయము
మెరమెర యిడె యణగుననుచు
మెఱసెన్ హరియున్' (భాగ. ద.)

ముసముస-కోపమునగల్గు 'చిఱచిఱ'

ముసిముసి-నవ్వులు=చిఱునగవు.

మొకమొకపడు=ఉద్ధతినొందు.

మెయిమెయి నుండు.

మెరమెర = మనోవ్యథ. మెరమెరపడు= సందేహపడు.

మెఱమెఱలాడు - వస్త్రముల మ్రోత; రవరవ - మెరయుటయందలి ధ్వనుకరణము. 'మెరసెన్-రవరవ మురజరవంబులు' (స్వా-4 ఆ.) రెపరెప=నిప్పుమంట మ్రోత, గాలి వీచుట. 'గాలి రెపరెప వీచుచున్నది.' లివలివ= దంతములు కదలుట-'కదురు పట్టెడలి లివలివం గదలు రదనపంక్తులును'. (కవి. క. 5 ఆ)

లుకలుక = పరిగెత్తుట యందలి ధ్వన్యను కరణము.

పకపక-నగుట

తికమక = తాఱుమాఱు

క. 'ఒక మొగము గాక దివిజులు
తికమకగొని వైరులెల్లదీకొని తమ్ముం
బకపకనగ, వకవకలై
లుకలుక బరువెత్తిరోడి లోనొనుభీతిన్'
(భాగ. 6 స్కం)

లొటలొట-'లొటలొట జని'

'తొటతొట పువ్వులు దొరగగ

లొటలొట మనుకొంచు నిండ్లలోనికిఁ జన'.
(భల్లా. 2 ఆ)

లొడలొడ-కారుట.

తొటతొట-పువ్వులు పండ్లు రాలుట.

'వాని పువ్వులు ఫలావళులుండి [పడగ?].
తొటతొటఁ దఱచుగా సుర్విరాలి

[తరువాయి పక్కపుటలో]

# నన్నయపదాలు - కొన్ని విశేషాలు

శ్రీ నిడదవోలు వెంకటరావుగారు



1. అవకర్ణించు = అనాదరముతో విను.

అనినవాని వచనం బవకర్ణించి
(భాగ. ఆది. 2.210)

ఇది మాఘకావ్యము — 15-67 లో గల 'సహసావకర్ణ్య' అను వాక్యమునుండి గ్రహింపబడినది.

2. దారక్రియ = పెండ్లిసేయుట.

క. చనబేడికి దారక్రియ
యును, చెవిటికి మధురగీతయును
(సభా. 2-14)

ఇది యీ క్రింది రఘువంశ శ్లోకమునం గానవచ్చుచున్నది.

దారక్రియాయోగ్య దశంచ పుత్రం
ప్రస్థాపయామాస ససైన్యమేకం. (5-40)

ఈ సందర్భమున సంస్కృత మూలమున నీ పదమగుపడుచున్నది.

శ్లో బేదార క్రియాయాద్య గంధేవారూప
[దర్శనమ్
అరాజ్ఞో రాజవత్పూజా తథా తేమధుసూదన.
(అర్ఘాభిహరణపర్వము - సభా - 29 శ్లో-33
అధ్యాయము)

నన్నయ పై శ్లోకమునకే మెఱుఁగు పెట్టినట్లుగా 'చెవిటికి మధురగీతయును' అను నుపమానమును రచించియున్నాఁడు.

---

సాటసాట-సోలు.

క. 'కటపెట తోటతోట రాలెడు
పాటపాట చినుకుల ధరిత్రి పాడనట్టు
సాటసాట నాకట సోలుచు [వడన్,
దటతటపడు చాతకముల దైన్యమువాపెన్'
(వైజ. 3 ఆ)

తటతట-'తటతట గుండియాలదరగ'-
'చెక్కులు తటతట గొట్టుకొనుచు'.
(ప్రభా. 3 ఆ)

తొటుక్కు తొటుక్కు-గుండె లదరుట.
'పిలుకై గదలింపనోడి గుండియల్
తొటుకు తొటుక్కనన్ దిగులు
దొట్టిన భూభుజుడయ్యె నయ్యెడన్'
(పాంచాలీ. 2 ఆ)

వంకర టింకర,

వకవకలు-వకావకలు = చెదరుట.

వడవడ-వణఁకుట, వలవల-ఏడ్చుట, వలవల వ్రాలుట - 'నేలపై వలవలవ్రాలె, కీలెడలి వ్రాలిన పుత్తడిబొమ్మకైవడిన్'. (భాగ-10ఆ) వికవిక-నవ్వుట, విరవిర-విరియుట - (తొవలు విరవిర విరిసెన్) విలవిల-తన్నుకొనుట, (విలవిల దన్నుక విడిచె బ్రాణములు); విసవిస-త్రిప్పుట, విసవిస నగుచు; వెడవెడ = (అత్యల్పము)-వెడవెడ నవ్వులు; వెలవెల బాఱు, వెలవెల నగుట; వెలవెల బోవుట; సలసల వచ్చుట; సురసుర స్రుక్కుట, సాటసాట పోవుట (కృశించుట) హాళాహాళి = కలకల ధ్వని. హుటాహుటి = వేగము, హోరాహోరీ = అవిరామము; అటమట, అదవద, అఱగొఱ, కివకివ, కిసమస, కుఱకుఱ = (అల్పము) కొఱకొఱ = (కోపము) గలగల, గమగమ, (వాసన) గిలిబిలి, గిలిగిలి, గుసగుస, అచ్చికబుచ్చిక = (కలుపుకోలుతనము), ఆంజలి గుంజలి, అకటావికటము, అడ్డదిడ్డము, ఆఱవఱలు, అతిమితి, అంపగంపు, ఉక్కిరిబిక్కిరి, ఉస్సుగుస్సురు, చిటుకుపొటుకు, చిమచిమ, గోలుగోలు (నవ్వు) చిలచిల - (కారుట); చివచిన -నడచుట, జిలజిల-ప్రవహించు.

ఇట్టి వింకననేకము లుండును. వీనినిబట్టి యీ భాషలోని పలుకుబడి రీతులు పదబంధములందలి సంప్రదాయములు తెలియవచ్చుచునే యున్నవిగదా. సంస్కృత భాషలో నిట్టి పదరచనా సంప్రదాయములు ధాతుపల్లవ శబ్దపల్లవ కల్పనా పద్ధతులు గలవా? ఇవియన్నియు సంస్కృత సంప్రదాయానుసారములే యనదగియున్నచో నీ భాషల సమైక్య మేర్పడగలదు. కాని ద్రావిడ భాషలలోని ధాతుస్వరూప లక్షణములు, తత్పరిణామవైచిత్రి సంస్కృతభాషా ధాతువులలో గానవచ్చుటలేదు. వానిని గూర్చి

చనఁబేడికి దారక్రియు
యును౯ జెవిటికి మధురగీత యును జీవనక
త్యనుపమ సురూపదర్శన
మునుజేయుటఁబోలుఁగృష్ణుఁ బూజించుటిలన్
3. నిపాతించుట=పడద్రోయుట.
క. ఆ తోయధి నీచేతని
పీతం బగుచుంగడండి భీమాసురసం
ఘాతంబు తత్క్షణంబ ని
పాతింతము దివ్యశస్త్ర పటుఘాతములన్
దీనిని కాళిదాసునుండి నన్నయ గ్రహించి యున్నాడు.
ఉత్పశ్యతస్సింహ నిపాతముగ్రమ్.
(రఘువంశము. 2-60)
క్వచనిశిత నిపాతాస్సార పుంఖాశ్శరా స్తే
(కాఘం)
4. అనుగతి = అనుసరణము.
మీ యనుగతి మాకు నభిప్రాయము
(అర. 1-8)
భవతి! పరితుష్టాస్మి పితరమను గతోవత్సఇతి
(మాళవి. ౫. ౫౧ పా)
అనుగతి-స్త్రీలింగరూపము నిర్ధారకము.
5. అనేకాగ్రత=ఏనిశ్చయము లేకపోవుట
నాకెఱిగింపుము దీని న
నేకాగ్రతఁ బొంద నేల యేనుండఁగ
(సభా. 2-93)
ఇది సంస్కృతమూలమునుండి గ్రహింపబడినదే.
సతుగచ్ఛన్న నేకాగ్రస్సభామేకోఽ
న్వచింతయన్. (సభా-47 అ. 19 శ్లో)
అనేకాగ్రంతుతం దృష్ట్వాశకునిః ప్రత్యభాషత
(21 శ్లో.)
6. అమయు=ఉపయుక్తమగు.
అతని వంట లమయునంతకు
(అరణ్య 2-196.)

(వంటలమరునంతకు) అని ముద్రిత పాఠము.
అమయునంతకు ప్రాతపాఠము.
సమరసమయంబున కమయందగు...కణయ
కంపణ...భిండివాల...
(ఉత్తరహరివంశము. 4-213)
7. ఎసగు=అతిశయించు; అభివృద్ధినందు
తేజంబెసగంగ విచిత్రవీర్యుఁ డిద్ధయశుండై.
ముద్రితపాఠములయందెల్ల 'ఎసగు'లో నరసున్న గలదు. కాని 'ఎసగు'లో నరసున్న లేదు.

ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వమున పుట 114 లో నరసున్న గలదని కొన్ని ప్రయోగములు చూపబడినవి. కాని యవి యేవియు నిర్ధారకములుగావు. శాసనములలో 'ఎసగు' నిర్బంధుకముగ నున్నది. మఱియు పండితారాధ్య చరిత్రమందలి యీ క్రింది ప్రయోగము 'ఎసగు'లో నరసున్న లేదని నిర్ధారించుచున్నది. అరసున్నతో గకార మంత మందుగల శబ్దములు సాధారణముగా వకారముగా మాఱవు. తీగ శబ్దములో నే దరసున్న యున్నదన్న వారున్నారు. కాని యది 'తీవ' అని రూపాంతరము పొందుచున్నది కావున యందరసున్న లేదు.[1]

దీనినిగూర్చి [2]యప్పకవీయమునకూడ కలదు.
ఈ పద్ధతి ననుసరించిన, ఎసగునకు ఎసవు-ఎసవి-అను రూపాంతరము లుండుటచే నిందర సున్న లేదు. ప్రయోగమిది.
'భువిశివ నిర్మాల్యభూతయనఁగ నె
సవి సుధాకర కరాసార ప్రసాది
త సుధాభిషిక్తనా......'
(పండిత. దీక్షాప్రకరణము 75 పుట.)
ఎసవి మార్పరాని ప్రాసస్థాన మందుండుటచే నిర్ధారకము.

---

1. దీనినిగూర్చి యింతకుముందు యువసంవత్సరమార్గశీర్ష భారతిలో పరిశోధన సంపాదకులు శ్రీ రామచంద్రగారు వ్రాసియున్నారు. అందులో నెసగులో నరసున్న లేదనియే స్పష్టపఱుపఁబడినది. అది సరియైనదియే.

2. అప్పకవీయము నూతన ముద్రణము. వావిళ్లవారు పీఠిక. 21 పుట.

# శ్రీనాథుని కల్పట్టణం

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు

శ్రీనాథుని జన్మస్థలమును గురించి పండిత లోకమున నేఁడు పలువివాదములు కలవు. శ్రీనాథుఁడు తన తాత కమలనాభామాత్యుని నివాసస్థలముగాఁ జెప్పుకొన్న సముద్రతీరపు కాల్పట్టణ మేదో నేఁటివరకు నిశ్చితము కాలేదు. దీనిఁగూర్చి చర్చించినవారిలో, ప్రధానులు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. శ్రీనాథుఁడు పేర్కొన్న 'కాల్పట్టణము' కాఁదగినవి తెలుఁగుదేశమునఁ బలుతావులు కానవచ్చుచున్నవి. శృంగార శ్రీనాథమున శ్రీ ప్రభాకరశాస్త్రిగా రిట్లు వ్రాసిరి: —

"వారిధి తటీ కాల్పట్టణాధీశ్వరుఁ' అని భీమఖండ పద్యమున శ్రీనాథుఁడు పేర్కొన్న కాల్పట్టణ మిప్పుడు కాళీ పట్టణమని వ్యవహరింపఁ బడుచున్న పయి గ్రామము కాఁదగును.

"ఈ నడుమ బ్రహ్మశ్రీ కే. వి. లక్ష్మణరావు పంతులుగారొక శాసనము (క్రీ. శ. 9వ శతాబ్ది) నందుఁ 'గలుపట్టణము' అను పేరును జూచి శ్రీనాథుని కాల్పట్టణమదియే యని నిర్ణయించిరి. శాసనమున నట్లు పేర్కొనఁబడిన కలుపట్టణము నేఁడు కలపటమను పేర నున్నది. అది యిదివఱకు నేను పేర్కొన్న కాళీ పట్టణమునకు దరిదాపుననే కలదు. కాళీ పట్టణము (మచిలీపట్టణమునకుఁ దూర్పున) సముద్రము నొడ్డుననే యున్నది. శ్రీనాథుఁడు పేర్కొన్న గ్రామమిదియుఁ గావచ్చును." 1

కాని, "తామ్ర శాసనమందలి సరిహద్దు గ్రామాలను గుర్తించనిదే ఈ సిద్ధాంతము నిలువదు.

"గుద్రవార విషయమందలి రండుబల్లి గ్రామమునకు తూర్పున కల్పట్ట(ము), దక్షిణమున కొఱ్ఱకూటూరు పడమట నిడుగాడు ఉత్తరమున (జ)క్కన చెరువు సరిహద్దు గ్రామములు కలవు." 2

ఇప్పుడీ గుద్రవారము — గుడివాడ కృష్ణ జిల్లాలో తాలూకాగా మారియున్నను, అప్పుడీ గుద్రవార విషయము — గుడివాడదేశము ముఖ్య రాజ్యమైయున్నది. అప్పటిరాజ్యపు సరిహద్దులిప్పుడు స్పష్టముగా తెలియవు. తెలియక పోయినను రండుబల్లిగ్రామము గుంటూరు జిల్లాలోనిదో, కృష్ణజిల్లాలోనిదో, గుర్తింప వలసియున్నది. ఈ శాసనము గుంటూరు జిల్లాలో సంపాదింపబడినది.

మరియు, ఇందలి 'కల్పట్టణము' సముద్ర తీరములోనిదై యుండనిదే, ప్రయోజనములేదు. "ఇప్పుడీ సరిహద్దులతో ఆ గ్రామము గుర్తించుట కష్టము" అని ఉదకమండలమందలి ఇండియా గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టుగారు తెలిపియున్నారు. శ్రీవారి కెంతయుకృతజ్ఞుడను.

పద్యములో 'కల్పట్టణాధీశ్వరుఁ' అను దానిని 'కాల్పట్టణాధీశ్వరుఁ' అని వైకల్పికముగా చదివినను, గణభంగ దోషములేదు. కాని, శాసనమందలి 'కల్పట్టణ' నామమే, పద్యమూలమన్నచో ఇది నెల్లూరు జిల్లాకృష్ణపట్టణము — కొలపట్టణము, గుంటూరు జిల్లా నల్లూరు-కొలపట్టణము మొదలగు వాదములకు తావుండదు. 'కల్లు-కలు' రూపాంతరములకు 'నలుపు' రంగు పూయవీలులేదు. నెల్లూరుజిల్లా గూడూరుతాలూకా సముద్రతీరములో 'ఒరగల్లు-ఒరు+కల్లు' గ్రామమున్నది. ఇందలి 'ఒర' విశేషణమును విడిచి, 'కలు — కల్' పేరుతో 'పట్టణము'ను చేర్చి, 'కల్పట్టణము'గా కవి పేర్కొన్నాడన వీలున్నది. 'నామైకదేశే నామగ్రహణ'మ్మను పేరిక్కడ గ్రహింపబడినది. తెనుగు గ్రామములను సంస్కృతీకరించి చెప్పుటలో ఇట్టి మార్పులు సాధ్యమగుచున్నవి.

క్రీ. శ. 846-847 ప్రాంతమందలి ఐదవ కలి విష్ణువర్ధన మహారాజు కాలములో ఈ తామ్రశాసన దానము పుట్టినది. కీర్తిశేషులు శ్రీ కే. వి. లక్ష్మణరావుగారు కనిపెట్టిన శాసన మిదియే కావోలును.

ఎట్లయినను, ఆయా ప్రాంతమందలి బరిశోధకులు కల్పట్టణ గ్రామమును శాసనమందలి పరిసర గ్రామములతో గుర్తించి, తెలిపెదరను జిజ్ఞాసతో ఈ సరిహద్దులు ప్రకటింపబడినవి. ముద్రణము కానిదే సంపూర్ణ శాసన పాఠము లభించదు

చరిత్రకెక్కని చరితార్థులు

# "రాళ్లరగించిన" రాగోపాసకులు

శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావుగారు



నేటి సంగీతమునకు మూలస్థానము రాయల రాజధాని విజయనగరము. విద్యారణ్యులు, రామామాత్యులు, 18 వ శతాబ్ది ప్రారంభమున నున్న అహోబిల పండితుడు కర్ణాటక సంప్రదాయమునకు లక్షణకర్తలు. వీరి పాండిత్యము, రాయల ఆదరణ ఆనాడు కర్ణాటక సంప్రదాయమును రాజకీయాందోళనలనుండి రక్షించినవి. పురందరదాసులవారి గురువులగు వ్యాసరాయలు, తాళ్లపాక అన్నమాచార్యులు, పురందర దాసులు, కనకదాసు, భట్టుమూర్తి, పెద్దనార్యుడు ఆనాటి సంగీతనిధులు. మాయామాళవగౌళను స్వరావళులతోను, పిళ్లారి గీతాలతోను సంగీతవిద్యకు బాలబోధక విధానమును పురందర దాసులవారేర్పరచినది విజయనగరమందే. పురందరదాసులవారి పదాలు ప్రసిద్ధ రాగాలలో వేలకొలదిగా ప్రజలలో ప్రాకినవి. కర్ణాటక సంప్రదాయమునకు లక్ష్య, లక్ష్యములు రెండు అబ్బినవి. వీరను అంతకు మునుపు చలించు మేరువులతో వాడుచుండిరి. ఆయా మేళమునకు అనువుగా మెట్లను సవరటను గురించి "వాలారుజా కొనగోళ్ల నీ వలసతజా వాయింపమి" అను అల్లసాని పెద్దన మనుచరిత్ర పద్యములో స్పష్టమగును. వీరు మేరువులను ఇప్పటివలె కదలక నిర్మించుపద్ధతి భట్టుమూర్తి, గోవింద దీక్షితులు మొదలగు విద్వాంసులనేకులు పరిశోధనచేసి కనిపెట్టిన పెద్ద విషయము. ఆటుతరువాత మహారాష్ట్ర సంపర్కమువల్ల ఆ సంగీతములోని రాగాలను, అందచందాలను ధారాళముగా మన పద్ధతిలో ప్రవేశపెట్టినవారు దాసకూటమునకు చెందిన మహనీయులు. మానివి, చిప్పగిరి, మంత్రాలయం అన్నీ దాసులవారి మూలస్థానములు. క్రమేపి విజయనగర సామ్రాజ్యము క్షీణించినది. రాయల సంస్కృతి తంజావూరు మరుగు జొచ్చినది. అచ్చట నేటి అత్యున్నతదశను బొందినది.

అంతటి మహోన్నత దశయందున్న రాయలసీమ నేడు ఎంత వెనుకబడియున్నదో అందరికీ తెలిసినవిషయమే. శ్రీశ్యామాశాస్త్రులవారి పితామహులు, త్యాగయ్యగారి ప్రపితామహులు, రాయలసీమ (కర్నూలు ?) జిల్లాలనుండి తంజావూరువెళ్లిన విషయము [1] మన విద్వాంసులకు తేటతెల్లము. నేటికినీ రాయలసీమలో గ్రామాలలో సైతము కర్ణాటక సంగీతమన్న చెవికోసుకొనువారు లేకపోలేదు. జనసామాన్యానికి శారీర సంపద బాగుగా నుండును. గ్రహణశక్తియూ బాగున్నది. ఎందువల్లనో ఆ జిల్లాలో సుప్రసిద్ధులయిన గాయకుల సంఖ్య బహుతక్కువ.

రాయలసీమ సంగీత విద్వాంసులను గురించి నాలుగు ముక్కలు వ్రాయదలచితిని. నాకు బాగా తెలిసినవారిని గురించి మాత్రమే వ్రాయగల్గుట నాకు కొరతగా కనుపడకపోలేదు. ఇతర గాయకులను గురించి తెలిసినవారు విపులముగా వ్రాసి, ఈ కొరతను తీర్చవచ్చునని ఆశించుచున్నాను.

సుమారు ముప్పది సంవత్సరముల మాట. పెనుగొండ, అనంతపురం, బళ్లారి - వీధులలో ఉదయం ఆరుగంటలకే స్వరములు పాడుచుండగా తన్మయుడై-ఎదకు మాటకు జవాబయిన సవ్యముగా ఇవ్వజాలని-ఒక వృద్ధసంగీత విద్వాంసుని చూచినట్లు రాయలసీమవారెవరయినను జ్ఞాపకము తెచ్చుకోవచ్చును. తిద్దిన మీసము, చేతికర్ర, అంగవస్త్రము, నశ్యము డబ్బి-ఈ హంగులతో మంచి ప్రతిభను జూపు నొసటితో-లలితమగు హాస్యపు మాటలాడుచూ ఆయన వెళ్లుచుండిన దృశ్యము నా కంటికి కట్టినట్లున్నది. ఆ ఘనవిద్వాంసుని పేరు శ్రీ పక్కా హనుమంతాచార్యులు. సుప్రసిద్ధ వాగ్గేయకారులు శ్రీమాన్ వాసుదేవాచార్యుల వారి సమకాలికులు. బ్రతికివుంటే నేటికి వారి వయసు తొంభయి దాటెడిది. 1939 ప్రాంతములో పెనుగొండలో పరమ దరిద్రావస్థ ననుభవించి కాలధర్మము నొందిరి. వారివంటి విద్వాంసులు ఏదేశమందయినా ఏనాడయినా, అరుదనియే చెప్పవలయును.

నాకు నాలుగవ ఏట వీరు సరళీవరుస లారంభించిరి; ఆ చిన్నవయసులో ఈ స్వరావళుల సాధన, అలంకారములను త్రికాలము పాడుట చాల కష్టము, అనవసరమనికూడ వీరి అభిప్రాయము. మాచాయగా వాటిని నోట అనిపించి చిన్నచిన్న దాసులవారి పదాలను నేర్పేవారు. కాంభోజి, మోహన, ధన్యాసి, కల్యాణి, శంకరాభరణము మొదలగు ప్రసిద్ధ రాగములందు సరళమయిన ఆ పదములు వినికిని పాఠముచేయుటకు ఆ పసితనమున నే నెంతో కుతూహలపడుచుంటిని. కొన్ని చిన్నకీర్తనలు- ఒక మాట ఒక బాణము, సుజనజీవనా, సీతాపతేలాంటివి-నేర్పి, అప్పుడప్పుడు ఒక తాన వర్ణము, నెలకొకసారి ఏదయిన ఒక అలంకారమును సాధనచేయుట వీరి బోధన పద్ధతి. అంత సులభముగా, అంత త్వరగా ఎంత మంచి సంగీతము పసిబాలురకు నయితము బోధించ గల్గిరో—ఒకసారి తలచుకున్న ఆశ్చర్యము కలుగకపోదు. ప్రారంభదశయందు చెవితో విని పాటను గ్రహించు శక్తిని పెంపొందించ వలయు నని వీరి ఆశయము. ఆ గుణము గాయకులకు సహజమే. మొదట భద్రాద్రి రామదాసు, అన్నమయ్య, పురందరదాసులు మొదలగు మహనీయుల భజనకీర్తనలను నేర్పి, కొంత పాటయందు అభిరుచిని గలుగజేయువారు. ఆ రీతిగా కొన్ని కీర్తనలు పాడ నేర్చిన తరువాత స్వరావళులను నేర్పుచు అప్పుడప్పుడు చిన్న చిన్న కీర్తనలనుకూడ నేర్పేవారు. స్వరావళులంటే—అప్పుడు సుందరనాద శకలములుగా బోధపడగలవు. నోట పలుకు స్వరములు, చేతియందు నడచు తాళము—కొంత ఇంపు సొంపులతోకూడ అమరును. ఇది వారి విద్యాబోధనలోని వైశిష్ట్యము. తరువాత పెద్దపెద్ద కీర్తనలు- రామబాణ, నా జీవాధార, క్షీరసాగరశయనా, క్షీణమై, ఎవరిచ్చిరి మొదలగునవి-రూఢిచేయించేవారు. ఒకనెల, రెండునెలలు ఒక రాగమందే మనసుకు నాటునట్లు, ఒక చిన్నవర్ణము, నాలుగయిదు కీర్తనలు నేర్పేవారు. ఏ ఒక్క రాగము మనసు కర్థమయినను—ఇక అన్నిరాగములూ క్రమముగా సులువుగా అవగాహనము కాగలవని వారి విశ్వాసము. విద్యార్థి శారీరధర్మము, మనో బలము, వాంఛలను ఒక గడియలో కనిపెట్టి వారివారి అభిరుచులకు అనుగుణముగా నేర్పు నైపుణ్యము—శ్రీ పక్కా హనుమంతాచార్యులవారికి దేవుడిచ్చిన సొత్తు. ఒక స్వరజతి, ఒక వర్ణము, ఒక చిన్న కీర్తన, రెండు పెద్ద కీర్తనలు, ఒక పదము, జావళి, తిల్లాన - ఇన్ని ఒకనెలలో తోడిరాగములో, మరొక నెలలో శంకరాభరణము, ఇంకొక నెలలో కల్యాణి, కాంభోజి, భైరవి — తరువాత ధన్యాసి, సావేరి, మోహన; ఈ విధముగా నాలుగయిదు సంవత్సరములలో ప్రసిద్ధరాగముల స్వరూపము మనసున నాటునట్లు నేర్పేవారు. ఆ స్థితిలో స్వరజ్ఞానము నలవడచేయుటకు ప్రయత్నించేవారు.

"అలంకారములకు — ఆ పేరెందుకు ఇచ్చిరి?" అని ఒకరోజు పాఠము పూర్తి అయిన తరువాత అడిగిరి. ఎనిమిది సంవత్సరములు పూర్తికాని విద్యార్థికా ప్రశ్న అర్థమయిన కదా, జవాబిచ్చుటు. వెంటనే 'మోహన రాగములో రూపకతాళ అలంకారము పాడుము—సరి సరిగప, రిగ రిగపద, గప గపదస' అన్నారు. సరే నని పాడుచుండగా వాటిని అకారముతో అనమన్నారు. కొంత సేపాగి వారు మరికొన్ని సంగతులు పాడినారు. వాటి స్వరమేమని వారడుగక నే వెంటవెంటనే చెప్పగల్గితిని. "మావాడికి స్వరజ్ఞానమయినది" అని ఊరంతా చెప్పుకొని— ఆ సుసమయము జ్ఞాపకముండవలయు నని "అలకలల్లలాడగగని ఆరాణ్ముని ఎటు పొంగెనో" అన్న కీర్తనను నేర్పిరి. మరొకసారి అభోగి, హంసధ్వని రాగాలలో అలంకారాలను పాడమన్నారు: "చూచితివా ఆ ప్రయోగముల ననుసరించి రాగమును పెంచుకొని పోయిన ఎంత అందముగా నున్నదో—మంచి కన్యకకు భూషణములవలె ఈ ప్రయోగములు రాగానికి అలంకారములుగా నున్నవి—గమనించితివా?" అన్నారు. అలంకారముల ప్రయోజనము, వానినుండి సంగీతమున మనమెన్నివస్తువులు సాధించగల్గుదుమో, వానికి ఆ పేరెందుకు వచ్చినదో, వానిని అనుదినానుష్ఠానముగా పాడుచుండిన స్వరశుద్ధమయిన రాగాలాపన ఎట్లు అలవడునో—అన్ని విషయాలు పసివారికికూడ బోధపడునట్లు విద్యగరపు నేర్పరి హనుమంతాచార్యులవారు. కీర్తనలలో ఎచ్చట నెరవలు చేయవలెనో సూచించేవారు.

స్వరప్రస్తారములోని బాగోగులు క్రమముగా వానియంత యవి విద్యార్థికి వ్యుత్పన్నత ఎక్కువగుకొలది స్వతహాగా బోధపడవలసినవే గాని ఇప్పటివలె రెండు సంవత్సరములలోగా జగన్మోహిని రాగములో అరగంట స్వరములను శుకసారికలవలె ఒప్పచెప్పునట్లు తయారుచేయు గారడీ విద్య—ఆచార్యులవారికి నచ్చనే నచ్చదు.

వీరి పల్లవి ప్రస్తారక్రమము అపారమయిన కల్పనా విశేషములతో కూడియుండెడిది. స్వరకల్పనలో అంత సర్వలఘుశుద్ధముగా అందమయిన నడకలతో, ధారాళముగా పాడువారిని నేనెరుగను. (వారిమనోధర్మముతో పోల్చుటకు సరియయినవారు శ్రీమాన్ మైగరు వరదాచార్యులవారు. ఇట్టి విద్వాంసులను కన్న హిందూపురము భాగ్యనగరము.)

వీరు చిన్నవయసులో కావ్యాలు మూడు ముగించి దక్షిణదేశములో కరూరు వెళ్లినారు. అక్కడ సుప్రసిద్ధ లయ విద్వాంసులు కరూరు రామస్వామి పిళ్ళెగారివద్ద గురుకులవాసము చేసిరి. వీరికి ఆ శిష్యు లందరిలో 'శట్టాంపిళ్ళె'—(మానిటర్) పదవి లభించినది. కోయంబత్తూరు తాయి, పల్లడం సంజీవరావుగారు అప్పటికప్పుడే సరళివరుసలు సాధన చేయుచుండిరట. కోయంబత్తూరు తాయికి వీరిపై చాల భ్రమ; గురువుగారు నేర్పినదానిని వీరి వద్ద రూఢి చేయించుకునేవారట. ఆమె స్వయముగా హిందూపురమునకు వచ్చి శ్రీ ఆచార్యుల వారికి వివాహము చేయించి, కొంత భూమిని కొని ఇచ్చిరట. ఆచార్యులవారు చిన్నవయసులో అద్భుతమయిన శారీరధర్మము గల్గి గొప్ప సభలందు సభారంజకముగా పాడి యశస్సును గడించిరి. వీరి కచ్చేరీలు విను భాగ్యము నాకు లేదు. అంత విద్వాంసునికూడ ఆదరణ లేక, తుదకు అనాదరణకు గురిచేసి దరిద్రావస్థ ననుభవింపజేసిన రాయలసీమ రసికులు ధన్యులు గదా!

వారియొద్ద విద్య నభ్యసించినవా ర నేకులు. వారిలో శ్రీ చింతలపల్లి వెంకటరావుగారు సుప్రసిద్ధులు. వీరికిప్పుడు దాదాపు 75 సంవత్సరములు. నేటికినీ వీరి శారీరపటుత్వము విన్నవారికి విస్మయము గొల్పును. వీరి పుత్రులు చింతపల్లి రామచంద్రరావుగారు మైసూరు ఆస్థాన విద్వాంసులు.

వెంకటరావుగారి కచ్చేరీలు రాయలసీమలో ఇరవయి సంవత్సరముల క్రితము విరివిగా జరిగేవి. వీరి రక్తి, శక్తి అసాధారణము. కంచు శారీరము, చక్కని బాణి, లయ పటుత్వము, పురుష గాంభీర్యము, వీరి గానము విన్నవారు మరచిపోజాలరు. భావయుక్తముగా పాడుచునే రాగరసాన్ని విరజిమ్ము ఒక విలక్షణమయిన శైలి వెంకట- వుగారి గానములో కానవచ్చెడిది. వెంకటరావుగారు ప్రారంభదశయందు శ్రీ హనుమంతాచార్యుల వారివద్ద నేర్చుకొని తరువాత సైకోర్పరపట్ట శేషణ్ణగారి వద్ద విద్యను పరిపూర్ణముగా నేర్చిరి. వీరి కచ్చేరీలు రాయలసీమ ప్రజలకు కర్ణాటక సంగీతమును 'మరవకం' డని జ్ఞాపకపరచినవన్న ఎంతమాత్రమూ అతిశయోక్తి లేదు.

శ్రీ చింతలపల్లి వెంకటరావుగారివలె చక్కని శారీర సంపద అందరికీ అబ్బదు. శారీర ధర్మము కొంత లోపించినను అసాధారణమయిన కల్పనా వైచిత్రిగల గానము కీర్తిశేషులు శ్రీ కురుగోడు పెద్దవెంకటాచలయ్యగారిది. శరపరంపరగా, అపూర్వ తాళములందు విషమతాళ వరుసలను నిర్లక్ష్యముగా పాడగల ప్రతిభావంతు డీయన. సర్వలఘు స్వరములందునూ ఆరితేరినవారు. ఈ రెండునూ ఒకేచోట వినుట దుర్లభము. శ్రీ శెమ్మంగుడి శ్రీనివాసయ్యరుగారి స్వరధోరణి విన్నవారు కొంతవరకు పెద్ద వెంకటాచలయ్యగారి ప్రబంధ శైలిని స్మరించుకోగలరు. వీరికి శారీరమంత సౌలభ్యము గలదికాదు; కాని వీరి గానములోని సాంప్రదాయ ప్రకర్ష, సాధనా పటిమ ఒక్కొక్క ప్పుడు పండిత పామరులకు దిగ్భ్రమ కలిగించెడివి. వీరునూ తొలుత పక్కా హనుమంతాచార్యులవారి వద్దనే అభ్యసించి పిదప తిరువయ్యారు (ఘంటా) సుబ్రహ్మణ్యయ్యరు వారియొద్ద విద్యనార్జించిరి. వీరికి కచ్చేరీలు బహుతక్కువ. గొప్ప విద్వత్తును చేతబెట్టుకొని నిరాదరణకు గురియయి క్రుంగి కృశించి తుదకు విరాగియై కర్నూలులోని మఠములో నొకచిన్న గదిలో తన వృద్ధాప్యమును నిరంతర దరిద్రావస్థలో గడపిరి. వీరు మరణించి ఇంకను పది సంవత్సరములు కాలేదు. ఇంతటి విద్వాంసులిక హిందూపురము నొసట వ్రాయలేదనవచ్చును.

వారి మేనల్లుడు, శిష్యుడు శ్రీ కురుగోడు చిన్న వెంకటాచలయ్యగారు గొప్ప విద్వాంసులు. కర్నూలులో నున్నారు. తొలుత మామగారి వద్ద విద్యనభ్యసించి పిమ్మట నామక్కల్ నరసింహయ్యగార్ల వారివద్ద శ్రీరంగ క్షేత్రములో వ్యాసంగము చేసినవారు. వీరి కల్పనావైచిత్రి, స్వరముల జిగిబిగి విని ఆనందించవలసినవి. వీరి తమ్ములు వెంకటనరసయ్యగారు మంచి వయొలిన్ విద్వాంసులు.

కొరుగోడు పెద్ద వెంకటాచలయ్యగారితో పాటు సహాధ్యాయిగా కృషిచేసినవారు కీర్తిశేషులు శ్రీ చిలమత్తూరు రామయ్యగారు. వీరి స్వగ్రామము హిందూపురము గొప్ప వయొలిన్ విద్వాంసులు. వీరుగూడ ప్రథమాభ్యాసమును శ్రీ పక్కా హనుమంతాచార్యుల వారివద్దనే చేసిరి. వీరి గురువులు శ్రీ విద్యోపాసకులు. హఠయోగమునందు నిపుణులు. వీరు మందలపల్లి గ్రామములోని పాఠశాలలో 'సంగీతం మేష్టరు' ఉద్యోగముచేసి-పిదప అనంతపురములో సంగీత విద్యావ్యాప్తి చేసిరి. వీరు మరణించి సుమారు 15 సంవత్సరములు కావచ్చును. వయొలిన్ వాద్యము నింత సాంగముగా సాధించినవారు మనదేశమునందరుదు. అలంకారములను పట్కాలములు సాధనచేయించుట; వర్ణములను త్రికాలములలో గమకబద్ధముగా పాడుట; కాల, అర, ముక్కాలు జాగావిడచి వర్ణములను సాధనచేయుట, గతిభేదపు రహస్యములు-వీరి వద్ద ఛాత్రవృత్తిని చేసినవారికి లభించు అపూర్వ సాధనావిశేషములు. సాధన చేయించుటయందు వీరికి వీరేసాటి. రాగప్రస్తారమునందు వీరికి ఆసక్తి మెండు. నాటకురంజి, సురటి, వసంత, శహాన, హుశేని-రాగాలను అరగంటసేపు ఎంత మాత్రము విసుగురానివ్వక - రాగప్రయోగములతో ప్రస్తరించు ధీశాలి. ఇప్పుడు ఇట్టి శక్తి ఎంతవరకు క్షీణించినదో సంగీత విద్యయందు ఆసక్తిగల రసికులకు తనంతటనే బోధపడగలదు. వీరివద్ద విద్యనభ్యసించు భాగ్యముకూడ నాకు కల్గినది.

అనంతపురములో మొన్నటిదాక బహురక్తిగా, ఇంపుగా వాయించుచుండిన శ్రీ ఆముదాల వెంకటస్వామిని ఈ సందర్భమున చెప్పక తప్పదు. వీరి పక్కవాద్యము బహు రంజకముగ నుండెడిది. వీరి పూరు సంగీతమునకు పుట్టినిల్లు. ఆముదాల గుండాసాని ఆదవానిలో నుండిన సుప్రసిద్ధ గాయనీమణి. ఆమెయు, ఆమె సోదరీ మణులును దక్షిణదేశమందుకూడ పేరుగాంచిరి. పదాలు వీరి సొత్తు.

బళ్లారి నగరమున సుమారు 30 సంవత్సరములు సంగీత విద్యావ్యాప్తికి నిరంతరము కృషి చేసినవారు కీర్తిశేషులు శ్రీ ఫిడిల్ రాఘవేంద్రాచార్యులవారు. వీరు హొసపేట వాస్తవ్యులయిన ఫిడిల్ భీమాచార్యులవద్ద తొలుత విద్యనభ్యసించిరి. బళ్లారి నగరమందు గానరసికబృందమును ఏర్పరచిన గాయకులలో శ్రీ ఫిడిల్ రాఘవేంద్రాచార్యులవారగ్రగణ్యులు. ఇక సంగీత రసికులలో పేర్కొనదగినవారు కీర్తిశేషులు శ్రీ వక్కలు ఆంజనేయులు, శ్రీ వేదగిరి శెట్టిగారలు కాకినాడలో శ్రీ కొమ్మిరెడ్డి నాయుడుగారిని మెప్పించుటెట్లో అట్లే బళ్ళారిలో ఆ రసికులను మెప్పించుట గాయకుల లక్ష్యమయి యుండెడిది. రాఘవేంద్రాచార్యుల వారి విద్యాబోధనశక్తి అసామాన్యము. అనేక వాద్యములను సులువుగా వాయించి, నేర్పేవారు. వీరి పక్కవాద్యములోని వైశిష్ట్యము విన్నవారికిగాని తెలియదు. ప్రధాన గాయకుని మనోధర్మము నెంతమాత్రము చెదరనివ్వక అణకువతో శ్రుతినందించి, విడిగా వాయించునప్పుడు రాగములోని ముఖ్యమయిన ప్రయోగాలు క్లుప్తముగా వాయించేవారు. ముఖారి, ఓలహరి, మొదలగు రాగాలను ఫిడేల్ మీద చేయివేయగనే సంగీతము రానివారికి గూడ సుబోధమగునట్లు ప్రారంభించెడివారు. వీరి కృషిని బళ్ళారి వాస్తవ్యులెన్నడూ మరువరు. వీరి శిష్యులలో ముఖ్యులు వీరి మేనల్లుడు విద్వాన్ భీమసేనాచార్యులు, వీరి పుత్రులు శ్రీ నరసింహమూర్తి.

ఇట్టి 'రాల్గరగించిన' విద్వాంసులు ఊరు పేరు లేక గతించినది ఎక్కువగా రాయలసీమయందే. వారి గానమువిని "ఎందరో మహానుభావులు, అందరికి వందనము" లనుకున్నాను.

# విన్నకోట పెద్దయ కవి - : : అనంతామాత్యుడు

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు



## ౧

తెలుఁగున వెలసిన మొదటి యలంకార గ్రంథము కావ్యాలంకార చూడామణి. అలంకార శాస్త్రవిషయములతోఁబాటు ఛందో వ్యాకరణాంశములు కూడ ఇందు వివరింపఁబడినను, అవి రెండును గలిపి మూఁడాశ్వాసములలో సంగ్రహముగనే చర్చింపఁబడినవి. ఇందలి [1] ఆశ్వాసాంత గద్యములుకూడ ఇది అలంకారశాస్త్రమనియే పేర్కొనుచున్నవి.

కావ్యాలంకార చూడామణిని రచించినవాఁడు విన్నకోట పెద్దయకవి; నియోగి బ్రాహ్మణుఁడు; కౌశిక గోత్రుఁడు; గోవిందామాత్యుని పుత్రుఁడు. ఇతఁడు తన గ్రంథమును రాజమహేంద్రవర నగరాధీశ్వరుఁడును, చళుక్య వంశ సంభవుఁడునైన విశ్వేశ్వరరాజున కంకిత మిచ్చెను. ఈ విశ్వేశ్వరరాజుం గూర్చియు, పెద్దయకవింగూర్చియు శ్రీ వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్రయందు క్రింది విషయము వ్రాసియున్నారు.

"విశ్వేశ్వరమహారాజు విశాఖపట్టణమండలమునందలి సర్వసిద్ధి కీశాన్యముగా మూఁడు క్రోశముల దూరముననున్న 'పంచధార'లవద్ద శ్రీ ధర్మలింగేశ్వరస్వామి కొక మండపమును కట్టించిన ట్లచటి శిలాశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. శాసనమున మండపమును గట్టించిన సంవత్సరము సూచింపఁబడలేదు; కాని, విశ్వేశ్వరుని వంశవృక్షము మాత్రము క్రిందివిధమున ఈయఁబడినది- 1. భీమేశ్వరుఁడు; అతని కుమారుఁడు 2. విమలాదిత్యుఁడు; 3. తత్పుత్రుఁడు రాజనరేంద్రుఁడు; 4. అతని కొడుకు కులోత్తుంగ చోళదేవుఁడు; 5. తత్సుతుఁడు విమలాదిత్యుఁడు; 6. అతని తనయుఁడు మల్లప్పదేవుఁడు; 7. అతని నందనుఁడు ఉపేంద్రభూపాలుఁడు; 8. తత్తనయుఁడు కొప్పభూపాలుఁడు; 9. అతనికొడుకు మనుమోపేంద్రుఁడు; 10. అతని తనయుఁడు విశ్వేశ్వరరాజు - దీనింబట్టి చూడ, విశ్వేశ్వరరాజు రాజనరేంద్రున కేఁడవ మనుమఁడైనట్లు తెలియుచున్నది. పెద్దయకవి కావ్యాలంకార చూడామణియందు మీఁది కృతిభర్తృవంశమును పూర్తిగా నీయలేదు; కాని, యిచ్చినంతవఱకును మీఁది వంశవృక్షమునకు సరిపడియేయున్నది.[2]

---

1. '...శ్రీమనుమాగమణి చరణారవిందవందన, గోవిందామాత్యనందన, వివిధబుధ విధేయ, విన్నకోట పెద్దయనామధేయ విరచితంబైన కావ్యాలంకార చూడామణియను నలంకార శాస్త్రంబునందు'.

2. సీ. శ్రీకంఠచూడాగ్ర శృంగారకరణ మేరాజున కన్వయారంభగురుఁడు,
చాళుక్యవంశ భూషణుఁడు శ్రీ విష్ణువర్ధనుఁ డేమహీశు తాతలకుఁదాత,
భృతకుమారారామ భీముండు చాళుక్యభీముఁ డే నృపకులాబ్ధికి విధుండు,
రాజమహేంద్ర వరస్థాత రాజనరేంద్రుఁ డెక్కువ తాత యేవిభునకు,
సంధ్రదళదానవోపేంద్రుఁ డగు నుపేంద్రధరణి వల్లభుఁ డే రాజు తండ్రితాత,
ఘనుఁ డుపేంద్రాఖ్యుఁ డెవ్వని కన్నతండ్రి, యతఁడు విశ్వేశ్వరుఁడు లక్కమాంబ
సుతుఁడు. [చూడా. 1-4]

రెండు గ్రంథములే కాక కావ్యప్రకాశము మొదలగు నితరగ్రంథములను గ్రంథరచనమున నుపయోగించినట్లు 'శక్తిగ్రాహకములు' మొదలగు విషయములంబట్టి చెప్పవచ్చును. ఇందలి ఛందో వ్యాకరణభాగములు కవి స్వయంరచితములు. కాఁగా నిందలి యలంకారభాగమునకు కావ్యాదర్శ, ప్రతాపరుద్రీయములు మూల మూలము లనియు, తక్కినవి కవిస్వయం కృతము లనియు, సంగచే నిది యొకరీతి స్వతంత్ర గ్రంథ మనియుఁ జెప్పవచ్చును. అతనికిఁ దన యేలిక యొసఁగిన యానతినిబట్టి కూడ నిది మిశ్రలక్షణ గ్రంథముగ వెలయవలయు ననియే కవికోరిక యైనట్లు తెలియుచున్నది.[1] ఇతఁ డేగ్రంథమునుగాని, గ్రంథకర్తనుగాని (తనకు ఉపయోగించిన వానిని) తెలుపలేదు.

కావ్యాలంకారచూడామణి తొమ్మిదియుల్లాసముల గ్రంథము. మొదటి యేడుల్లాసములను మాత్రము శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు 1909 వ సం. న ముద్రించి ప్రకటించిరి. పిదపఁ గొంతకాలమునకు శ్రీ ఆంధ్రసాహిత్య పరిషత్తువారు పరిశిష్టోల్లాసద్వయమును సంపాదించి ప్రత్యేక గ్రంథముగఁ బ్రకటించిరి. 1929 సం. న వెలసిన నూతన ముద్రణమున శ్రీ శాస్త్రి గారు చివరి రెండుల్లాసములను గూడఁ జేర్చిరి.

ఇందలి ప్రథమోల్లాసమున, భావము, విభావానుభావ, సాత్త్విక వ్యభిచారిభావములు, స్థాయిభావములు లక్షణోదాహరణములతో కలవు. ద్వితీయోల్లాసమున శృంగారము, దాని భేదములు, చేష్టలు, అవాంతరభేదములతోఁ గూడిన హాస్యాద్యష్టరసములు వివరింపఁ బడినవి. తృతీయోల్లాసము నాయికా నాయకులు, నాయకసహాయులు, నాయికా సహాయులు. సప్తవిధకథలు, అష్టాదశవర్ణనములు అను వానిని వివరించుచున్నది. చతుర్థోల్లాసమున కావ్యభేదములు, ద్రాక్షాదిపాకములు, వృత్తులు, రీతులు, గుణములు మొదలగువాని నిరూపణ కలదు. పంచమోల్లాసము అర్థాలంకారములను, షష్ఠోల్లాసము శబ్దాలంకారములను, పదవాక్యార్థదోషములను వివరించుచున్నది. అలంకారవిషయ ప్రతిపాదకము లీ యాఱుల్లాసములే. సప్తమోల్లాసమును, అష్టమోల్లాసమును ఛందోవిషయ నిరూపణతో ముగిసినవి. నవమోల్లాసము వ్యాకరణాంశ ప్రతిపాదకము.

ఏదో యొక గ్రంథమును గాక పెక్కు గ్రంథముల ననుసరించి వ్రాయఁబడిన గ్రంథములలో పొందిక లేనివి, విరుద్ధములు నగు అభిప్రాయములు చేరవచ్చును. అన్ని గ్రంథములను బాగుగ పరిశీలించినఁగాని విరోధములు లేకుండ విషయము నిరూపించుట కష్టము. పెద్దయ కవి రసభావాదిస్వరూపనిరూపణమున విద్యానాథుని మతమును, రీతి విషయమున వామనమార్గమును, గుణస్వరూప వివేచనమున దండిపద్ధతిని అనుసరించెను. కాలభేదమునుబట్టి వారి మతములు భేదించినవి. అన్నిమతములకును ప్రాధాన్యము నొసఁగుచు పెద్దయకవి మతభేదములను లెక్కింపక పరస్పర విరుద్ధము లగు విషయములను పెక్కింటిని చేర్చెను; కొన్నిటికి లక్షణము పొందలేదు; కొన్ని లక్ష్యములు తల్లక్షణముల కననుగుణములు; కొన్ని తెలుఁగున కుపయోగింపని విషయములు వివరింపఁబడినవి; ఉపయోగించునట్టి కొన్ని విడువఁబడినవి.

1. రసాభివ్యక్తికిఁ గల కారణములలో విభావము కలదు. అది ఆలంబనము అని, ఉద్దీపన మని రెండువిధములు. రసమునకు సమవాయకారణము (ఏది లేక రసము కలుగదో అది సమవాయకారణము) నాయకుఁడు, నాయికయు. నాయికానాయకుల గుణము, చేష్ట, అలంకారము, తటస్థము ఉద్దీపనవిభావములు. ఇది అలంకారశాస్త్ర సంప్రదాయము. పెదయ నాయికా నాయకులను ఆలంబన విభావముగా లెక్కింపక వారి రూపయౌవనకాంతుల నే లెక్కించెను. అది సంప్రదాయ విరుద్ధము.[2] ఉద్దీపనవిభావ

1. ఉ. భావరసప్రపంచమునఁ బర్వ నలంకృతిలక్షణంబు, ఛం
దోవిచిత్రప్రకారము, కుతూహల విస్ఫురదాంధ్రదేశ భా
షా వివిధప్రసంగముల చందము సందముగా నొనర్చి, వి
ద్యావిధి గానిపించుటగదా చతురత్వ మనంగ మేదినిన్! [1-11]

2. క. ఆలంబనంబు నాఁగర సాలంబన మైనరూప యౌవన కాంతి
శ్రీలావణ్యాదిక; మదిమూలము తద్వ్యక్తికిన్ బ్రహోవప్రదమై.

ములలోఁ గూడ తిరిగి పయివానినే పేర్కొనెను. [1]లక్ష్యములు లక్షణానుగుణము లయి పరస్పరము భేదము లేక యున్నవి. ఇచటఁ బూర్వాపరవిరోధమును కలుగుచున్నది.

2. చూడామణియందు స్థాయిభావలక్షణము 'ఆత్మసంభావిత విభావకానుభావ, సాత్త్విక, వ్యభిచారిసంజ్ఞలఁ దనర్చు భావములచేత సువ్యక్తభంగులైన, వాని రసికులు స్థాయిభావంబు లండ్రు' అని కలదు. (పుట. 12) కాని సజాతీయ భావములచేతఁ గాని, విజాతీయ భావముల చేతఁ గాని అపహృతము గాక రసాభివ్యక్తి పర్యంతము నుండు స్థిరమగు భావము స్థాయి. మీఁదిది రసమునకు లక్షణము కాఁగలదు.

3. 'అతి వికృత దర్శనాభాషిత చేష్టాగతుల చేతఁ జేపడు హాసప్రతిపాదన'ము హాస మని హాసలక్షణము. దాని యుదాహరణము దాని కనుగుణముగ లేదు. [2] అందలి హాసము వికృత దర్శనము వలనఁ గల్గినది కాదు; అది శృంగార రసానుకూలము. హాస్యోదాహరణమును పయి రీతిగనే అననుకూలము. [3] 13వ పుటయందలి జుగుప్సోదాహరణమున జుగుప్స వ్యక్తముగ లేదు. 14వ పుటయందలి విస్మయోదాహరణమున 'విస్మయ' పదము ప్రయోగింపఁ బడినది. భావములు, అందును స్థాయిభావములు పేరితో చెప్పఁబడకూడదు.

4. నాయకుఁడు ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంత భేదములచే నాల్గు విధముల నుండును. ధీరోదాత్తుఁ డెన్నఁడును ధీరోద్ధతాదులలో నన్యతముఁడు కాఁజాలఁడు. అట్లె ధీరోద్ధతాదులును. ఈ గ్రంథములోని ధీరోదాత్తుఁడు విశ్వేశ్వరభూపతియే తిరిగి ధీరలలితుఁడుగ చెప్పఁబడెను. (పుటలు 31, 32).

5. దండి కావ్యభేదములను 'గద్యం, పద్యంచ మిశ్రంచ తత్త్రిధా పరికీర్తితమ్' అని మూఁడు విధములుగ పేర్కొనెను. ఈ భేద పరిగణనము సంస్కృతమునకు సరిపడును; తెలుఁగునకు సరిపడదు. ఆంధ్రమునందలి పద్య కావ్యములు సామాన్యముగ గద్యసహితములు. అవన్నియును పద్యకావ్యము లనియే వాడుక. మిశ్రకావ్యములుగ ప్రసిద్ధములు కాలేదు. మఱియుఁ బెద్దయకాలమునకు ఆంధ్రమున వచనగ్రంథములు వెలువడలేదు. కావునఁ బయి సంస్కృతమూలము ననుసరించి 'అట్టి కవికృతమైన కావ్యత్రయంబు, గద్యపద్య విమిశ్ర సంపాద్య మండ్రు.' (పుట 41.) అని ఆంధ్రానుపయుక్తముగ విభాగ మొనర్చుటకుఁ దగిన ఫలము లేదు. ఈ విభాగమే తిరిగి 18వ పుటయందును కలదు. అచ్చట నితఁడు మిశ్రకావ్యములలో రూపకములను, నాటకములను, చంపూకావ్యములను లెక్కించెను. అప్పటికాంధ్రమున నాటకములు గాని చంపూగ్రంథములను ప్రత్యేకగ్రంథములు గాని లేవు. న్యాయమునుబట్టి యితఁడు విద్యానాథాదుల వలె 'ధ్వని, గుణీభూతవ్యంగ్యము, చిత్రము' అను భేదములనే వివరించుట మంచిది. [5] ఉత్తమకావ్యమగు ధ్వనియు నొకచో లక్షణోదాహరణములతో వివరింపఁ బడినది.

6. వృత్తి (వ్యాపార) సాహాయ్యమున శబ్ద మర్థమును బోధించును. అది అభిధ, లక్షణ, వ్యంజన అని మూఁడు విధములు. ఆవృత్తి

---

1. సీ. రూప ... వ్యక్తాంగ జ్యాదిశారీర
 గుణము లాలంబనగుణములరయ. (చూడా. పుట. 4.)

2. క. చాలఁ ... భుజిఁ దలఁచిన పాలల నీ నుసుటిచేత, నెఱిఁగి తినుచున్
 నీలాప సమునకు నావాలముఁ గావించెనింతి వదనోదరమున్. (13 పుట)

3. ఉ. కల్ప కుజంబులం దెగడుఁ, గామగవిం బ్రహసించు, వట్టిసం
 కల్పఫలాయినవ్వు, శిబికర్ణుల చాగము నేవగించు, న
 స్వల్పవదాన్య విశ్వజన వల్లభుచే సిరినొందియాతురా
 ట్కల్ప విదూషకప్రతతి గర్వితరాజ సభాంతరంబునన్.

 దండిమాత్రము హాస్యమునకిట్టి యుదాహరణమునే యిచ్చియున్నాఁడు. (పుట 24)

5. క. పాకాదికృతవ్యంగ్య-వ్యాకీర్ణం బైనకావ్య మది యుత్తమమై
 పేరొందఁబడు మధురార్థ-శ్రీకము ధ్వని యనెడు పేరుచేఁ జెలువొందగన్. (పుట 55)

శబ్దవృత్తి యని ప్రసిద్ధము. వాచకశబ్ద మభిధవలన ముఖ్యమగు (వాచ్యమగు) నర్థమును, లక్షకశబ్దము లక్షణవలన లక్ష్యార్థమును, వ్యంజకశబ్దము వ్యంజనవలన వ్యంగ్యార్థమును బోధించును. పయి యంశమును వివరించు సందర్భమునఁ బెద్దయ 'అర్థవృత్తులు' అను శీర్షకక్రింద వృత్తుల స్వరూపముం దెలుపు నొక యాఁటవెలఁదిని వ్రాసెను.[1] దానింబట్టి ముఖ్యము, లక్ష్యము, గౌణము, వ్యంగ్యము నని యర్థవృత్తులు నాలుగనియు, వానివలన 'వాచ్యభేదంబులు తెలియు'ననియుఁ దెలియుచున్నది. వృత్తులభిధాదులు గాని వాచ్యాదులు కావు; అవియు శబ్దవృత్తులు గాని యర్థవృత్తులు కావు. ఒకవేళ ఎట్లో కష్టముమీద నవి యర్థవృత్తు లని యొప్పించినను, ఆవృత్తు లభిధాదులు కాని ముఖ్యాదులు కావు. అభిధకు 'ముఖ్య' యను వాచక యున్నను తక్కినవాని కట్టి వ్యవహారము లేదు. గౌణనిరూపణ మనావశ్యకము. అది లక్షణలోనే చేరును. పయి వృత్తులవలన వాచ్యము, లక్ష్యము, గౌణము, వ్యంగ్యము నను అర్థవిశేషములు క్రమముగ కలుగునుగాని వాచ్యభేదములుమాత్రము కలుగవు. అచట 'వాచ్యాది భేదము'లని దిద్ది, ఆదిపదముచే లక్ష్యాదులను గ్రహించినచోఁ గొంతలోఁ గొంతయైన మేలు.

7. ఇందు 'శక్తిగ్రాహకములు' అను శీర్షక క్రింద

సీ. విపరీత సంయోగంబు విప్రయోగంబును
సామర్థ్యమును సాహచర్యకంబు,
నర్థవిరోధలింగౌచిత్యచేష్టలు
పరశబ్ద సన్నిధి ప్రకరణములు,
దేశకాల క్రమాదికములు శబ్దార్థ
కవితానవచ్ఛేద కల్పనములు,
స్మృతిహేతుకములు విశేషవాక్యస్వర
వ్యక్తులు నాఁగఁ బర్యాయగతుల,
తే. నలరు నన్నింట నర్థంబు నవగమింపఁ
దగున నేకార్థయుతములై తనరుశబ్ద
సంతతుల కర్థసంధాన చతురులెల్ల;
'...........................'

(మాడా. 4-67) అను పద్యము కలదు.

ఇది మమ్మటుని కావ్యప్రకాశములోని విషయము. అనేకార్థములు గల పదము, సందర్భమునుబట్టి యొకే యర్థమును తెలుపును. రెండవయర్థము వ్యంజనా వ్యాపారమువలననే తెలుపఁబడును. తొలుత ఆశబ్దము ఒక్క యర్థమునే తీసికొనుటకు సంయోగము, విప్రయోగము, సాహచర్యము, విరోధము, అర్థము, ప్రకరణము, లింగము, శబ్దాంతరసన్నిధి, సామర్థ్యము, ఔచిత్యము, దేశము, కాలము, వ్యక్తి, స్వరము, చేష్ట మొదలగునవియే హేతువులు. పయివానివలన శబ్దమున కొక యర్థము నియమితము కాఁగా తక్కిన యర్థము వ్యంగ్యమగును. ఉదా- 'హరి సశంఖచక్రుఁడు.'— హరి యను పదమునకు విష్ణువు, ఇంద్రుఁడు, కోతి, కప్ప, పాము మొదలగు నర్థము లనేకములు కలవు. కాని ఇచట 'శంఖచక్రములతోఁ గూడిన' అను సంయోగ సంబంధ బోధక మగు విశేషణమువలన విష్ణు వేయను నర్థము నిశ్చితమైనది. తక్కిన యర్థములు (విశేషార్థములు) వ్యంజనా వ్యాపారమువలనఁ గలుగుచున్నవి. ఈ యర్థ మనువాదమువలన స్పష్టపడకున్నది.

8. వామనాచార్యుని మతమున కావ్యమునకుఁ బ్రధానములు గుణములు. దాని ననుసరించి '(ప్రాణదశకయుతమగు) రీతి కావ్యమున కాత్మ' యని యతఁడు చెప్పెను. మమ్మటాచార్య, విద్యానాథాదుల మతమున ధ్వని కావ్యమున కాత్మ. అందును రసము మిగుల ముఖ్యము. ఇవి రెండును విరుద్ధము లగు మతములు. పెద్దయ కవి చాల చోట్లయందు మమ్మటాదుల మతము ననుసరించి రసమునకే కావ్యమునఁ బ్రాధాన్యమును తెలిపెను. 'అలంకృతి లక్షణంబు' 'భావ, రస ప్రపంచమునఁ బర్వు' ననియు, 'గావ్యమున వస్తు, రసాలంకార ప్రాధాన్యములు మూఁ' డనియుఁ, దన మతమునఁ గల వ్యంగ్యజీవితత్త్వమును, రసప్రాధాన్యమును అతఁడు వివరించెను. ఇట్లు చెప్పియు వామనమతము ననుసరించి 'రీతి' వివరణ సందర్భమున 'అఖిల కావ్యములకు రీతు లాత్మ యండ్రు; ప్రాణదశకంబు వానికిఁ బ్రాణ మరయ' అని మీఁదఁ జెప్పిన మతమునకు విరుద్ధముగఁ జెప్పెను.

9. పెద్దయ యొనర్చిన గుణ స్వరూప నిరూపణము దండికావ్యాదర్శము ననుసరించుచున్నది. 'అల్పప్రాణవర్ణము లెక్కువగ నుండునది

---

1. ఆ. ముఖ్యలక్ష్యగౌణములును వ్యంగ్యంబు నా నర్థవర్తనంబు లయ్యె నాల్గు,
వానివలనఁ గల్గు వాచ్యభేదంబుల నరసి తెలియవలయు నండ్రు బుధులు. (పుట 54)

శిథిలము; ఆ శైథిల్యము లేనిదే శ్లిష్టము. శైథిల్యమునకు 'మాలతీమాలా లోలాలికలిల' అని యుదాహృతి; శ్లేషమునకు 'మాలతీదామ భ్రమరై లంఘితము' అని యుదాహరణము అని [1] మూలమునందలి శ్లేషగుణ వివరణము. పెద్దిరాజు పయిమూల లక్షణమును వివరించుచు నేలుకలిగ లక్షణమును

'క. అశిథిలపదబంధురమై
విశదాల్పప్రాణవర్ణ విస్పష్టంబై
విశదగతి నొప్పు శ్లేషము
విశేషకావ్యములకెల్ల విభవప్రదమై'

అని వ్రాసెను. అందలి శ్లేషగుణ వివరణమిట్లున్నది.

శైథిల్యములేనిది శ్లిష్టము; ఇంక అల్పప్రాణాక్షరములు చాల తక్కువగ నుండును. ఉదాహృతి.

"మాలతీదామ భ్రమరై లంఘితము."

అల్పప్రాణాక్షరములు ఎక్కువగ నున్నది శిథిలము-ఉ. మాలతీమాల లోలాలికలిల- ఇది శ్లేషకు విరుద్ధమైనది.

పయి శ్లిష్టమును అనువదించుచు పెద్దయ ఈ క్రిందికలిగ వ్రాసియున్నాడు.

'క. అశిథిలపద........'

శైథిల్యము లేక అల్పప్రాణవర్ణము తక్కువగఁ గలది శ్లేషమని ఇతని నిరూపణము. అల్పప్రాణాక్షరములు గలది శ్లేషయగుట పొసగదు.

'శిథిలపదములు లేక విశదముగ అల్పప్రాణవర్ణములు కలది శ్లేషమని' దాని యభిప్రాయము. ఇది మూలవిరుద్ధము. అల్పప్రాణవర్ణములు కలది శిథిల మగును; అశిథిలము కాఁజాలదు.

10. మమ్మట, విశ్వనాథుల మతమున రసము ప్రధాన మగుచో నుత్తమ మగు ధ్వనికావ్యమగును; రస మప్రధాన మయినచో రసవదలంకార మగును. దండికాలము నాఁటికి ధ్వనివాదము లేదు. అతని మతమున నలంకారములే ప్రధానములు; కావున అతడు (ప్రధానము కానిండు అప్రధానము కానిండు) రసమున్నంత మాత్రమున 'రసవదలంకార మగు' నని 'రసవద్రసపేశలమ్' అని సూత్రించియున్నాఁడు. పెద్దయ మతమునను మమ్మటాదులబోలె ధ్వని, రసము ప్రధానములు; 'రస మప్రధాన మగునపుడే' రసవదలంకారము; రస మప్రధాన మగునపుడు వేఱొకదాని నది అలంకరింపఁజేయును కాన అలంకార మగుచున్నది. రసము ప్రధానమైనచో అలంకార్యము అలంకారము కాదు. చూడామణికారుఁడు తాను తొలుతఁ జెప్పిన యంశమును విచారింపక దండినే అనుసరించి 'రసము సొగసుగ వర్ణింపఁబడిన రసవదలంకార' మని చెప్పియున్నాఁడు.[2]

11. దోషనిరూపణము ప్రతాపరుద్రీయము ననుసరించుచున్నది. కాని యది అనువాదపద్ధతినే యున్నది. ఆ యనువాదము లయినను కొన్ని కుదరకున్నవి. అట్టి వానిలో 'అవిమృష్టవిధేయాంశ' మొకటి. ఉద్దేశమును ప్రధానముగఁ జేసి విధేయమును అప్రధానముగఁ జేయుట దాని లక్షణము. ఈ దోషమునకుఁ దృష్టముగ కాళిదాసుని కుమారసంభవములోని పార్వతీవర్ణన ఘట్టమునందలి 'ద్వితీయమౌర్వీమివ కార్ముకస్య' అను అపపాఠము నుదాహరించుట, పిదప 'మౌర్వీం ద్వితీయామివ కార్ముకస్య' అను సరియగు పాఠమును గ్రహించి ఆ దోషమును పోఁగ్రోలుటయుఁ గలదు. 'పార్వతీదేవి మొలనూలు మన్మథుని వింటి రెండవనారి వలెనున్న' దనుట యీ వర్ణనములోని ప్రధానాంశము. ఇచట 'రెండవ నారివలె' నున్నదని ప్రస్తుతము; కేవలము పార్వతి మొలనూలు వింటి నారివలె నున్నదని యనుటయే దీని యభిప్రాయము కాదు. 'ద్వితీయ మౌర్వీ' పదమున ప్రధాన మణఁగినది. ఉద్దేశమగు 'మౌర్వీ'పదము విధేయమైనది. (ఇట మౌర్వి నుద్దేశించి ద్వితీయత్వము విధేయ మగుటయే యుచితము.) 'మౌర్వీం ద్వితీయాం' అను సాధుపాఠమున 'ద్వితీయా' పదము ప్రధాన మగును.

1. శ్లిష్ట మస్పృష్టశైథిల్య; మల్పప్రాణాక్షరోత్తరమ్,
శిథిలం; మాలతీమాలా లోలాలికలిలా యథా.
అనుప్రాసధియా గౌడై ర్నాతి రూఢ మపేష్యతే,
వైదర్భై ర్మాలతీదామ లంఘితం భ్రమరై రితి. (కా. 1-ఉ.)

2. క. అసితం గుగుణాన్నాది ప్రసరణమాలఁ దేజరిల్లి ప్రభవమగసొగుల్
పొసఁగఁబడు నెచట నదియో రసవదలంకార మనఁగ రసికుల కెక్కున్. (పుట 66,7)

## అనంతామాత్యుఁడు

కావ్యాలంకారచూడామణికి తరువాతి యలంకారగ్రంథము రసాభరణము. ప్రత్యేకముగ అలంకారశాస్త్ర విషయములనే చెప్పు గ్రంథములలో ఇదియే మొదటిది. అనంతామాత్యుఁడు దీనికి కర్త.

రసాభరణపు ఆశ్వాసాంతగద్యలయందు 'ఇది శ్రీవాణీ వరప్రసాదలబ్ధ వాగ్వైభవ, తిక్కనామాత్యసంభవ, సుకవిజనవిధేయానంతనామధేయప్రణీతం బైన—' అని చెప్పఁబడియున్నది. దీనింబట్టి యనంతుని తండ్రి తిక్కన యని తెలియును. ఈ తిక్కన కవిత్రయములోని తిక్కయజ్వమాత్రము కాఁడు. ఈ యంశము అనంతుని భోజరాజీయములోని

"చ. క్షితిఁ గృతికర్త తా మహిమఁ
జేకొని పంచమవేద మైన భా
రతముఁ దెనుంగుబాస నఖి
లామముగా రచియించినట్టి యా
న్నతచరితుండు తిక్కకవి
నాయకుఁ డాదట మెచ్చి 'భవ్యభా
రతి' యనఁ బేరు గన్నకవి
రత్నము బయ్యనమంత్రి యల్పుఁడే?"

అను పద్యమువలనే తెలియుచున్నది.

తన మాతామహుఁడగు బయ్యనకు తిక్కయజ్వ 'భవ్యభారతి' యను బిరుదము నొసఁగినాఁడని అనంతుఁడే ఇందు చెప్పికొనెను. అనంతునిది పండిత వంశమగుటచే ఈతని తండ్రి తిక్కన కవియును, పండితుఁడును నయి యుండవచ్చును. వీరు నాయుడువేల నియోగిబ్రాహ్మణులు; కౌండిన్య గోత్రులు.

భోజరాజీయమునందలి

సీ. విలసితంబగు కృష్ణవేణి, మలాపహా
రిణి భీమనది నా ధరిత్రియందుఁ
దనరు నదీత్రయాంతర్వేది యగుపావ
నక్షేత్రమున శోభనముల కెల్ల
దర నివాసం బగు పెరుచుగూరిపురంబు
నందు విద్వజ్జనానంద మైన
జీవస్థితిచేతఁ జెన్నొంది వంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వ మొంది
గీ. నెమ్మిఁ బ్రాహ్మణకులపరమపద మ్మనంగ,
నొప్పు శ్రీకౌశికంబున కొడయఁ డైన
యంధ్రవల్లభహరిసేవ నలరుచుండు
బెక్కుభంగుల మమ్మడి తిక్కవిభుఁడు.'

అను పద్యమునుబట్టి 'ఈ కవియొక్క తండ్రి కృష్ణవేణి, భీమరథి, మలాపహ యనఁబడునదులు కలసిన యంతర్వేదిలో నుండె నని-అట్టి స్థల మాతని స్వస్థానమని తెలియుచున్నది.' కృష్ణవేణి యన కృష్ణానది; భీమరథియే భీమనది; మలాపహాయే మలప్రభానది. 'కృష్ణానదియు, మలప్రభానదియు, నైజాము రాజ్యమునకు దక్షిణపు సరిహద్దునొద్ద బొంబాయి రాజధానిలోఁ గలసినవి. ఇది యిప్పుడు కన్నడదేశము. కృష్ణయు, భీమయు నైజాము రాష్ట్రమునందు రాయచూర్ పట్టణమునకుఁ బశ్చిమమునఁ బదాఱు మైళ్ల మీఁదఁ గలసినవి. ఇది తెలుఁగుదేశ మని చెప్పవచ్చును. కావున నీ కవి నివాసస్థానము నైజాము రాజ్యమునం దుండెనని మన మూహింపవచ్చును. ఆంధ్రవిష్ణువు వీరికిఁ గులదైవము కావచ్చును.'

'ఆంధ్రవల్లభహరిసేవ నలరుచుండు' ననఁగా నీతఁ డాంధ్రరాయనియొద్ద నుద్యోగిగా నుండెనని కొందఱూహము చేసికొనిరి. కాని యది పొరపాటు. 'ఆంధ్రవల్లభహరి' యనఁగా నాంధ్రవిష్ణువు; శ్రీకాకుళములోని దేవుఁడు. అతని సేవ చేయుట యనఁగా నతనిని భక్తితో భజించుట. ఏ గ్రామమున నే దేవుఁ డుండునో ఆ దేవుని తద్గ్రామాధిపతిగాఁ జెప్పుట భక్తుల యాచారముగా నున్నది. ఇట్లే 'ఈ కవియొక్క' రసాభరణము నందలి 'శ్రీనింబసీ ధ్రువపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్' అన్న చోటఁ జూచి కొందఱీ గ్రంథమును ధ్రువపట్టణపురాజున కిచ్చె నని భ్రమపడుచున్నారు. అచ్చటను ధ్రువపట్టణాధిపుఁ డనఁగా ధ్రువపట్టణపు దేవుఁడని యర్థము. ఈ కవి తన గ్రంథ మేదియు నరాంకితము చేయలేదు.'

పై యుద్ధృతభాగములు ఆంధ్రవిజ్ఞానసర్వస్వములోనివి. అనంతామాత్యుఁడు చెప్పిన 'ధ్రువపురి ప్రస్తుతము గుంటూరుమండలమునఁ గృష్ణానదీప్రాంతమునఁ గల ధూళిపూడియను గ్రామమే యని యూహ పొడముచున్న దని రసాభరణ పీఠికలో విద్వాన్ శ్రీ కోపల్లె శివకామేశ్వరరావుగారు తెలిపియున్నారు. కాని యీ స్థాపించుట కింకను తగిన ప్రమాణము లపేక్షితములు. అనంతుఁడు రసాభరణమును శాలివాహనశకము 1856 వ, ఆనందనామ సం.

మాఘకృష్ణైకాదశీ భానువారమున ధ్రువ పట్టణాధిపున కంకిత మొనరించినట్లు చెప్పి యున్నాఁడు. అయ్యది క్రీ. శ. 1435 సం. జనవరి 25 వ తేదీకి సరిపడుచున్నది. కావున నీతఁడు 15 వ శతాబ్దపు ప్రథమార్ధమున నుండె నని చెప్పవచ్చును.

అనంతుఁడు భోజరాజీయము, ఛందోదర్పణము, రసాభరణము నను మూఁడుగ్రంథములను రచించెను. ఛందోదర్పణమునందలి

3. 'శా. జానొందన్ శకవర్షముల్ బుతు,
శర, జ్యాలేందులై యొప్ప, న
య్యానందాబ్దమునందు మాఘమునఁ
గృష్ణైకాదశీభానుయు
క్తానామామృతవేళ నీకృతి యనం
తాఖ్యుండు సమ్యగ్రస
శ్రీ నిండన్ ధ్రువపట్టణాధిపున కిచ్చెన్
భక్తిపూర్వంబుగన్. [పు-42.]

ఉ. శ్రీనిధిచక్రవర్తి గురుశేఖర
పుణ్యకటాక్షలబ్ధసు
జ్ఞానుఁ డనంతధీమణి లసన్మణి
భోజచరిత్రఁ జెప్పె ల
క్ష్మీనరసింహుఁ గూర్చిన ప్రసిద్ధుఁడు
వేడుకతో నొనర్చె ఛం
దోనుతి యోగివృత్తిమల [4-130.]
తోయజవర్తి కనంతమూర్తికిన్.

అను పద్యములనుబట్టి భోజరాజీయము మతని తొలిగ్రంథ మనియు, ఛందోదర్పణము రెండవ గ్రంథ మనియు, రసాభరణము చివరిగ్రంథ మనియు తెలియుచున్నది.

## భోజరాజీయము

ఇది యేడాశ్వాసముల చక్కని ప్రబంధము. ఇది అహోబల నృసింహస్వామి కంకితము. ఇందు భోజరాజును గుఱించిన వింతకథలు చాల కలవు. కవిత్రయము వారి ప్రయోగములకంటె భిన్నము లగుప్రయోగము లిందుఁ గానవచ్చుచున్నవి. తిక్కనమహాకవి ననుకరించుట అనంతుని కిష్ట మని గ్రంథమునుబట్టి తోఁచుచున్నది.

## ఛందోదర్పణము

అనంతుని ఛందస్సు అనుపేర నిది లోకమునఁ బ్రసిద్ధము. ఇందు ఛందోలక్షణములు వివరింపఁబడినవి. వానితోఁబాటు అలంకార లక్షణమునకుఁ జెందిన దోషవివేచనము నిందుఁ గలదు. దీనింగూర్చి 'మిశ్రమలక్షణ గ్రంథము'లలో చర్చింపఁబడును.

## రసాభరణము

రసాభరణము నందలి '......... అనంత నామధేయ ప్రణీతంబైన రసాలంకారంబు నందు......' అను ప్రథమాశ్వాసాంత గద్య భాగమునుబట్టి దీనికి 'రసాలంకార' మనునామాంతర మున్నదని తోఁచుచున్నది. లేదా-'ఆభరణ' 'అలంకారము'లకు అభేదమునైనఁ జెప్పవలెను. సంస్కృతమున నాయా వ్యాఖ్యలయందుఁ జేర్కొనఁబడు 'రసార్ణవాలంకారము'న కిది యనువాదమేమో యని, అందుచే నిది రసాలంకారమైయే యుండు నని రసాభరణ పీఠికాకర్తల తలఁపు. అది సరికాదు. ప్రస్తుత గ్రంథమునుబట్టి చూచిన ఇది చాల గ్రంథములను పరిశీలించి రచింపఁబడినట్లు తెలియును, గాని యేదో యొక గ్రంథమున కనువాదమట్లు తోఁచదు. మఱియు సంస్కృతమున 'రసార్ణవాలంకారము' (ప్రకాశవర్షవిరచితము) అను సమగ్రాలంకార విషయ ప్రతిపాదకమగు గ్రంథము కలదు. దానిని శ్రీ ఈయుణ్ణి-వేంకట వీరరాఘవాచార్యులుగారు (ఎం. ఏ.) పరిష్కరించిరి. ఈ గ్రంథమును ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించియున్నారు. కానియా గ్రంథమునకును రసాభరణమునకును సంబంధము లేదు.

రసాభరణమునకు రసార్ణవమను పేరున్నట్లు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమునుబట్టి తెలియుచున్నది. 'ఛందోదర్పణ' పీఠికయందును అట్లే కలదు. కాని ముద్రిత 'రసాభరణ' ప్రతియందీ చర్చ లేదు.

రసాభరణము శృంగారరసమును, తత్సామగ్రిని సంపూర్ణముగ నిరూపించు గ్రంథము. ఇది నాలుగాశ్వాసముల పరిమితి కలది. ప్రథమాశ్వాసమున స్థాయిభావముల లక్ష్యలక్షణములును, విభావానుభావసాత్త్వికభావ లక్షణములును, శృంగారాది నవరసముల కుదాహరణములు నీయఁబడినవి. ద్వితీయాశ్వాసమున ఆలంబనోద్దీపన విభావలక్షణములును, సాత్త్విక, సంచారి భావలక్షణోదాహరణములును వివరింపఁబడినవి. మఱియు నిందు భావహావాదులగు శృంగారచేష్టలుద్దీపనాంతర్గతము లని వివరింపఁబడి లక్ష్య, లక్షణము లొసఁగఁబడినవి. తృతీయాశ్వాసమున సంభోగ, విప్రలంభ శృంగారములును, చతుః

ప్రీత్యాది ద్వాదశ శృంగారావస్థలును, నాట్యశాస్త్రప్రోక్తములగు వాగ్విలసన, నైపథ్యాంగక్రియా, సంకీర్ణ, మిశ్రము లనఁబడు పంచవిధ సంభోగ శృంగారభేదములును వివరింపఁబడినవి. పిదప భావోదయాదులును, రససాంకర్యములును చెప్పఁబడినవి. చతుర్థాశ్వాసమున నాయికానాయకుల లక్షణోదాహరణములు విపులముగఁ జెప్పఁబడియున్నవి.

ఈ గ్రంథము ప్రత్యేకముగ ఒక గ్రంథమున కనువాదము కాదు. ప్రసిద్ధ సంస్కృతాలంకార గ్రంథములందలి విషయము చర్చించిడిచి సంగ్రహముగ నిందీయఁబడినది. దీని పీఠికలో శ్రీ కోపల్లె శివకామేశ్వరరావుగారు '— రసాభరణమును జెనుఁగున వ్రాసిన యనంతామాత్యుఁడు విశ్వనాథుని దర్పణమును, మమ్మటుని కావ్యప్రకాశమునుగూడ మేలవించి, యెందేవిషయము ప్రశస్తమైనదో దాని నెల్ల గ్రహించినాఁ డనవచ్చు'నని వ్రాసిరి. కాని విషయ నిరూపణమునుబట్టి యిది చాలవఱకు విద్యానాథుని ప్రతాపరుద్రీయమునే యనుకరించుచున్నది. దర్పణాదుల ననుసరించుచున్నట్లు తోఁచదు. ప్రతాపరుద్రీయానుక్త విషయమున గ్రంథాంతరసాహాయ్య మపేక్షింపఁబడవచ్చును. మచ్చునకుఁ గొంత

౧. రసాభరణములోని మొదటిశ్లోకము- 'శృంగారహాస్యకరుణాః' - అనునది ప్రతాపరుద్రీయమున అట్లే యున్నది. మమ్మట, విశ్వనాథులు తొలుత ఎనిమిది రసములను చెప్పి తిరిగి శాంతమును ఒప్పికొనిరి. ఆరీతి యిందు లేదు.

౨. రసాభరణమునందలి

ఉ. 'ఆపట వర్ధమానవిభ
వాతిశయంబున వారిపుల్లు ర
త్యాదులు వీచుల ట్లుదయ
మొందుచుఁ జెంద భావపంక్తి ని
ర్వేదముఖోపభోగరుచి
వృద్ధి రసం బది నాట్యసంగతిన్
మోద మొలర్ప సభ్యుల మ
నోగతులం దగుకార్యమై చనున్.'

[పుట 4]

అనుపద్యము ప్రతాపరుద్రీయమునందలి

శ్లో. 'భావే స్థాయిని వర్ధమానవిభవే
రత్యాదికే సింధువత్
కల్లోలా ఇవ సంభవన్తి విలయ
న్త్యాయాన్తి భావా ముహుః,
నిర్వేదాద్యుపభోగభావితనిజా
స్వాదాతిరేకో రసో
లోకే స్యా దనుకార్య ఏవ కథితో
నాట్యే తు సామాజికే.'

[రసప్రకరణమ్.]

అనుశ్లోకమునకు అనువాద మనుట నిర్వివాదము. అట్లయ్యును ఈ యనువాదము మూలాభిప్రాయమును సరిగా తెలుపకున్నది.

3. రసాభరణమునందలి

'సీ. రసము నాయకసమాశ్రయమునఁ బ్రాపింపఁ
డగునట్టి చేష్టలనైనఁ దత్క
థాకర్ణనంబునసైన సామాజిక
ప్రకరానుభావ్యమై పరఁగుచుండుఁ,
బరగతం బయ్యు సద్భావనచే రసో
దయవిశేషము విరుద్ధంబు కాదు,
మఱియు మాలత్యాది మహిళాప్రసంగంబు
వినుచు సభ్యులు నిజవనితలందుఁ
దలఁపు నిలుప రసాశ్రయత్వంబు గలుఁగు;
నటుకరణమాత్రమై యుండు నాశ్రయంబు
గాదు, భావుకత్వాదులు గలిగెనేని
వాఁడు సామాజికుల యట్టివాఁడ యపుడు.

క. 'ప్రకటనటుఁ డగయ సామా
జికసముఁ డగు నేని వానిచే ననుభావా
దిక మెల్లొదవు ననిన వా
నికి నిది యభ్యాసజనితనిపుణత యయ్యెన్.'

[పుటలు 6-7]

అనుపద్యములు ప్రతాపరుద్రీయమందలి

'అత్ర రసో నాయకాశ్రయ ఏవ. యదిపరం నిపుణనట చేష్టయా, తథావిధ కావ్యశ్రవణబలేన చ సామాజికైః స్వాత్మా ద్భావ్యతే, తదా పరగతస్యాపి రసస్య సమ్యగ్భావనయా పరత్ర నిరతిశయానందజనన మవిరుద్ధమ్. అథవా మాలత్యాదిశబ్దేభ్యో యోషిన్మాత్రప్రతీతా, రావణాదిశబ్దేభ్య శ్శత్రుమాత్రప్రతీతౌ చ స్మృత్యారూఢేన తత్తద్యోషిద్విశేషేణానుకార్యేణ సామాజికాశ్రయత్వమపి న విరుద్ధమ్. నటస్యానుకరణమాత్ర పరతయా నైవ రసాశ్రయయోగ్యతా, తస్య భావుకత్వాభ్యుపగమేఽపి సామాజికత్వ మేవ, అనుభావాదీనాం ప్రకాశనం తు శిక్షాభ్యాసపాటవే నైవ ఘటతే.'

అను వచనభావమున కాంధ్రీకృతి యనుట స్పష్టము. ఈ యభిప్రాయము మీది యనువాదమున వ్యక్తముకాదు. అనంతుని రసాభాస విభాగము ప్రతాపరుద్రీయమునకే సరిపడియున్నది. ఆలంబనోద్దీపన విభావముల యొక్కయు, స్వాధీన పతికాద్యష్టవిధ శృంగార నాయికల యొక్కయు లక్షణోదాహరణములును దాని ప్రతాపరుద్రీయాను కరణత్వమునే తెలియఁ జేయుచున్నవి.

అనంతుఁడు సరసకవి. పండితుఁడు. ఇతఁ డొసఁగిన లక్షణములు, వాని యుదాహరణములు చాల పొందిక కలిగియున్నవి; కాని. శాస్త్రగ్రంథానువాదమున సహజములగులోపము లిందును కొలఁదిగఁ గలవు.

తొలుత రత్యాదిస్థాయిభావములకును మరల శృంగారాది రసములకును ఉదాహరణములు ఇందు కలవు. అవి పునరుక్తములు. రత్యాది భావములే విభావాది సహాయమున రసములగుచున్నవికదా!

విప్రలంభ శృంగారభేదములలో మానము, ఈర్ష్య వేఱువేఱుగఁ జెప్పఁబడియున్నవి. ఈర్ష్యమానమునందలి భేదమేకాని వేఱుకాదు.

ఇందుఁ బ్రగల్భయు, ప్రౌఢయు వేర్వేఱు నాయికలుగ చెప్పబడిరి. వారిరువురు నభిన్నలు.

స్వాధీనపతికాది శృంగారనాయికల కింద రెండుసారు లుదాహరణ లొసఁగుట పునరుక్తము.

చాలకాలమునవఱకు మూలఁబడియుండిన రసాభరణమును ఆంధ్రసాహిత్య పరిషత్తువారు తమ పత్రికలోను,౧౯౩౧. సం. న తిరిగి గ్రంథ రూపముగను ప్రకటించిరి. వారు తమయొద్దనున్న ప్రతిని చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని ప్రతులతో సరిపోల్చి చూచి, వీలగునంత సంస్కరించి ప్రకటించిరి. అన్ని ప్రతులందును తొలుత కృత్యాదిపద్యములు లేవు. తొలుత కొంత గ్రంథము లోపించినదని పరిషత్తువా రభిప్రాయపడుచున్నారు. అన్ని ప్రతులందును కృత్యాదిపద్యములు లేవఁట! ముద్రిత గ్రంథమునందు గొన్నియెడల సందేహములు, కొన్ని లేఖక ప్రమాదములు నున్నవని పరిషత్తువారు తెలిపినారు. ప్రమాదములను, పాఠభేదములు బాగోగులను కొన్నిటిని టీకాకారులు వివరించినారు. యింకను కొన్ని కలవు. వానిలోఁ గొన్ని ఉల్లేఖింపఁబడుచున్నవి.

పుట ౪. పంక్తి ౧౭ లో '—దగు కార్యమై చనున్' అనుచో 'అను కార్యమై చనున్' అని యుండుటయే కవిహృదయమై యుండును. మూలమున అట్లే కలదు.

పుట. ౧౦. ౭ వ బంతికిఁ బిదప 'ధైర్యమున కుదాహరణము—' అనియు, ౧౯ వ బంతి తరువాత 'విచ్ఛిత్తి కుదాహరణము—'అనియు నుండవలెను.

పుట. ౧౩. బంతి. ౧౬. 'అపగతంబగు—' నకు బదులు 'పరగతంబగు—'అని యుండవలెను.

---

## మిరియాల వేంకటపతి.

మ. క్రమ మొప్పన్ మిరియాల వేంకటపతీంద్రా! నీదుఖడ్గంబు పే<br>
రిమిఁ బైఁబడ్డ విరోధిగాత్ర మహనిన్ రెండయ్యె మార్తాండబిం<br>
బము రెండయ్యెఁ బరాలసన్ ద్రిదివి రంభాకంచుకగ్రంథిబం<br>
ధము రెండయ్యె జనానులాపమునకుం దప్పేమి ప్రేటాడినన్.

## కోమటి గుర్వయ.

క. రండలకొడుకులు యాచక<br>
తండంబుల కేమి త్రవ్వి తల కెత్తేరా?<br>
రెండాకు లొక్కపోకయుఁ<br>
గొండ సుమీ దానశర్వ! కోమటిగుర్వా!

# కాళిదాసునినాటి రాజధర్మాలు

శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు

## ౧

ఏ పుంభావభారతి తన కవితా ప్రవాహముచే నార్యావర్తమునే కాక యితర దేశములనుగూడ రసమయ సాగరమున నోలలాడించెనో, ఏ కవికుల గురువు వాల్మీకి తరువాత సంతతి వాడనిపించుకొని సంస్కృత భాషా గగనాంగణమున నద్వితీయజ్యోతులతో వెలుంగు కవిరాజ పదమున ధిష్ఠించెనో యట్టి కాళిదాసుని కవితా విశేషములను ప్రాచ్య పాశ్చాత్య పండితు లనేకులనేక విధములుగ నుగ్గడించి పొగిడియున్నారు. కాళిదాసుడు సంస్కృత వాఙ్మయమున నపూర్వనిధాత. ధాతృసృష్టి రహస్యము తెలిసికొనుట యెంతటి వైజ్ఞానికులకైన నెట్లలవికాదో, యట్లే యీ కవిచతురానను సృష్టి రహస్యములుగూడ నిరవశేషముగ తెలియుట కెవరికిని దరముగాదు. అయినను ఎవరి యధికారమునకు దగినట్లు వారాతని కవితలోని విశేషములను గ్రహించుచును, లోకులకుఁ బ్రకటించుచును నున్నారు కదా! నేనుగూడ వారి వర్గమునే యనుసరించి నా యల్పబుద్ధి కద్భుతము లనిపించిన కొన్ని విషయము లీ సారిది సుదాహరింతును.

కాళిదాసుడు (వేఱువేఱు విమర్శకుల యూహములను బట్టి) భోజుని యాస్థానము వాఁడో, విక్రమాదిత్యుని సభాస్తారుడో, చంద్రగుప్తుని సదస్యుడో యే కాలమువాడో కానిండు కాకపోనిండు. దానివలన నాతని కవితకు లాభనష్టము లించుకంతలును లేవు గదా, యాతని కవితవలననే యా రాజన్యుల యైహికాముష్మికములు సిద్ధించిన వనుట సుప్రసిద్ధము. మాళవికాగ్నిమిత్ర నాటకము రచించి పుష్యమిత్రుని అశ్వమేధయాగ కర్తృత్వము, అగ్నిమిత్రుని ధీరలలితత్వము మన కక్షిగోచరము గావించినాడు. రఘువంశమున నిందుమతీ స్వయంవరావసరమున ననేకరాజుల రాజ్యముల పరిస్థితులు విశద మొనరించినాడు. రఘువంశము నాల్గవసర్గమున రఘుని దిగ్విజయ వ్యాజమున ననేకదేశముల నైసర్గిక రూపములు నాయాజనుల ఆచార వ్యవహారములు స్పష్టపఱచినాడు. వేయేల తన కావ్యముల వలన కావ్యప్రయోజనములు పూర్తిగా నెఱవేర్చినాడు. తన కాలపు రాజకీయ సాంఘిక పరిస్థితులను కరతలామలకము గావించినాడు. ఏ శ్లోక మేకృతిలోనిది విమర్శించినను దానియందేదో యొక వింత యుండకతప్పదు.

అతఁ డేరాజు నాస్థానియందున్నవాడైనను నారాజున కుపదేశముగానో, యా రాజుల ప్రవర్తనముల ననువాదముగానో తన గ్రంథమున రాజధర్మము లనేకములు పొందుపఱచినాడు. రఘువంశ ప్రథమసర్గమున “సోహమాజన్మశుద్ధానామ్” అను శ్లోకము మొదలు “శైశవేఽభ్యస్త విద్యానామ్” అను నెనిమిదవ శ్లోకమువఱకు నాలుగు శ్లోకములలో రఘువుల ప్రాభవము వర్ణించినాఁడు. “రఘుకుల రాజులు పుట్టువు మొదలుగ పవిత్రులుగా నుందురు. ఏకార్యమైనను ఫలసిద్ధి కలుగువఱకు నాచరింతురు. గృహ్యశ్రౌత సూత్రముల ననుసరించి యాగాదికర్మము లాచరింతురు. యాచకులకు కోరికకు మీఱ నిత్తురు. అపరాధమున కన్యూనాతిరిక్తముగ దండము విధింతురు. ప్రమాదాలస్యములులేక సరియగు కాలమున మేల్కాంతురు. వారు దీనుల కిచ్చుటకొఱకే ధనము ప్రోవుచేయుదురు కాని, తమ భోగములకుగాదు. అసత్యోక్తి ప్రమాదమునకైన నాల్కకు రాగూడదను నభినివేశమున మితముగా సంభాషింతురు. కీర్తి నార్జించుటకే దేశముల జయింతురు గాని, యా విజితుల సర్వస్వము హరించుటకు గాని, వారియందుండెడి ద్వేషముచేఁ గాని కాదు. జితోఽస్మియన్న వాని నాత్మీయమే మరల వాని సింహాసనమున నెలకొల్పుటే వారి యాచారము. ధర్మప్రజా సంపత్తి కొఱకే వివాహముకాని, కామోపభోగములకు గాదు. వారు శైశవమున యథావిధిగ విద్యలు గఱచెదరు. యౌవనమున నిష్టోపభోగము లనుభవింతురు.

వార్ధకమున కుమారుని రాజ్యభారము పూన్చి, తామడవికేగి, మౌనులై కాలము గడుపుదురు. చివరకు జీవితమందు విసుగు జనించినపుడు యోగముచే ప్రాణము నూర్ధ్వగామిగా నొనర్చి, పాము కుబుసము నూడ్చినట్లే శరీరము విడచి సద్గతి నందుదురు.'' ఇవి రఘురాజు లందఱియెడను సాధారణముగా నగపడు రాజధర్మములు. వీనిలో ఆజన్మశుద్ధులనగా నిషేకాదిద్విజాతి విహిత సర్వసంస్కారములు దప్పక సకాలమందు తామాచరించుచు, నితరులను వర్ణధర్మములుల్లంఘింపనీకుండురను భావము వ్యక్తపడును. ''బ్రాహ్మేముహూర్తే ఉత్థాయ ధర్మార్థౌ చానుచింతయేత్'' అను విధి ననుసరించి నిత్యము వేగుటకు మున్నే నిద్రలేచి, స్వస్థచిత్తమున నాడొనరింపదగు ధార్మికార్థిక విషయములను విమర్శించికొని, నిశ్చయించు కొనవలయుననుట విదితము. వర్ణధర్మములు నాశ్రమ ధర్మములను దప్పక వారు పాలింతురు. ఈ ధర్మములన్నియు ధర్మశాస్త్రము లందును, నీతిశాస్త్రము లందును విధింపబడినవే యైనను, కవి తన ముఖమున వానిని నవనవోన్మేషము నందించినాడు. బహుశః ఆతని కాలమున రాజు లీరీతిని తమ నడవడి సాగించిరేమో ? లేక వారి కాతడిట్లు ప్రవర్తింపుడని యుపదేశించినాఁడో ?

దిలీపుని వర్ణనమును గమనింపుడు. రాజు పుట్టుకతో బుట్టవలసినదే కాని నడుమ రాజుగా నేరఁడట. దిలీపుడు మంచి వెడఁదయు, గఠినమునగు ఱొమ్ముగలవాడు. ఎద్దుమూపువలె (గెంటెము) దృఢతరమైన మూపుగలవాడు. మద్దిచెట్టువలె నెత్తగువాడు. ఆజానులంబి బాహువులు గలవాడు. కనుకనే తన కార్యములు నెరవేర్చుట కనువగు శరీరముదాల్చిన రాజధర్మమువలె నున్నవాడు. దుష్టసత్వముల నాఖేటకమున నురుమాడి యారణ్యకుల గాపాడుటకును, శాత్రవుల బరిమార్చి ప్రజల రక్షించుటకును నిట్టి గట్టిమేను లేకున్నఁ బని సాగదు కదా ! కనుక వ్యాయామ మనవరతముగ నొనరించి శరీరము ద్రఢిష్ఠము గావించి కొనుట రాజునకు బ్రథమ కర్తవ్యము. తెలుగు ఱేడగు శ్రీకృష్ణదేవరాయలు నిత్యము శరీరమునకు దైలమర్దనము గావించికొని, యా యా మల్ల విద్యాసాధనముల బరిశ్రమ మొనరించి, మిక్కిలి బరువుతోనింపిన రెండు గోనెసంచులను రెండు చంకల నిఱియబట్టుకొని, కోటగోడపైని నుమ్మారుచుట్టి పరువెత్తి వచ్చువాడట. కనుకనే యాతడద్వితీయ పరాక్రమశాలియై యనంత సామ్రాజ్యము నేలింప జాలినవాఁడు. రాజు బుద్ధిని బలమునను ధనమునను సర్వాతిశాయియై, సర్వతేజముల నధఃకరించు తేజము గలవాడై, సర్వోన్నతినంది, మేరునగమువలె భూమి నాక్రమించి యుండవలయునట. అట్లున్ననాడే యాతని రాచసిరి యపాయరహితముగా నుండును. రాజాకారముచే నుత్తముడుగానున్నంతమాత్ర చాలదు. ఆ యాకారమునకు దగుప్రజ్ఞ, ఆ ప్రజ్ఞకుదగిన శాస్త్రపరిజ్ఞానము, దానికిదగినంతగా కార్యాచరణము, దానికిదగినంత ఫలప్రాప్తియు గలిగియుండవలెను. ఈ గుణములు దిలీపునందు వర్ణింపబడినను, దనయేలిక నుద్దేశించియే కవియిట్లు రచించెనని యూహింపవచ్చును. దిలీపుడో లేక తన యేలికయో సేవకులకు ప్రీతికరములు, భయంకరములు నగుగుణములచే చెనకరానివాడు, నాశ్రయణీయుడునై, తిమితిమింగిలాది క్రూరజలచరములచే భయంకరము, రత్నములచే నభిగమ్యమునగు సముద్రమువలెనున్నాడట. ఈ విషయమే నాల్గవసర్గమున రఘువర్ణనావసరమున ''నహి సర్వస్యలోకస్య యుక్తదండతయా మనః, అదదే నాతి శీతోష్ణో నభస్వానివ దాక్షిణః'' (అతడు వెచ్చన, చల్లనగాని మలయపవనమువలె మృదులము కఠినము గాని, అపరాధమునకను రూపమగు దండము విధించువాడగుట ప్రజలకు బాధకలిగింపక ననురాగ పాత్రుడయ్యెను.) అని వర్ణించెను. నిదాఘమున గాడ్పులు మిక్కిలి యుష్ణములయ్యును, వర్షాది ఋతువులందు అతిశీతలము లయ్యును ప్రజలకు దుస్సహములైయుండును. కాని ఫాల్గునాంతమునను, చైత్రమునను వీచు పిల్లతెమ్మెర ఉల్లాసకారణములుకదా ! అట్లే రఘువుగూడ ప్రజలను రంజింపఁ జేసెనట. ఇదియు రాజునకు నావశ్యకమగు నుత్తమధర్మము. దిలీపుడు ప్రజలను మంచి కట్టుబాటులతో బాలించుటచే వారి ప్రజలు మనువునాటనుండియు నలఁగిన సాంఘిక మర్యాదలను లేశమైన మీఱలేదఁట ! ''యేనమే పితరో యాతాః, యేనయాతాః పితామహాః'' అను నార్యోక్తి ననుసరించి యారాజు ఇంచుకేనియు ధర్మాతిక్రమము

గావించువాఁడుగాఁడు. మఱియు నాతఁడు ప్రజలవలన పన్నులు గైకొనుట వారి యుపకారములకేకాని తన భోగములపై వెచ్చించుటకుగాదు సరిగదా, తీసికొన్న పన్నుకంటె నధికద్రవ్యము వెచ్చించి ప్రజలకువలసిన సదుపాయములు చేయుచుండువాఁడు. ఇప్పటి దొరతనమువారును ప్రజలనుండి తీసికొన్న ధనము ప్రజోపయోగములకే వెచ్చించుచుండుట నిజమే. కాని ప్రాచీనపద్ధతికి నిప్పటి పద్ధతికిని భేదము మాత్ర మతిమాత్రము.

దిలీపునకు శాత్రవుల జయించుటకుగాని రాజ్యము క్షేమముగ బాలించుటకుగాని సైన్యము లవసరము లేదు. శాస్త్రములందు నిశితమైన బుద్ధియు, నెక్కిడిన తన ధనువును మాత్రమే యాతని కార్యములు సాధించును. రాజునకు చతురంగబలములు, ఆరువిధములగునవి (మౌల, భృత్య, సుహృత్, శ్రేణీ, శత్రు, ఆటవికములు) యుండుట లాంఛనములు మాత్రమే. ఇక్కాలపు యుద్ధనీతి రెక్కలులేని పక్షులవంటి బక్కమానుసుల గూలికిచేర్చి, వారినే యుద్ధరంగమున నెల్లెడ నిలిపి, తాము (సేనానాయకులు) దూరదూరముగ గదుపులోని చల్ల కదల కుండనుండి, వేనకువేలుగా జీతములు తినుట మాత్రమే. ఒకప్పుడు దైవికముగ నే గుండో, బాంబో తగిలి యించుక గాయమైనచో, నదనపు జీతములు భుజించుచుండుట. యుద్ధమున చచ్చువారు దిక్కులేని ప్రజాసామాన్యము; గెలుపువలన భోగాతిశయము లందువారు ధనికవర్గము. పూర్వకాలముననో, రాజులు అగ్రేసరులై సేనల దమ వెనుక దీసికొని వెళ్లువారు. ముందుగా తాము మహాయోధులతో దలపడి పోరువారు. తమ రాజు నితరునితో పోరునపుడు పరులు వంచించి, వెనుకనుండి, ప్రక్కలనుండి యాతనిని శీకాకు పఱుపకుండ సైనికులు గాపాడువారు. నేటి కాలమున సర్వసేనాని యుద్ధరంగము రేఖాపటము దగ్గఱ నుంచుకొని యెక్కడకు బంపిన సైనికులకు వేవేగముగ వీరస్వర్గము లభించునో యాయా తావులకు టెలిఫోనులోను, రేడియోలోను జెప్పెడి ఆజ్ఞలచే మృత్యుముఖమున నుఱికించుచుందురు.

ఆకాలమున రాజులు స్వపరరాష్ట్రముల విషయమై చేయు నాలోచనము రాజ మంత్రులకు దక్క మూడవవానికి దెలియ వీలులేదు. ఏ కార్యములు చేయుచున్నను, ముఖవికారాదులచేనైత మూహింపరానివిగా నుండెడివి. తన ప్రజల కుపకారమో, శాత్రవుల కపకారమో, యేదైనను ఫలము సిద్ధించిన తరువాతనే యితరులకు దెలియదగును. అదియును "విత్తు నాటినదే మొక్క మొలచుట అసంభవముగాన,ముందుగా విత్తు నాటబడుట తప్పదు" అనునట్లు అనుమాన ప్రమాణముచే దెలియదగినదే కాని, ప్రత్యక్షప్రమాణమున నెవరికి నెఱుగరా కుండును. నేడో మంత్రులు చేయదలచినవి ముందుగా సభ్యులకైన దెలియకుండనే పత్రికల కెక్కిపోవును. అంతకంటె ముందుగానే యుపన్యాస వేదికల కెక్కును. అంతకంటెను ముందుగానే దిక్కులకు, విదిక్కులకు నెగబ్రాకును. ఇట్లు తలంపులు బయలు ప్రాకుట యెన్నికలలో నుపకరించు నుపాంగముగదా!

శ్లో. "మంత్రమూలం యతో రాజ్యం
అతో మంత్రం సురక్షితమ్,
కుర్యాద్యథాస్య నవిదుః
కర్మణా మాఫలోదయాత్."

అను యాజ్ఞవల్క్య వచనము నాకాలమున నెట్లాదరించువారో యీ కాలమున నెట్లాదరించుచున్నారో గమనింపదగును.

దిలీపుడు భయములేనివాడయ్యును దన్ను జాగ్రత్తగా రక్షించుకొనువాఁడు. త్రివర్గసాధనములలో మొదటిది కావున శరీరము, ముఖ్యముగా రక్షింపదగినది. భయముండుట, లేకుండుట యను విచక్షణత్వ మక్కఱలేదు. రోగము వచ్చినపుడెల్లరును గ్రహజపములు, రుద్రాభిషేకములు, శాంతులును చేయుచుందురు. స్వస్థముగ నున్నపుడు ధర్మము పేరే తలంపరు. కాని దిలీపు డట్లుగాదు. ఏరోగము రొచ్చులేని వాడయ్యును సంతత సుకృతార్జన పరుడై యుండువాడు. తనకు ధనాశయు, భోగానుభవమును, సత్యాసక్తియు లేనివాడయ్యును లోకమర్యాద కొఱకును, శాస్త్రానుసరణమునకును నా రెంటిని తామరాకున నీటిముక్కలవలె నంటియు నంటకయే సాధించువాఁడు. మఱియు నాతనికి బరుల రహస్య వ్యాపారములు తెలిసినను వానిని వెల్లడింపకయే మౌనమున నుండువాఁడు. "నాన్యోపతాపివచనం మౌనవ్రతమిహోచ్యతే" యను కామందక వచన మిట్టి మౌనమును

విధించుచున్నది. తనకు బలము కలిమిని జిన్న చిన్న నేరములకు సైతము పరుల హింసించు టుచితముగాదు. సామదాన భేదోపాయములచే పరుల దుండగము లడంప బ్రయత్నించి, తుద కేమిటను ఫలము లేనపుడే దండము ప్రయోగించుట. "శక్తానాం భూషణం క్షమా" యని చాణక్యు డాదేశించుచున్నాడు. కాళిదాసుని దిలీపు డావచనము లక్షరముల బాలించుచున్నాడు. "ఊరిలో నుండని త్తిని, కుకుండగ ని త్తి, పరుండని త్తినే, మి త్తినోయి త్తిని దేయ మనిత్య" మను చంద్రశేఖర శతకమందలి ప్రబుద్ధునివలెగాక "నదత్వా పరికీర్తయే" త్తను మను వచనము ననుసరించి కుడిచేత నిచ్చినది యెడమచేతికైనఁ దెలియకుండునట్లు ద్యాగము చేయువాడు. లోకమునఁ బరస్పర విరుద్ధము లయ్యును సెల్లగుణములు నాతనికడ సమాన గౌరవము నొందునవి.

ఆకాలమున ప్రజలకును, ప్రభుత్వమునకును గల సంబంధము చిత్రమైనది. ప్రజలు దంపతులై బిడ్డలనుగన్నఁ జాలును. ఆ బిడ్డలను బెంచుట పోషించుట విద్యావినయాదులు గలిగించి యుత్తమ పౌరులుగా జేయుట మొదలగు వ్యాపారములన్నియు రాజే చేయువాడట.

"ప్రజానాం వినయాధానా
ద్రక్షణా ద్భరణాదపి
సపితా, పితర స్తాసాం
కేవలం జన్మహేతవః."

శైశవమునుండియు సన్మార్గ ప్రవర్తనమున మంచి నడవడిక లలవఱుచుటయు, ఎట్టి భయము గలుగనీయకయే యాపదలు బొరయకుండుటయు, అన్నపానవస్త్రాదులొసంగి కాపాడుటయు రాజే చేయువాడు. ప్రజాదంపతులు కేవలము బిడ్డలను గనుటకుమాత్ర ముపకరణములుగా నుండువారు. ఆకాలపు నిరంకుశ చక్రవర్తి పాలనమందలిది యీ మార్గము. ఈ కాలమందును అన్నింట గాకున్నఁ గొన్ని విషయములందైనను సోవియట్ రష్యా కొంత కొంతగా నీ పద్ధతు లవలంబించుచున్నదని వింటిము. కాని తక్కిన ప్రజా ప్రభుత్వములుకాని ధనికవర్గ ప్రభుత్వములుగాని యెంతవఱకీ మార్గముల నాదరించుచున్నవి? "మీరు పండించిన పంట మీకు దినుటకు జాలదు. మా కున్నతపదవుల్నొంది కులుకుటకు చాలదు. మిమ్ముల నణచిపెట్టియుంచు మా సిబ్బంది యాశలు తీర్చుటకు జాలదు. కావున మీరు బిడ్డలను గనుట కూడదు. గొడ్డుతనము మీకు మంచిది. మేము మిమ్ములను గొడ్డులుగా జూచుచున్నామే కదా!" యనుట యిప్పటి పాలకుల పద్ధతి. అయితే, యింతవఱకు పాలకులు ప్రచారము మాత్రమే చేయుచున్నారుగాని నిషేధ శాసన మొకటి జారీ చేయకున్నారు. దానికి వారు వంధ్యులే.

దిలీపుడు స్థితి, లోకపాలనము కొఱకు మాత్రమే దండ్యులను దండించును. సంతానమునకుమాత్రమే పెండ్లియాడెను. కావున నాతనికి పురుషార్థములలో రెండు, మూడు నగు నర్థకామములుగూడ ధర్మసాధనములే యైనవి. అదండ్యులను దండించుట, దండ్యులను దండింపకుండుట యను రెండు విషయములు రాజున కధర్మాపాదకములు. దండ్యుల నపరాధముల ననుసరించి దండించుట రాజధర్మము. కావున నాతడు లోకప్రతిష్ఠకై శాస్త్రోక్త రీతిని మాత్రమే దండము ప్రయోగించుచు, ధర్మ సంగ్రహమే కావించువాడు. వివాహవిషయమున "ధర్మప్రజా సంపత్త్యర్థం స్త్రియ ముద్వహేత్త"ను గృహ్యోక్తరీతిని, కేవలము వంశ ప్రతిష్ఠ నాశించియు, పితౄణ మపనయింప నెంచియుమాత్రమే దారసంగ్రహము గావించినవాడు. కాని కామసంతర్పణమునకై కాదు. దిలీపుడు తనకు సంతానము లేకపోవుట అనిర్వాణమగు గజమున కరంతుదమగు నాలానమువలె బాధకముగా నున్నదనియు, తన యనంతరము పిండోదకములు విలుప్తములగునేమోయను భయమున బితరులు తానిచ్చెడి కవ్యనివాపములను దుఃఖముతో ననుభవించుచున్నారనియు, గురునితో విన్నవించు నవసరమున పలికినపలుకులే యాతని ధర్మతత్పరతను నకామలోలుపతను బ్రకటించుచున్నవి. అసలు మొట్టమొదట నాతనికి సంతాన మింతవఱకు గలుగకుండటయు నాతని ధర్మతత్పరతవలననే. ఇంద్రుని కడనుండి తన యింటికేతెంచుచు వేళ యతిక్రమించుటచే ఋతుస్నాతయగు భార్యను సమీపింపజాలమి ధర్మము లోపించునేమో యనెడి విచారముచే మార్గమధ్యమున నున్న కామగవి నాత డర్చింపకయే వెడలిపోయెను. దానికిఁ గినిసి కామగవి యాతని ధర్మతత్పరత నాలోచించియే నాతికఠినమగు

రీతిని 'నా ప్రసూతి నారాధింపనిచో, నీకు సంతతి కలుగ'దని శపించెను. ఇది యాతని ధర్మైకరతిచేత నేకదా ? ఈ విషయమున గౌతముడు 'యథాశక్తి ధర్మార్థకామేష్వభ్యస్తేషు ధర్మోత్తరస్స్యాత్' అని నిర్దేశించుచున్నాడు. రాజునకు ఎల్లరకువలెనే పురుషార్థములు నాలుగు సంపాద్యములే. వీనిలో నాతని ప్రజాపాలన కర్మమునకు సంబంధించినవి మూడు మాత్రమే. ఆ మూటియందునుగూడ నాతడు ధర్మమునకే యత్యధిక ప్రాముఖ్యమిచ్చి తాను ప్రవర్తించి, తన ప్రజను ధర్మోత్తరముగా నడపుట యాతనికి కీర్తిప్రతిష్ఠా సంపాదకము. కావున నా కాలపురాజు ధర్మమందంతటి యభినివేశము చూపువాడు. కాళిదాసుని దిలీపుడు చండశాసనుడు. అతనికాలమున దొంగతనము లేనేలేదట.

"న కిలానుయయుస్తస్య
రాజానో రక్షితు ర్యశః,
వ్యావృత్తా యత్పర స్వేభ్యః
శ్రుతౌ తస్కరతా స్థితా"

'దొంగతనము 'దొంగతనము' అను శబ్దము నందే కలదు. ఇతరవస్తువుల యెడ నది యెక్కడను వినబడలేదు. కావున నతనికీర్తి నితరులంద జాలరైరి. అని పై శ్లోకము భావము. ఇట్లే అజవస్గమున నీ రాజునే వర్ణించుపట్టున

"యస్మిన్మహీం శాసతి మానినీనాం
నిద్రాం విహారార్ధ పథే గతానామ్,
వాతోఽపి నాస్రంసయ దంశుకాని
కో లంబయే దాహరణాయ హస్తమ్"

"ఏ రాజుపాలనమున నుద్యాన విహారమున కేగియట నలసి స్త్రీలలో నటనట నిద్రించిన వనితల వస్త్రములను గాలియేని కదల్పకుండెను. ఆభరణము లపహరించుటకు నెవడు చేయి చాపగలడు ?" అని దీనిభావము. దిలీపుడు దైవమానుషశక్తిసంపన్నుడై భూతములను గూడ నధర్మగాముల గానీయకుండ నియమించువాడు. అట్టి తఱి దొంగతనము నేయు జనుల నుపేక్షించునా ? ఇక్కడ విచారింపవలసిన దొంగతనము జరగుట, మానుటలను గూర్చి కాదు. దొంగతనము జరుగవలసిన పరిస్థితులను గూర్చి మాత్రమే. తనకు అవసరమైనదియు, తనకడ లేనిదియు నగువస్తువు సంపాదించుట కెవ్వడు ప్రయత్నించును ? బలవంతుడైనచో, బలము నుపయోగించి, యితరుల బాధించి, యిష్టవస్తువును గైకొనును. పేద యాచించి, దాత మదికరగించి కైకొనును. ఈ రెండు మార్గములను నిష్టప్రాప్తి కానినాడే దొంగతనమున కవసరము గలుగును. దిలీపుని రాజ్యమున ప్రజలు అవాప్తసమస్తకాములు. వారికి ధర్మప్రవర్తనమే ముఖ్యము. విహితధర్మము లాచరించుచు, నున్నదానితో దృప్తిగ శాంతముగ గాలము గడుపువారు. వారివారి యక్కఱల నరసి రాజు స్వయముగానే వారికివలసిన వస్తువు లిచ్చువాడు. ఇంక వారికి దొంగతనము నందెట్లు ప్రవృత్తి కలుగును ? కాబట్టి దిలీపుని కాలమున జారచోర భయములేక ప్రజలు నిశ్చింతముగా హాయి ననుభవించెడివారు. కాళిదాసు డిట్లే కార్తవీర్యుని వర్ణించు సందర్భమునగూడ బేర్కొన్నాడు.

"అకార్య చింతాసమకాలమేవ
ప్రాదుర్భవం శ్చాపధరః పురస్తాత్,
అంతః శరీరేష్వపి యః ప్రజానాం
ప్రత్యాదిదేశా వినయం వినేతా"

ప్రజలలో 'నేవాడైనను నేడేని దుష్కార్యము తలఁచినంతన యోగమహిమమున నా సంగతి నెఱిగి, కామగమనమున నాక్షణమున వానికడ కరిగి, ముందటనిలచి, ధనువుచూపి, వానికి భయముగొల్పి, వాని నాయకార్యమునుండి మరలించువాడట యా కృతవీర్యనందనుడు.'

"కార్తవీర్యార్జునో నామ
రాజాబాహుసహస్రవాన్,
యస్యస్మరణ మాత్రేణ
చోరబాధా నవిద్యతే"

యను శ్లోకమును రాత్రి నిద్రించుటకు మున్ను స్మరించు పెద్దలిప్పుడును గొందఱుగలరు. కార్తవీర్యునినామము దొంగలను బాఱద్రోలు మంత్రము. కాళిదాసుని కాలమున బహుశః రాజులకు ప్రథమ కర్తవ్యము దొంగతనము లేకుండ జేయుటయేమో ? రామాయణమున తస్కరునకు మరణదండము విధింపబడునట్లు తెలియుచున్నది.

రాజను వానికి స్వపరభేదము, పక్షపాతమును లేకుండ నెల్లరను సమానముగ జూచుట న్యాయ్యము, ముఖ్యమును. నేడే పరిపాలన శాఖ జూచినను నవినీతికి దావలముగా నున్నదని పాలకులే యుద్ఘోషించుచుండ నింక దాని

కుదాహరణము లేల? కాళిదాసు నాట నిట్లు కాదు. దిలీపునకు విరోధియైనను సరే, యాతడు సన్మార్గగామియగుచో గౌరవాస్పదమే. ఔషధము చేదు, కారము మొదలగు తీవ్రగుణములు గలదై మ్రింగుట సహ్యముగా కున్నను, రోగము హరించి శరీరమునకు సౌఖ్యము గలిగించును గావున, మనము తిందుముగదా? అట్లే యేవో కొన్ని కారణములవలన విరోధము జనించినను, శాత్రవు డుత్తమగుణములు గలవాడగుచో నాతనిని నివారింపక గౌరవించుటే దిలీపున కభిమతము. అట్లే తన బంధువైనను దుష్టుడగునెడ, బాము కఱచిన వ్రేలు నఱకి పాఱవైచి నట్లాతనిని విడువవలసినదే. మన వ్రేలెట్లు నఱకి పాఱవైచుట యను మమకార మొందిన శరీరము సర్వనాశము కాకుండునా? కనుక దుర్మార్గుని - కుమారునైనను దండించుట నాటి రాజధర్మము. ప్రజాకంటకుడగు నసమంజుని సగరుడు వీడుట దీని కుదాహరణము కాదగును.

మన శరీరము పాంచభౌతికమని శాస్త్రములు చెప్పుచున్నవి. రాజు శరీరముకూడ నట్టిదే. అయినను మనయందు భూతముల గుణములు క్వాచిత్కముగను, నల్పముగను నగపడను. రాజునందన్నో ఆ గుణ మధికముగ నుండకున్న రాజు కానేరడు. భూతముల గుణమునన కేవలము పరోపకారకరణమే. దిలీపుని గుణములన్నియు పరోపకారమునకే వినియోగపడునవట. పరోపకారమునకై ప్రాణములు నైతమిచ్చిన దధీచి శిబి ప్రభృతుల మార్గము కాళిదాసు కాలమున కింకను పూరిపట్టలేదు కావలయును! ఈ విషయమున నాతడు శాకుంతలమున దుష్యంతునచే

"ఔత్సుక్యమాత్ర మవసాదయతి ప్రతిష్ఠా
క్లిశ్నాతి లబ్ధ పరిపాలన వృత్తిరేవమ్,
నాతిశ్రమాప నయనాయ నచశ్రమాయ
రాజ్యంస్వహస్త ధృతదండ మివాతపత్రమ్"

(ప్రతిష్ఠ ఔత్సుక్యమును అవసన్నము గావించును కాని, రాజ్యపరిపాలనము కష్టతరమగునది. నీడనిచ్చి హాయి గొలుపు ఛత్రము, మోయు క్లేశమును గలిగించినట్లే, రాజ్యము సుఖమును, గష్టమునుగూడ గాదు.) అనిపించినాడు. రాజెప్పుడును స్వసుఖమందు మనమిడక లోకావనమునకు క్లేశమందుటేకదా - ఆనాటి ధర్మము.

రాజు శత్రువుల జయించు పద్ధతు లాయా సందర్భములనుబట్టి వేఱువేఱుగా నుండును. కొందఱను ధర్మమార్గముననే లోబఱచుకొనవచ్చును. కొందఱను మాయోపాయములచేగాని లోబఱచుకొన నలవికాదు. కావున రాజు శత్రువులయెడ ధర్మపద్ధతులు, కూట పద్ధతులు గూడ ననుసరించుట యుక్తమే. అయినను ధర్మపక్ష ముత్తమోత్తమము. కావున రఘువు నీతివేత్త లెఱింగించిన సదసన్మార్గములు రెంటను సత్పక్షముననే యాదరించి యుపయోగించువాడు కాని, "నీతియేకదా" యని కూట యుద్ధాదుల నెప్పుడును గ్రహింపడయ్యెను. కావుననే యాతడు యుద్ధమున బట్టుపడిన కాళింగుని విడచి, ధర్మనిర్వహణమునకై యాతని సిరిని దీసికొనెనేకాని యాతని భూమిని గైకొనడయ్యెను. శాకుంతలమున దుష్యంతునిచే

"యేనయేన వియుజ్యంతే
ప్రజా: స్నిగ్ధేన బంధునా
సస పాపాదృతే తాసాం
దుష్యంత ఇతిఘుష్యతామ్."

(ప్రజలు ఏయే బంధువులను గోల్పోవుదురో యాయా బంధువులకు ప్రతినిధిగా- చెడువాని వదలుమాని దుష్యంతుఁడు వారి బంధుగుడని చాటింపుడు) అని యాజ్ఞాపించెను. ఇదియెంతటి ధర్మతత్పరతయో తిలకింపుడు. ఓడ వ్యాపారమునకై సముద్రముపై ప్రయాణము చేయుచు నోడ మునుగుటచే మరణించిన వర్తకుని భార్య గర్భమందున్న బిడ్డకు తండ్రి ధనమెల్ల నొసంగి, యా బిడ్డను దండ్రికి మాఱుగా బెంచి, విద్యాబుద్ధులు గఱపి, పెద్దవానినిగా జేయ నెంచిన దుష్యంతుని సౌమనస్య మెంతని కొనియాడగలము? ఇప్పటి రాచఱికములలోనో సంతులేని సంస్థానాధీశులు దత్తుచేసికొనరాదని నిషేధించి యనేకసంస్థానముల కబళించినారు బ్రిటిషువారు.

కాలము మాఱిపోవుచున్నది. ప్రజలు వేషభాషలందు, నాచారమందును మాఱుచున్నారు. ఇరుగుపొరుగు దేశములందలి ప్రజలతో మాత్రమే కాక ప్రపంచమంతటనుగల ప్రజలకు సన్నిహిత సంబంధములు దృఢముగ నల్లుకొనుచున్నవి. కావున మార్పుల లన్నింటనుగూడ రాకతీఱదు. మనము వద్దన్నను మనకు దెలియకుండనే యవి మనలో నలముకొని మనల వశపఱచుకొనును. అంతమాత్రమున బ్రాచీన ధర్మములు నశించునని విచారింప నక్కఱలేదు.

**రాయలనాటి కవితాజీవనం**

# అల్లసానివారి అల్లిక జిగిబిగి

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు



(గతసంచిక తరువాయి)

'అప్పళాచార్యుల'వారు రాయలకాలమున 'ననుష్టుప్చక్రవర్తి'. ఆవృత్తము నాతనివలె వ్రాయగలవాఁడు లేడట! రాయలు గజపతులను జయించిన తర్వాత నందఱు కవులును కృష్ణరాయలను పంచెము వేసికొని పొగడినారు. కట్టకడపట 'అనుష్టుప్చక్రవర్తి' లేచినాఁడు. లేచి—

"కృష్ణరాయ! స్తువంతు త్వాం
కవయో న వయం స్తుమః,
నరసింహకిశోరస్య కియాన్
కియాన్ గజపతేర్జయః."

అని వేసినాఁడు. దీని వాసనలు మల్లెపూవు తావులవలెఁ గొలువంతయు విరిసికొన్నవి. ఆయనపేరిట మనకు దక్కినదీ శ్లోక మొక్కటే. అది మన దురదృష్టము. ఇట్టి కవిత వ్రాయఁగల కవిమాత్ర మదృష్టవంతుఁడే!

కందుకూరి రుద్రకవి నాఁడు మహాప్రసిద్ధుఁడు; భయంకరుఁడుఁగూడ. ఇతఁడు విశ్వబ్రాహ్మణుఁడు. రాయల యాస్థానమందీ కవి యాశాస్త్రదిక్కున సింహాసన మధివసించి, పండ్రెండేఁడు లేలెనట! మహామంత్రు లీతనికి రాజదర్శన మిప్పింపలే దనియు, కడకు 'మంగల కొండోజీ' మంచి తనముతో రాయల కొలువున ప్రవేశించె ననియు నొక గాథ. అపుడు కందుకూరి రుద్రకవి:—

క. ఎంగిలిముచ్చుగులాములు
సంగతి చెడఁ గులము తెలుపఁ జనుదెంచిర [యా!
యింగిత మెఱిఁగిన ఘనుఁ డీ
మంగల కొండోజి మేలు మంత్రులకంటెన్"

అని తిమ్మరుసును బడదిట్టెనట! ఇట్టి కథను నిజమనుట కా ధైర్యము లేదు; అబద్ధ మనుటకును గుండెలు లేవు. కందుకూరి రుద్రకవి రచన నిరంకుశోపాఖ్యానము. రచనలో నీకవి చాల యుద్ధతుఁడు. ఆ వేఁడి ప్రవర్తనమునఁగూడ గొంతకుఁ గొంత యంటియుండును. నాదెళ్ల చిట్టప్ప, కొప్పోలు త్రిపురాంతకుఁడు నీతని

మున, చిన్న పెద్దగజములు—సుమారు ముప్పది వరకుఁ గనపడును.

అష్టభాషాకవిత్వ కృష్ణావధాన్లు, శాబ్దిక పాండిత్యం వెంకటరామశాస్త్రిలు, సహస్రావధాని ప్రభాకరశాస్త్రి, మొదలగువా రానాటి యుద్దండపండితులు. అభినవవాది విద్యానందుఁ డొక జైనవిద్వాంసుఁడు. రాయ లాతనికి జయపత్ర మొసఁగెను.

కృష్ణరాయనిచే మరియాద లందిన తమిళ కవులు పెక్కురు. "కుమారసరస్వతి" 'దుర్గా శ్రీకృష్ణ పరిణయము'ను వ్రాసినాఁడట. గజపతి కొమరిత పేరు దుర్గాదేవి యని యీ కవి పిలిచెను. ఒడ్డెరాజుల బిడ్డపేరు చాల తగాదా విషయము. పలువురు పలురీతుల నామెను బిలిచిరి. ఈనడుమ నేలటూరి వెంకటరమణయ్య గారు ఆవిడకు 'లక్ష్మీదేవి' యని నామకరణము చేసినారు. 'మండలపురుషుఁడు' 'సుధామణి నిఘంటువు'ను వ్రాసెను. జ్ఞానప్రకాశయోగి "మంజరప్ప" యను కావ్యమును రాయలపైఁ జెప్పినాఁడు. తత్త్వప్రకాశుఁడు "ఇరుసమయ విలక్కమ్" అను గ్రంథమును రచించినకవి. ఇతనిని 'తెలుఁగురాయఁడు' తోజుగా సన్మానించెను. "హరిదాసుఁడు" కృష్ణరాయలు సింహాచలమున నిల్పిన జయస్తంభమును వర్ణించుచు పద్యములు పలికినాఁడు.

'కన్నడరాయ'ని సమకాలికులు కర్ణాట కవు లనేకులు. వీరిలోఁ జాలమంది విరక్తులు, వీరశైవులు. అరుదుగ జైనకవులుగూడ నున్నారు. ద్వైతాద్వైతములును గవితల కెక్కినవి. ఈ కర్ణాటకవులలో రాజవంశజులును జాలమంది. వీరందఱో యొకరీతిగ రాయలవారి యాదరము ననుభవించియే యుందురు. కన్నడకవుల బిరుదులు చాల చిత్రములై యుండును. రాయలనాటి "నీలకంఠారాధ్యుఁడు" 'పరమత వేశ్యాభుజంగుఁడ'ట! బాచరసు 'సుజనైకబాంధవుఁడు'. ఇకను వారి బిరుదులు 'కన్నడజాణ' 'వాణీముకుర' 'సరస్వతీ ముఖతిలక' 'కర్ణాటకవి చూతవన

వీనిని దృష్టియం దుంచికొని చూచినపుడు ముక్కుతిమ్మన దీర్ఘపేశలముగ సత్యాదేవిని సంబోధించియుండుట ఈ వాసన సోకి యుండుటచేతనా! యనిపించును.

నాటి కర్ణాటకవులలో అందరికిఁ దెలిసిన యదృష్టవంతుడు 'తిమ్మణ్ణ' కవి. ఇతఁడు 'పదవాక్య ప్రమాణజ్ఞుఁ'డట! ఇతనికి 'వినూతనాధిక వస్తుభూషావ్రాతము' లొసగి భారత రచనకై రాయలు ప్రేరేచినాఁడు. అంతకు ముందే మహోద్ధతుఁడు కుమారవ్యాసుఁడు శాంతిపర్వమువరకు భారతరచన సాగించి యుండినాఁడు. అచటనుండి 'తిమ్మణ్ణ' యెత్తికోలు. భామినీ షట్పదులలో నా కపిది ధారాళముగ నడచిన రచన. తన గ్రంథమునకు 'కృష్ణరాజ భారత'మనియే తిమ్మణ్ణ పేరుపెట్టెను. ప్రతి సంధి కొనయందును రాయల ప్రసక్తి గలదు. కృష్ణరాయఁడు వ్రాయించిన భారతమునుజూచి నప్పుడు 'కన్నడిగలు' తిక్కన నెంత ప్రేమించిరో మనకుఁ దెలిసివచ్చును.

పదునైదవశతాబ్దిలోని కవయిత్రు లెవ్వరో మన మెఱుఁగము. రామాయణమును వ్రాసిన మొల్ల రాయలకాలమునాటి దందురు. ఎంత వరకు నిజమో! ఈ కవయిత్రితో 'కొంటె కోణంగి' తెన్నాలి రాముఁడు కొంత పిల్లాట లాడె నని కట్టుకథలు. రామకృష్ణుని నెత్తిపై కెత్తఁబడిన పుక్కిటి పురాణముల జూచినచో "నయ్యో!" యనిపించును. మనకు సాహిత్యములో నక్కువగా అపవాదు దొరగిన వ్యక్తులు ముగ్గురు. మొదటివాఁడు శ్రీనాథుఁడు. గోత బుట్టించు బూతు శృంగారపద్యము లన్నియు చచ్చిన శ్రీనాథునిపై వేసి సవరించుకొందుము. ఇక అసహ్యాకరమైన హాస్యమునకు మనకు దొరకిన 'దృష్టిబొమ్మ' తెన్నాలివాఁడు. ఈతని జతలోఁ జేర్చి 'తిరుమల తాతయ్య'వంటి పవిత్రమూర్తినిగూడ పాడు జేసితిమి. ఇక శని వక్రించినమూఁడవవాఁడు వేమన్న. అందచందములేని వేదాంత మంతయు నాతని నెత్తిపై వేసి, పద్యము కడపట 'వేమా' అని తగిలించినచో మన పీడ వదలిపోవును. అది యట్లుండె.

విద్యానగరమున బురుషులతోఁబాటు తరుణులుగూడ(విద్వాంసురాం(డ్రై)యున్నమాట వాస్తవము. సంగములనాటి గంగాదేవి నింతకు ముందే యెఱుకపరచితిని. దేవరాయల కాలమునసుండిన 'శారదాదేవి' ప్రసిద్ధ విద్వాంసురాలు. ఈమె నరుణగిరినాథుఁడు బ్రహ్మాండముగఁ బొగడెను.[1] అచ్యుతరాయని యాస్థానమున 'ఓడువ తిర్మలమ్మ' యుండినది. ఈమె తన చక్కని కవిత్వమును విఠలాలయశిలావీథులలోఁ నింపెను. ఈమె రచించిన శాసనమచటఁ గలదు. అళియరాముని భార్య తిర్మలదేవి చక్కని కవయిత్రి. ఈ 'మోహనాంగి' రచించిన కావ్యము మారీచీ పరిణయము. జింజికోటయం దుండిన రత్నఖేట పండితుని భార్యయు, ఓడ్డయుగూడ చక్కని కవితల్లిరి. వారు వ్రాసిన చాటువు లున్నవి. ఈ 'తల్లికోట' యుద్ధము—మన చరిత్ర నంతయు బొట్టలోఁ బెట్టికొని కాళరాత్రివలె దేల్చి వేసినది.

రాయలయాస్థానమున నష్టదిగ్గజము లుండిన విషయ మందరెఱిగినదే. ఆ గజములలోఁ బాండిత్యముచేతను, వయసుచేతను బెద్దవాడు పెద్దనామాత్యులు. వీరు కృష్ణరాయుని యష్టమంత్రులలో నొకరని యమాత్యశబ్దమే తెలుపుచున్నది. అల్లసాని పెద్దన నందవరీక. ఋగ్వేది. ఆశ్వలాయన సూత్రుఁడు. వసిష్ఠగోత్రుఁడు. చొక్కనామాత్యుఁ డీతనితండ్రి. ఇతని తండ్రిగూడ తుళువనరసరాయని కడ నమాత్యుఁడుగ నుండెనని యొకవాదము. అసలు పెద్దన్నయే నరసరాజు దగ్గరఁ గవిగాఁ జేరెనని యొక యూహ. మనుచరిత్ర నేగాక 'రామస్తవము', 'అద్వైత సిద్ధాంతము' అనెడు రెండు గ్రంథముల నీతఁడు వ్రాసెనట! 'హరికథాసారము'నుగూడ వ్యాసరాయల యానతితో నీకవి తెనిగించెను. ఆ రచనమందలి వని కొన్ని పద్యము లక్కడక్కడ నుదాహరింపఁబడినవి. హరికథాసారము కన్నడమం దున్న ద్వైత గ్రంథము.

'దక్షిణదేశ'మందలి 'కరవాచి' సీమకు మండలేశ్వరుఁడై పెద్దన్న పెద్దిరాజైనాఁడు. చిదంబరములోని గోవిందరాజుల కోవెలకు గోపురమును గట్టించిన దీతఁడే యని చెప్పుదురు. అంతేకాక కవితాపితామహుడు రాయచూరు

1. గద్యపద్య ప్రబంధానాం పంక్త్యోష్టాదశ నాటకాః,
[illegible]

కదనరంగమున కత్తి ఝుళిపించి కదమ్రొక్కిన మహావీరుఁడుగూడ.

పెద్దన్న యహోబిల మఠపు శిష్యుఁడు. అతడు తనగురువు "విద్యానిలయుఁ"డనియు, "కరుణాకటాక్ష నిబిడజ్యోత్స్నా దళితా శ్రితజన దురితచ్ఛలగాఢధ్వాంతసమితి" యనియుఁ జెప్పికొన్నాఁడు. "శఠగోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధ కవితామతల్లిక" యని కూడ ప్రతియాశ్వాసాంతమున నతికించిన దరువు. అనఁగా వారికడఁ బెద్దన్న చిన్నతనమున విద్యాభ్యాసము గావించెనో! లేక యౌపచారిక ప్రయోగమో చెప్పలేము. నాకుఁ గూడ నీహాగడ్త యౌపచారికమనియే తోచును. పెద్దన్న వైష్ణవము స్వీకరింపని చిన్నతనమున వైష్ణవమతములలో విద్యాభ్యాసమున కాతని కనుకూల మేర్పడియుండదు. రాయలకాలమున చాల గొప్పవాఁడైన 'తాతయ్య' కితఁడెందుకు శిష్యుడు గాలేదో! ఆయన అహోబిల మఠమునకు శ్రీకార్యకర్త. శ్రీకార్యకర్తల నేర్పరచు నాచారము కృష్ణరాయల నాడు పుట్టినదే. ప్రతిదినమును దప్తముద్రాంకనమునకై శ్రీపాదతీర్థమునకై తండోపతండములుగవచ్చు జనములతో సహోబలమున ద్రొక్కిడి యొక్కువై యా మఠాధిపతులు గొన్ని యధికారములతో శ్రీకార్యపరుల నేర్పఱచిరి. బహుళః తాతాచార్యుల కీర్తము స్థిరపడకముందే పెద్దనామాత్యుఁడు వైష్ణవమును స్వీకరించెనేమో! ఈ సందర్భమున నింకొక యాశ్చర్యకరమైన విషయము గలదు. అంతగాఁ వీరవైష్ణవమును పండించిన కృష్ణదేవరాయఁడు తనకు దీక్ష నిచ్చిన కులగురువును బెద్దనామాత్యులవలె వెంగళికుఁ దడవలేదో! నాఁడు మఠాధిపతులైన పరాంకుశులు రాయలకు స్వయముగ వైష్ణవము నివ్వలేదా? వారొకవేళ వదలినను తిరుమల తాతయ్యమాత్రము వదలియుండెడువాఁడు గాఁడు. చేతికి దొరకినచో రుద్రునికైన ముద్రలు గొట్టవలెననియే వారియాశ. ఒకసారి తిరుమల తాతాచార్యులవారు శిష్యార్జనమున కొక గ్రామమునకు వెళ్ళిరట. ఆ యూరియందొక గాలిగంగమ్మ గలదు. ఆకలియైనపు డెల్ల నాశక్తి యూరిలోనికి వచ్చిఁ దొరకినవి దొరకినట్లే కోడిపిల్లలు మొదలుకొని గొ[illegible]డవరకు భక్షించి పోయెడిది. అపుడు ఊరిలోనివా రాదేవి కొక కట్టడి నేర్పరచిరి. అప్పుడప్పుడా గాలి గంగకు కడుపునిండ పశువులు సమర్పించునట్లును, సంవత్సరమున కొక మనుష్యు నిచ్చునట్లును ఆ యేర్పాటు. తాతయ్యగారు శిష్యార్జనకు వచ్చినపు డా యూరిలో 'దేవర' ఊరివారు మనుష్యబలికై వెదకుచున్నారు. తాతయ్యకు బుద్ధియందే గాక, కాయమునందును పుష్టి గొప్పది. ఊరివారు కాచి కాచి ఒడ్డు పొడవునుగల యయ్యవారిని బలికై పట్టికొనిరి. తీవ్ర తపస్సంపన్నుల కిచ్చోట నేభయము న్నది! వారు శిష్యులతోఁ జెప్పి శంఖచక్ర ముద్రల నెఱ్ఱగాఁ గాల్పించిపెట్టికొన్నారు. ఒకనిపై గంగానమ్మ పూనినది. వాఁడు 'బలిబలి' యని యఱచుచుఁ దాతయ్యపైఁ బడెను. పసుటయే తడవు! తాతాచార్యులు 'సమాశ్రయణపు' ముద్రలను దీసికొని భుజముపై నంటించుటకు వెంటఁ బడినారు. వానిని జూచినవెంటనే గంగానమ్మకు శివము వదలి పరువెత్తఁ దొడగెను. ఇంత కష్టపడి ముద్రలను గాల్చిన తరువాత తిరుమలతాతయ్య వదలునా! వారి కా గంగమ్మ భుజమందలేదు. "ఎక్కడనో యొకచోటఁ బడనిమ్మ"ని యాపద్ధర్మముగా వీపుపై నంటించినారట! 'వచ్చితిని రా'యని గంగానమ్మ వైష్ణవాచార్యుని కాళ్ళఁ బడినది. అపుడామెను దిరుపతికిఁ దెచ్చి తాతయ్యలు నిలిపినారట! నాటనుండి "తిరుమల తాతయ్యముద్ర భుజము దప్పినా వీపు దప్ప"దన్న సామెత గలిగినది. ఇంతటి పరాక్రమధురీణులైన తాతాచార్యులు వంట యింటి కుందేలుగాఁ జిక్కిన కృష్ణదేవరాయలను వదలియుందురా? మఱి, వారిపేరైనను రాయలు తడవలే దేల? ఏలనో! ఈ చరిత్రలోఁ దోడు కొలఁదియు సందేహములే.

రాయలు పెద్దన్నకుఁ గోకట గ్రామాద్యనేకాగ్రహారంబు లొసఁగినాఁడు. ఈ కోకటము కడపజిల్లాలోనిది. ఇందుఁ బెద్దనామాత్యులవి రెండు శాసనము లున్నవి. ఒకటి సకలేశ్వర లింగశాసనము. ఇది 1518 లోనిది. రెండవది చెన్నకేశవునకు భూదానము. ఇదిగూడ నా సంవత్సరమున నిచ్చినదే. ఈ దానము జరగినది యుత్థాన ద్వాదశినాఁడు. పెద్దనగారు వైష్ణవము పుచ్చుకొని శ్రీవైష్ణవుల కగ్రహారముచేసి యిచ్చెనట! అప్పుడు దానికిఁ

బెట్టిన గ్రామముపేరు 'శఠకోపపురము'. అతఁ
డా యూరికి 'బాపఘ్ని'నుండి కొల్వ దెచ్చెను.
పెద్దనామాత్యులచే దక్షిణ ఆర్కాటుజిల్లా
విల్లిపురం తాలూకా అన్నియూరున నొక
శాసన మున్నది. పెద్దన లచ్చట వదరరాజాల
యము గట్టించి భూమిని ధారవోసెరి. ఈ
శాసనము 1519 నవంబరు 6 వ తేదీనాటిది.
దానిలో "ఆంధ్రకవితాపితామహులైన పెద్ది
రాజుగారు తమ నాయంకరానకు పరిపాలించ
నవధరించిన కఠవాచి సీమలోని 'అన్నూరు'
గ్రామమునందు" అని గలదు. కోకట మాయనకు
'ఉంబళి' అనఁగాఁ బన్ను లేకయే యనుభవించు
నగ్రహారమువంటిది. కఠవాచి సీమనాయంక
రము అనఁగా యుద్ధములందు రాయలకుఁ
గొంత రాణువ నొసఁగి యా రాజ్యము ననుభ
వించుట. దీనినిబట్టి 1519 వఱకు కొంతఁడు
మండలేశ్వరుఁడు గాఁడనియు, 'ఆంధ్రకవితా
పితామహ' బిరుద మంతకు ముందు లేదనియు
నొక వాదము. కాని, పెద్దన్న మంత్రియైననాఁడే
మండలాధిపత్యము గూడఁ గలిగియుండును.
మంత్రుల కొక్కొక్కనికి నొక్కొక సీమ
నాయంకర మిచ్చుట ఆ రాజుల యాచారము.
వారు మండలాధిపతు లైనను, రాజధానియందే
యుండుచు, అప్పుడప్పుడు తము యేలుబడి
సీమలకేగి చూచికొని వచ్చుచుందురు. ఇఁక
"కఠవాచి" సీమలో నాయంకరము 'ఉంబళి'
కేమాత్రమును బాధకము గాదు. 'కోకట'
గ్రామశాసనములలో 'నాంధ్రకవితా పితా
మహ' లేకుండుటచే, నప్పటికా బిరుదు గాలే
దనుటయు నంత యొప్పుకొనఁదగినది గాదు.
వారి వాదము ప్రకారము 'మనుచరిత్ర' రచనా
నంతరము ఆ బిరుదు గల్గినది. 'స్వారోచిష
మనుసంభవము' ముగియు నాఁటికి సార్వ
భౌముని జీవితమునఁ గాలుచీకటులు. అప్ప
టిలో నాతఁడీగ్రంథమును స్వీకరించి కృతిని
సంతోషపెట్టు స్థితిలో నుండ యుండఁడు. మను
చరిత్ర రచనకుఁ బెద్దనను బ్రేరేపించినపుడే
కృష్ణరాయుడు 'ఆంధ్రకవితా పితామహుఁడ
వెవ్వరీడు పేర్కొన నీకుఁ' అన్నాఁడు.
అందుచే మనుచరిత్ర రచనలోనే బిరుదము
గల్గిన దని యొక యాపాతసత్యమును గల్పించి
కొని, దానిచుట్టును 'సాలీని గూడు'నల్లుట
అక్కఱకు రానిపని. కోకట శాసనలేఖ
నమా యూరియందే జరగినను దానప్రదానము
మాత్రము 'కృష్ణాతీర' మల్లికార్జున సన్నిధిలో
నడచినది. నాఁడు సోమోపరాగము. ఆనాఁడే
మహామండలేశ్వరుఁడు సంగయ్య కనకగుర్గకు
దాన మిచ్చినాఁడు.

గజపతులపైకి రాయలు దండెత్తినది రెండు
సారులు. 1516 సంవత్సరమునం దొకసారి,
1519 యందు రెండవసారి. కటకమును
గాల్చినది రెండవ దండయాత్రలో. తొలుత
నాతఁడు సింహాచలమువఱకును గజపతిని దరిమి
వెన్నాడు వచ్చి, శ్రీకాకుళమున సైన్యము
విడిసెను. అక్కడ 'హరివాసర' పుణ్యకాల
మును నడపి, మఱునాటి ద్వాదశియందు
ముక్కుతిమ్మనకును, పెద్దనకును మహాకావ్య
రచనకై తాంబూల మొసఁగినాఁడు. రాయలు
తానుగూడ నప్పుడే 'యాముక్తమాల్యదను'
రచింప సంకల్పించెను. గ్రంథరచనకు నియో
గము, పెద్దనకు బిరుదప్రదానముతోఁబాటు
జరగియుండు నని నా యనుమానము. గజపతు
లను జయించిన నాఁటికి రాయలు సంతాన
హీనుఁడే. అందుకే యాయన తనకు సంతాన
ప్రాప్తికై 'చోళసముద్రమున' 'చాడేశ్వరకి'
దాన మిచ్చెను. ఆ సంవత్సరమున నే తిరుమలదేవి
తనకుఁ దనయుఁడు గలుగుటకై యింటి
పురోహితునకు భూదాన మొసఁగినది.
1526 లో కృష్ణరాయని సుతునిపేరిట దాన
శాసనము లున్నవి: కనుక 1516 నుండి
1526 వరకును పెద్దన్నలు నిమ్మళముగ
'నిరుపహతి స్థలము' మొదలైన సాధన సామ
గ్రితోఁ గృతిను మూఁడు మూఁడున్నర
యాశ్వాస మల్లిరి. రాయలకుఁ గుమారుఁ
డస్తమింపఁగా, మిగిలిన కొదవను త్వరగా
ముగించి కృష్ణరాయని కుమార ప్రాప్తికై
యాశీర్వదించినారు. రాయి 'లాముక్తమాల్యద'
నంతకు ముందే ముగించెను, ఇంతకు నివి
యన్నియు 'భావాంబరవీధివిశ్రుతవిహారము'లు
మాత్రమే.

'ఆంధ్రకవితా పితామహ' బిరుదము అల్ల
సాని పెద్దన్నతోఁ బుట్టినది గాదు. ఇది
అంతకు ముందే యుండెను. మనకు తెలిసినంత
వఱకుఁ దొలుత దీనిని ధరించినవాఁడు 'శివ
దేవయ్య.' ఈ మాటను తద్వంశజుఁడు శరభ
రాజు వర్ణించినాఁడు. కొలవి సత్యనారాయణ

కవి గూడ "కవితా పితామహుఁడే" ఈ విషయము సింహాసన ద్వాత్రింశికలో నున్నది. పెద్దనామాత్యులతో నీ కీర్తి దాఁగినది గాదు. అటుతరువాత నిదియభినవావతారములనుగూడ నెత్తెను. అల్లసాని పెద్దన్న గణనాయకుని గురించి:—

ఉ. "అంకముఁ జేరి శైలతన
యా స్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున
నవ్వలిచన్గు బళింపఁబోయి యా
వంక కుచంబు గాన కహి
వల్లభహారము గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గ
జాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్."

అను పద్యమును వ్రాసెను. ఈ భ్రాంతి మదలంకారమే—

పాయాద్వో గణనాయకః పశుపతే
రంకే చిరం సంస్థితో
వామార్ధాంగవిరాజితాం గిరిసుతాం
జ్ఞాత్వానిజా మాదరాత్,
తుండాగ్రం ప్రవిసార్య సస్మితముఖః
పీత్వా స్తనం చాఽపరమ్
పాతుం ప్రేతమనాః స్తనం మృగయతే
విఘ్నాంతక స్సర్వదా.

(1524-రాయల శాసనము)

అను శ్లోకములోనిది దిగినది. శైలిని బట్టి చూచినచో నీ రచనముగూడ పెద్దనలదే యై యుండునని నాతలఁపు. కవితాపితామహుని 'నిరుపహతి స్థలంబు' అను పద్యము ఆంధ్ర తెలుఁగనిది గాదు. మనుచరిత్రఁ జదివినవారికి గూడ నీ పద్యము మాత్రము వచ్చును. దీనికి మూలము.

"నిరుపహతిస్థలం మృదుత
రాసన మెస్పుణీ సింపుడంబులం
సరిసిద పుస్తకప్రతతి
లేఖకవాచకసంగ్రహం నిరం
తర గృహనిశ్చితస్థితి వి
చారకసంగతి సత్కళత్రసా
దరతెయు మల్లి సత్కవియు
మీసువదాగదె కావ్యవార్ధియుం."

అని కన్నడమున నున్నది. ఈ పద్యము— 'మల్లికార్జునుఁడు' కూర్చిన 'సూక్తి సుధార్ణవము' లోనిది. అతఁడు అల్లసాని వారికి మున్నూరేండ్లు ముందటివాఁడు.

పెద్దన భట్టబాణుల నెక్కువగ నాదరించి, యధ్యయనము సేసిన ట్లగపడును. బాణుని గౌరవించుట తెనుగు వారికి నేర్పినది తొలుత శ్రీనాథుఁడు. కవితాపితామహుఁడు తనకు బాణుని పైనున్న యాదరమును గంఠోక్తిగనే చెప్పినాఁడు. ఆ పద్య మిది—

మ. "వనజాక్షోపము వామలూరుతనయున్
ద్వైపాయనున్ భట్టబా
ణుని భానున్ భవభూతి భారవి సుబం
ధున్ బిల్హణున్ గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణకవిం
జోరున్ మురారిన్ మయూ
రుని సౌమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జే
యొందున్ వచశ్శుద్ధికిన్."

(మను. 1—7.)

వ్యాసవాల్మీకుల తరువాత పెద్దనకు జ్ఞాపకము వచ్చినది భట్టబాణుఁడే. ఆ సంస్కృతపు 'హాళహాళి' ముందు కాళిదాసుని లలితపేశల వాక్కుగూడ పెద్దన్నకు బుద్ధికెఁ దట్టలేదు. కాళిదాసు నెత్తి కడకుఁ బాఱవేసినారు. కాళిదాసుకంటెను బిల్హణున కగ్రతాంబూలము ముట్టినది తలఁచి నపుడు మనకు 'పాప' మని పించును.

ఇంత యనురాగము బాణునిపై నున్నది గనుక నేయవసర మున్నను, లేకున్నను, పెద్దనల వెనుక భట్టబాణులు తొంగి చూతురు. మనుచరిత్రలోని ప్రథమాశ్వాసమున సాషధ సిద్ధుఁడు పలుకు ప్రౌఢమైన పెద్దవచనమంతయు లోకలు మార్చుకొని నిలచిన భట్టబాణుని పలుకులగుంపే. స్వారోచిష మనుసంభవమున 'సిద్ధ సిమత్' (మను. 3. 22.) అను నొక ధ్వన్యనుకరణము గలదు. ఈ శబ్దము నితరు లెవ్వరు ప్రయోగించినట్లు లేదు. బాణుడు మాత్రము- 'అగ్నికార్యార్థ దగ్ధ సిమసిమాయమాన కుశసమిత్కుసుమం' అన్నాఁడు. పెద్దన్న మందరమును, సుందరమగు నీ దీర్ఘ సీసపద్యమున వర్ణించినారు.

"సీ. జరఠకచ్ఛపరాజు చరమాంగ గృహమేధి,
భోగివేష్టన కేళిఁ బొలుచుజాణ,
కులములోఁ బరికిపు గలిగి మించినమేటి,
మైనాకు నొరసిన మావటీఁడు,

తొలికేలుపుల వేలుపుల పను ల్గానుటేడు,
కడలిరాయలలోఁతు గన్నగబ్బి,
సురరాజునకుఁ బాండుకరిఁజేర్చుమరకాఁడు,
కల్పకంబులపంట కమ్మతీఁడు,
గీ. కంటె! మథిత సుధాధాత కటకజాతి
చంపక వనప్రకంప నాకంపనిసర
దఖరముఖరవ మధుకర సుఖరశిఖర
సందరసమందిరం బగుమందరంబు."
(మ. 5. 47)

దీనియందలి గీత మంతయు అమృతశీకరసిక్త సానోః అనుటకు వ్యాఖ్యానమే. 'అమృత మథనోద్వృత్త వైకుంఠ కమఠకేయూరపత్ర మకరకోటి కషణ మస్య హితగ్రావ్ణః' 'సురాసుర హేలావలయిత వాసుకి సమారంభణారంభ చలితచరణ భరదళిత నితంబాత్' అని వ్రాసిన భట్టబాణుని పునాదిపై పెద్దనామాత్యులీ మేడ నంతయు గట్టినారు.

రాయలకుఁ బెద్దనామాత్యులపై నెంత ప్రేమయో యంత గౌరవము. ఆ రాజు వారి నెపుడును 'పెద్దనార్య!' యనియే పిలుచుట వాడుక. ఈ గౌరవముతో దూరపు ప్రెక్కుటే గాక రాయలకుఁ బెద్ద హితుడుగఁ గూడ (మను. 1-15) నా కవి యుండెను. అష్ఠాజీ తరువాత రాయల హృదయ మేలిన సార్వభౌముఁ డల్లసాని పెద్దనయే.

కృష్ణరాయఁ డడుగక ముందే మహాకవి కావ్యరచనకై 'యనుకూలకథలు' తలఁచుచుండి నాఁడు. సార్వభౌముఁడుగూడ నందు కుపస్ఫో రకముగా "స్వారోచిష మనుసంభవమును" రచింపుఁ డనెను. ఆయుపాఖ్యానము 'రససమం చిత కథల'లో పెద్దనల 'చతురరచన' కను కూలమట! కలి ధ్వంసకముగూడ. వరూధినిని మోసపుచ్చిన గంధర్వునిపేరు 'కలి' యట! అందుచేఁ బెద్దనామాత్యు లావిషయమును మన సులోఁ బెట్టికొని, 'కలిధ్వంసక'మని యొత్తి పలికిరట! ఇంత కష్టపడి మాయాగంధర్వుని పేరు మన కెఱుకపఱచుట మంచి పరిశ్రమయే! కాని యాకలికి నీ పుస్తకమున గలిగిన 'ధ్వంసన' మేమని నా ప్రశ్న. మనుచరిత్రలో మాయాగంధర్వునికిఁ గలిగిన శిక్షవంటిదే మన కును ప్రాప్త మగునవకాశ మున్నచో మనలోఁ జాలమంది 'కలి' గంధర్వు లగుట కర్రులు సాతు రని నా తలఁపు.

అనపత్యుఁడైనరాజు మహాకవి యాశీర్వాద మునసైనను దనకు సంతానము గలుగునేమో యని స్వారోచిష మనువువంటి కుమారుని గాంక్షించి పెద్దనను బెద్ద కావ్యమునకై ప్రేరే చెను. ఈ విషయమును గంభీరముగ నాద్యంత (మను. 1-34, మను 6-121) సీసపద్యములచే మహాకవి సూచించినాఁడు. 'ఆత్మావై పుత్ర నామాసి' యని యున్నదిగదా! అట్లు గాకు న్నచో నొకటే భావము నొకటే వృత్తమున నామ్రేడితము సేయ నవసరము లేదు.

రాయ లేరికొన్న కథ నిజముగ 'మహాకవి' 'చతుర' రచన కనుకూలమైనది. పెద్దన చాతు ర్యములో నెక్కువభాగము 'కథాసంవిధాన ము'ను నడపుటలో నున్నది. తిక్కనవలె నాతఁడు తొలుత గొన్ని రేఖలను గీయును. ఆ తరువాతి పాత్ర చిత్రణ మంతయు నా రేఖ లపై నిర్మించును. పెద్దన్న ప్రవరుఁడు 'మక రాంక శశాంక మనోజ్ఞ మూర్తి:' మఱి మాటా డిన 'నలేఖ్యతనూవి:సుఁడు. భాషాపరశేష భోగి. నిరంతరాధ్యాపనతత్పరుఁడు.' తొలుత సూచించిన యీ గుణములనే మహాకవి కావ్య మునఁ బెంపొందించి కొనుచుఁ బోయెను. 'సుఖులై తలిదండ్రుల గూడి దేవియుఁ దేవర వోలెనుండి యిుఁదీర్పఁగ'(1-53)నన్నమాటను 'నను నిముసంబుఁ గానక యున్న'(2-17) యను పద్యమున నా మహాకవి వ్యక్తీకరించును. ప్రవ రుని జూచినప్పుడు వరూధిని 'సంభావశిశేఖలు మదీయులగు ప్రాణసఖు' (2-44) లన్నది. అక్కడ నామె రంభను దడవుట, ప్రవరుఁడు నలకూబర సన్నిభుఁడై (2-28) యుండుట వలననే.

పెద్దన రచన 'శిరీషకుసుమపేశలము.' సుధామయము గూడ. పలికిన భావ మంతయుఁ గ్రొత్తగ నుండవలె నను దప్పి యీ కవులకు లేదు. పరిచితభావ మైనను దానినే సొంపుగ జెప్పి, బంధచ్ఛాయలోఁ గ్రొత్తఁదనము దేవలె నని యీ జాతి మహాకవుల యూహ. మను చరిత్రను బాగుగఁ జదివినపుడా మున యెంత సంగీతప్రియుడో, "నాదశుద్ధి" నెంతగాఁ బ్రేమించెనో మనకుఁ దెలిసివచ్చును. అతఁడు గూడ 'నింపు దళుకొత్త' వీణ వాయించెడు వాఁడేమో!

అల్లసానివారిలో నితర కవు లనుసరించిన అనుసరింపవలసిన—గుణము లెన్నియో యున్నవి. తక్కిన ప్రాయసగాంగ్రు వర్ణించి విసిగించు ననేక ఘట్టముల నీతఁడు సంగ్రహించును. అరుణాస్పద పట్టణము నాతఁడు రెండు పద్యములలో దాటిపోయినాఁడు. మొదటి పద్య మెంతయో ముచ్చటగా, ధ్వని మార్గమున నాతని కావ్యరీతి నంతయుఁ జూపుచున్నది. తుంగభద్రయొడ్డున విద్యానగరమువలె వరుణానది గట్టుపై నరుణాస్పద ముండెను. దాని వప్రములు యథాప్రకార—మాకాశము నంటెడివి. సౌధములు చంద్రమండలమునకు వ్యాపించి, దయదలఁచి నిలచినవి. ఇక వాని పతాకము త్రిలోకమును దాకినవో! 'మహాకంఠ హారతరళ నూత్నశ్రీ' అను విశేషములన్ పెద్దన కాళిదాసు కవిత యిట్టిదని వ్రాసెను. రెండవ పద్యమున 'చాతుర్వర్ణ్యము'ను వర్ణించి, వరూధినీ జాతిని చెప్పినాఁడు. ఒక పట్టణమన్న పూర్వకవుల సంప్రదాయమునుబట్టి యింతకన్న నేమి చెప్పవలెను! ఇతరకవు లైనచో నాయరుణాస్పదము నందలి గుడ్డుపుఁ దోకలు మొదలుకొని యేనుగుల తొండములవఱకును సాఁగదీసి వర్ణించి మనలఁ జంపి యుందురు. ఔచిత్యమున కాచార్యుఁడగు 'పింగళి సూరన్న'గూడ ముసలి ముప్పున నీ పనియే చేసెను. అతని ప్రభావతీ ప్రద్యుమ్నములోని ద్వారకానగర వర్ణనము నాతఁ డెట్లు వ్రాసెనో గాని చదువుటకు మనకు పెద్ద శ్రమ.

పెద్దన్న మఱలఁ బంచమాశ్వాసమున 'గంధర్వ నగరము'ను వర్ణించినాఁడు. ఆ పద్య మిది—

మ. "అనుచుఁ జంపనపంకపంకిలతలం
బై కేతుసంఘాత
ధ్వనికూపం బయి మంచకోపరికుటీ
వాటీనటన్నర్తకీ
జనమై యౌవతసర్వతఃకలిత వీ
క్షాలోకనక్షత్రసంఘం
ధనమై యొప్పుపురంబు గాంచి భవన
ద్వారప్రఘాణంబునన్."

(మను. 5. 53.)

గంధర్వనగరమునందు ముఖ్యముగ వర్ణింపవలసినది—'నటన్నర్తకీ గణముల' హడావిడిగాక మఱేమున్నది? ఆ యింత పద్యములోననే యాతఁడు 'యౌవతసర్వతఃకలిత వీక్షాతోరణ ప్రస్నబంధనమై' యని తనకుఁ గావలసిన ముక్క ననివేసికొన్నాఁడు. ఇది ప్రకృతమును గూడ సూచించుచున్నది. ఇకపైన నా కవి స్వరోచి పెండ్లిలో—'యుపనాయికల' ననుకొంపెము—వర్ణింపఁ బోవుచున్నాఁడు. పెద్దనలోని యిట్టి చమత్కారము ముక్కుతిమ్మనయందుఁ గూడఁ గలదు.

వరూధిని ప్రవరుని జూచినపు, డితరులైన సంగాంగవర్ణనములతో మనకుఁ దల దిమ్ము త్రిప్పించియుందురు. సంకుసాల నృసింహకవియు, భట్టుమూర్తియు నీపనియే చేసిరి. పెద్దన రెండు పద్యములు మాత్రమే యామెనోటఁ బలికించినాఁడు. ఆసన్నివేశమునుగూడ నాయన జాల చక్కగ స్పృశించెను. నిజమందిరాంగణమున నామె మతరుణ సహకారమూలవితర్ది మీద గూర్చొని యున్నది. శీతలానిలములు మొదలైన హంగులన్నియు నచ్చట నుండెను. అప్పుడామె యేకాంతమున వీణా సాధన జేయుచున్నది. ఒంటిగాఁ బాడికొనునపుడు—సంగీత మొసఁగెడు హాయి అనుభవైకవేద్యము. అందుచే వరూధిని 'ఆలాపగతిఁ జొక్కుచు నరమోడ్పుగన్ను' వేసినది. ఈ పద్యమునందింకను గొంత శిల్పమున్నది. కావ్యార్థ సూచనయున్నది. వానిని భావుకులకే వదలివేసెదను. ఈచోట పెద్దనామాత్యు వరూధిని చెలికత్తెలను ప్రవేశపెట్టకపోవుట మనకుఁ జేసిన పెద్ద యుపకారము. అట్లే పరిసరములను మితిమీఱి వర్ణింపక మన దృష్టి వరూధినిపైననే లగ్నమగునట్లుఁ జేసి పుణ్యము గట్టికొన్నారు.

అచ్చరకు 'ఒంటిపాటున దంగేటి జున్ను వలె' నచ్చిన ప్రవరుని జూచినంతనే గొప్ప గాంగిక మానసిక వికారములు గలిగినవి. ఈ వర్ణనములో నాతఁడు ప్రవరుని రూపసంపదను జెప్పక చెప్పినట్లైనది. ఒక్కొక్క పద్యమునందొక్కొక్కరీతిగా ఆవిడ యనేకావతారము లెత్తినది. ఇచట ప్రతి పద్యమును ప్రాణముగల యొక యప్సరస.

(సశేషము)

# : లీలావతీగణితము :

## వల్లభార్యప్రణీతము



క. హరిహరహిరణ్యగర్భుల
¹ వరద జలధిభవ భవాని ? వాణీకాంతే
శ్వరుల మనంబున నిడి మ
ద్గురువులకును సుకవిజనులకును వినతుఁడనై.

గీ. సుకవి కోడూరి రాఘవసూరిసుతుఁడ
సుజనహితుఁడ నాపస్తంబసూత్రకలిత
హరితగోత్రపయోధినీహారకరుఁడ
నలఘుచరితుఁడ వల్లభాహ్వయుఁడ నేను.

ఉ. శ్రీ నరసింహనందను న
రిందమవిక్రముఁ గృష్ణరాయభూ
జానిని వెండియుం దదను
జన్ముని నచ్యుతదేవరాయనిన్
దా నధికాప్తుఁడై కొలిచి
తద్దయు మన్నన గాంచి మించువి
ద్యానిధి బొమ్మలాట విరు
పాధిపు కొలని ప్రాగ్ధనంబునన్.

సీ. సంజ్ఞలు నయనసంజ్ఞలు పరికర్మాష్ట
కత్రితయము పరికర్మకలన
కర్ణి.....................శ
కంబులు విహృతిమిశ్రంబు గాఁగఁ
జెన్నొందు వ్యవహృతశ్రేణి గళాప్రాధి
క్షేత్రంబు మేఖలాసూత్రపదము
ఘాతంబు మధ్యరేఖా.........
......ముల్ సమములు త్రైశికంబు

గీ. రాశిఛాయ తనుచ్ఛాయ క్రందుకుంట
కాఁక పాళముల్ దశనఖాంకములుగఁ
బరఁగు గణితలీలావతీభావ.........
......క్కఁ దక్కినవాఁడు గలఁడె.

క. అని పొగడ గణకు లౌనా
నని సంస్కృతభాష భాస్కరాచార్యులు చె
ప్పినపాటిగ (టీ ?) లీలావతి
యొనర్తుఁ దెనుంగున..................

సీ. కనుఱెప్పఁ గదలఁ జేసినయంతకాలంబు
నిమిష మష్టాదశనిమిష కాష్ఠ
యది రెండు నఱయ గుర్వక్షరోచ్చారకా
.........గుర్వక్షరము ప్రాణ
మది రెండు గ.........విఘటిక
యవి పరిక్షీణ మవి యాఱు ఘటిక
త్వమాద్వయం బొకముహూర్తం బవి ముప్ప
దైన నహోరాత్ర మవి పదేను

గీ. పక్ష మవి రెండు నొకమాసపరిమితిని బ
రంగుఁ దద్ద్వయంబు ఋతు వవంగఁ జెల్లు
చుండు నన్నూటముప్పదిరెండుకోట్ల
హాయనంబులు కల్ప మా సంద్రు మునులు.
కల్ప మనఁగా బ్రహ్మకు దినము.

చ. ధర విధివర్గసంఖ్య మగు
ధాన్యము............యం
బరయఁగ సోలు నాలుఁ గవి
యా నొకమానిక నాల్గుమానికల్
తిరముగఁ గుంచ మయ్యె గణు
తింపఁగ నాల్గవి తూము పుట్టి యా
నిరువది తూము [లంచు వచి
యింతురు మానము శాస్త్రకోవిదుల్].

చ. అలవరిగింజ వీసము ప
దాఱవి చిన్నము నూవె చిన్నముల్
నలువదియేను కర్మ యవి
నాల్గు పలం బగు నైదునాలుఁగుల్
పలము................నాఁ
బరఁగున్ మణుం గగున్
బలములు నూఱు నార్వమరు
బారువులుం బది యాచితం బగున్.

గీ. వీసములు నాల్గు పాతిక వినుము నాల్గు
పాతి...................మాడ
నలుపలము రాగిటంక మై పొలుచు దాని
కయ్యెఁ బైకంబు షణ్ణవత్యంశకంబు.

1. వరదుల అని వ్రాఁతప్రతిపాఠము. గణభంగము.

క. ¹ విదితముగ గవ్వ లొకయిరు
వది కాకిణి యవియు [నాలుఁ గగుఁ బణ
[మవియుం
బదియాఱొక ద్రమ్మం బవి
పదియాఱొక నిష్క మనఁగఁ బరఁగు
[ధరిత్రిన్.

పణ మనంగాను బిడ్డీ. ద్రమ్మ మనంగను కహాణము

గీ. ² అడ్డ మెనిమిదియవ లైన నంగుళ మగు
నవియు నిరువది[నాలుఁగు హస్త మవియు
నాలు గొక దండ] మవి యిరువేలు క్రోశ
మయ్యె నవి నాల్గు యోజన మనఁగఁ జెల్లు.

హస్త మనఁగా మూర. దండ మనఁగా బార.

గీ. ³ హస్తమితము లైనవిస్తార పైండ్య దై
ర్ఘ్యములఁ బొలిచి ద్వాదశాస్ర మైన
గట్టి ఘనకరంబు ఘనహస్తమిత......
దికము దెలియ మగధదేశఖారి.

క. ⁴ ఖారీషోడశభాగం
బారయ ద్రోణము దదంఘ్రి యాఢక
[మగుఁ దెం
పారఁగఁ దదంఘ్రి ప్రస్థము
ధారుణిపైఁ జనుఁ దదంఘ్రి తాఁ గుడుపము
[నాన్.

గీ. వంశమిత దైర్ఘ్య విస్తారవసుధ కుంట
నిక్కువము కుంట లేనూఱు నేలఁ బట్టె
నభ్రశర నేత్రబాహుసంఖ్యంబు లైన
యట్టికుంటలు కేసరిపుట్టి కయ్యె.

క. ⁵ చరణాధికరసనాయక
ధరణిపరిమితము లగుచుఁ దనరినకుంటల్
పర్ణింప నివర్తన మగుఁ
గరములు పదియాఱు నిడుపుగా వంశ
[యగున్.

గీ. ఈ త్రిలింగదేశమునందు నెచట నెచట
వ్రీహితౌల్యాదిపరిభాష వేఱు వేఱ
నెట్లు వర్తిల్లు నది యెల్ల నెఱుఁగవలయు
నచట నచటఁ బ్రజ్ఞావంతుఁ డైనవాఁడు.

తౌల్య మనఁగాను తూనిక.

క. క్రమమున నేకస్థానం
బు మీఁద దశశతసహస్రములు ⁶ నింకను ల
క్షము నామీఁదను దశల
క్షములును..................

గీ. ⁷ అర్బుదము వానిదగ్గఱ న్యర్బుదంబు
ఖర్వమును మహాఖర్వసంఖ్యములు వాని
పై మహాశంఖ మాకడం బద్మ మాల
నట మహాపద్మమును దదనంతరమున.

గీ. ⁸ క్షోణికము లైనమహాక్షోణి
క్షితి పిదప క్షోభం బైనట్టి
మహా క్షోభము శంఖ జలధు
లాయంత్యమునను (?)

గీ. ⁹ అంత్యమధ్యములు ¹⁰ పరార్థ్యములును
[భూరి
దశగుణోత్తరముగఁ దప్ప కిట్లు
గణితశాస్త్రవిదులు కడఁగి సంఖ్యాస్థాన
ములకు సంజ్ఞ నిడిరి మూఁడుపదులు.

ఏకం ౧ దశము ౨ శతం ౩ సహస్రం ౪ దశసహస్రం ౫ లక్ష ౬ దశలక్ష ౭ కోటి ౮ దశకోటి ౯ శతకోటి ౧౦ అర్బుదం ౧౧ న్యర్బుదం ౧౨ ఖర్వము ౧౩ మహాఖర్వము ౧౪ శంఖము ౧౫ మహాశంఖము ౧౬ పద్మము ౧౭ మహాపద్మము ౧౮ క్షోణి ౧౯ మహాక్షోణి ౨౦ క్షితి ౨౧ మహాక్షితి ౨౨ క్షోభము ౨౩ మహాక్షోభము ౨౪ శంఖము ౨౫ జలధి ౨౬ అంత్యము ౨౭ మధ్యము ౨౮ పరార్థ్యము ౨౯ భూరి ౩౦.

గద్య

ఇది శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య ప్రబోధానంద శ్రీచరణ సద్గురుచ్ఛాత్ర హారిత గోత్ర కోడూరు యెఱ్ఱయామాత్యపౌత్ర రాఘవ సూరిపుత్ర కవిదేవేంద్రాపరనామధేయ సుజన విధేయ సహజధైర్య వల్లభార్యప్రణీతం బైన లీలావతి యనుపాటీగణితంబునందు సంజ్ఞాధికారము.

---

1. మూలము. ౨ శ్లో. చూ. 2. చూ. మూలము శ్లో. ౫. 3. చూ. మూలము శ్లో ౭. 4. చూ. మూలము శ్లో. ౮. 5. చూ. మూలము శ్లో. ౬. 6. నింక లక్ష దశలక్షములునుఁ గోటి దశకోట్లు రీతిన్. అని వ్రాఁతప్రతి — చూ. ద్వితీయాధ్యాయము. ౨. శ్లో. 7. చూ. మూలము ౨. 8. చూ. మూలము. ౩. పద్యము కుదురలేదు. 9. చూ. మూలము ౩. 10. పదార్థములు మఱియు - అని వ్రాఁతప్రతి.

క. [1] లీలాలలితగళల్లుల
దాలోలకరాళబలవదవిరళకాల
వ్యాలవిలాసివినాయకు
నీలకమలవిమలకాంతి నెమ్మదిఁ దలఁతున్.

గీ. వేద మఖిలక్రియాప్రతిపాదకంబు
జ్యౌతిషము వేదమునకు లోచనము నందు
గణితభాగంబు తారకల్ గాఁగ వలయు
నిది యవశ్యంబు చదువ మహీసురులకు.

క. గణితం బిది త్రివిధము గ్రహ
గణితంబును మఱియు బీజగణితముఁ బాటీ
గణితంబును దత్పాటీ
గణితము పరికర్మపూర్వకంబై యొప్పున్.

వ. అందు సంకలన వ్యవకలన గుణకార భాగ
హార వర్గ వర్గమూల ఘన ఘనమూలంబు
లను నెనిమిది ప్రకారంబు లయ్యె నందుఁ
బరికర్మంబు సకల భిన్న శూన్యభేదంబులం
ద్రివిధంబు లయ్యె వానిలో సకల సంకలన
వ్యవకలనంబులకుం గరణసూత్రంబు.

క. క్రమమున నుత్క్రమమున నను
క్రమమున రాశ్యంకములు యథాసంఖ్యాస్థా
నముగా నిడి యోగవియో
గము లొనరింపంగవలయుఁ గౌశల

[మొప్పన్.

ఉదాహరణము :

క. కరులును రాజులు రథములు
కరివర్గము రాజమహలు ఖగజేభములున్
వరహాలు విరుపయ కాళఁడు
[సరసులకును] నిచ్చె నివి వెసం గూడ

[వనా !

ఒడ్డు ౮
౧౬
౩౨
౬౪ సంకలించిన
౧౧౬
౮౮౦
———
౧౧౧౬ మొత్తము.

క. పంచసహస్రంబులలోఁ
గాంచనములు బొమ్మలాట కాళఁడు నీ కి
ప్పించె నృపశంకరుల శే
షించిన యవి కవిమహేంద్ర ! చెప్పుము

[మాకున్.

ఒడ్డు— ౫౦౦౦
౧౧౧౬ తీయఁగా
———
౩౮౮౪ నిలిచిన మొత్తము.

గీ. అరసి యేకాదిమదశాంతిమాంకవత్క్ర
మాణగుణపాఠఫలములు మహితబుద్ధి
విస్ఫుటంబుగ నిటు వేఱువేఱ కూడి
వానిలోఁ దత్ఫలంబులు వలయుఁ దివియ.

గుణపాఠము మగ్గ ఒడ్లు.

౧, ౨, ౩, ౪, ౫, ౬, ౭, ౮, ౯, ౧౦
సంకలనము చేసిన లబ్ధము ౫౫—ఒడ్డు ౫౫ వీని
లోను దొలుతటి ఫలాలు వ్యవకలించిన ౦

ఒడ్డు—
౨, ౪, ౬, ౮, ౧౦, ౧౨, ౧౪, ౧౬,
౧౮, ౨౦ సంకలించిన ౧౧౦ ఇందులోను మును
పటి ఫలములు వ్యవకలించిన ౦.

ఒడ్డు—
౩, ౬, ౯, ౧౨, ౧౫, ౧౮, ౨౧, ౨౪,
౨౭, ౩౦ సంకలించిన ౧౬౫ ఇందులో నా
ఫలాలు వ్యవకలించిన ౦.

ఒడ్డు—
౪, ౮, ౧౨, ౧౬, ౨౦, ౨౪, ౨౮, ౩౨,
౩౬. ౪౦ సంకలించిన ౨౨౦ ఇందులో ఫల
ములు పుచ్చిన ౦.

ఒడ్డు—
౫, ౧౦, ౧౫, ౨౦, ౨౫, ౩౦, ౩౫, ౪౦,
౪౫, ౫౦ సంకలించిన ౨౭౫ ఆ ఫలాలు
తీసిన ౦.

ఒడ్డు—
౬, ౧౨, ౧౮, ౨౪, ౩౦, ౩౬, ౪౨,
౪౮, ౫౪, ౬౦ ఇవి కూడిన ౩౩౦, ఆ ఫలాలు
తీసిన ౦.

ఒడ్డు—
౮, ౧౬, ౨౪, ౩౨, ౪౦, ౪౮, ౫౬,
౬౪, ౭౨, ౮౦ ఇవి కూడిన ౪౪౦, ఆ ఫలాలు
తీసిన ౦.

ఒడ్డు— ౯, ౧౮, ౨౭, ౩౬, ౪౫, ౫౪,
౬౩, ౭౨, ౮౧, ౯౦ ఇవి కూడిన ౪౯౫
ఆ ఫలాలు తీసిన ౦.

ఒడ్డు—౧౦, ౨౦, ౩౦, ౪౦, ౫౦, ౬౦,
౭౦, ౮౦, ౯౦, ౧౦౦ ఇవి కూడిన ౫౫౦
ఆ ఫలములు తీసిన ౦.

ఇవి సంకలనవ్యవకలనంబులు :

---

1. చూ. [illegible]. ౧ శ్లో.

వ. సకలగుణకారంబు అఖండంబును, ఖండంబును, చిత్రంబును నన మూఁడు దెఱంగు లయ్యె నందు ఖండం బనేకరాశికంబును, నేకరాశికంబును నన నుభయప్రకారం బయ్యె. చిత్రంబు నిరిష్టంబును, సేష్టంబును నన ద్వివిధం బయ్యె. ఇట్లు అఖండంబును, అనేక రాశిఖండంబును, నేకరాశిఖండంబును, నిరిష్టచిత్రంబును, సేష్టచిత్రంబును ననఁ బంచవిధం బైనగుణకారంబునకుం గరణసూత్రము మూఁడుపద్యములు.

క. గుణకము గుణ్యాంత్యాంకము
గుణియించి యుపాంతిమాది గుణ్యాంకం
గుణ మాట నడపె దానం [బుల్
గుణితంబులుగా నొనర్ప గుణకార మగున్.

గీ. గుణ ఖండపృథఙ్ఞఘ్న గుణ్యయుతియు
గుణక మెద్దానిచేఁ బాలుగొన్న నిరవ
శేష మగు నట్టిహారంబు [చేత] లబ్ధి
చేతగుణ్యంబు హతముగాఁ జే(యఁ?)నదియు.

క. ఇష్టోనగుణాహతగు
ణ్యేష్టాహతగుణ్యయోగ మెయ్యది యదియున్
సేష్టగుణాహతగుణ్యా
ద్విష్టాహతగుణ్యవివర మెయ్యది యదియున్.

క. పదిలెక్కలు నొకఁ డాదిగఁ
బది క్రిందుగ నిడ్డప్రతులఁ బది వేఱ్వేఱన్
బదిలెక్కల గుణియింపఁగ
నొదవినగుణపాఠ మెల్ల నొదవినఁ జెపుమా.

గుణపాఠం—తదనంతరంబ మగ్గ ఒడ్లు వ్రాసేది.

ఉద్దేశము—

క. దివసకరులు గుణకము శర
భువనసుధాకరులు గుణ్యముగఁ జూపుము పం
చవిధం బైనగుణక్రియ
కవిసులభుఁడు గొమ్మగాటకాళఁడు మెచ్చన్.

ఒడ్డు— గుణ్యము ౧౩౫
గుణకము ౧౨
చేలం ౧౬౨౦

ఒండె నిరూ.....గులు చేసిన గుణఖండాలు ౪, ౮ వీనిచేత గుణ్యం రెండు ప్రతులు పెట్టి గుణియించిన

(౧) ౧౩౫ × ౪ (౨) ౧౩౫ × ౮ ౫౪౦, ౧౦౮౦

కూడిన ఫలము తొల్తటిదే ౧౬౨౦.

ఒండేని—గుణకము మూఁడోపాలు గొన్న లబ్ధము ౪. ఈ హారము మూఁడుచేత గుణ్యమును గుణించిన ౪౦౫. ఇది క్రమ్మఱ లబ్ధము ౪ చేత గుణించిన ఫలము తొల్తటిదె ౧౬౨౦.

ఒండేని—ఆ గుణకం స్థానవిభాగాలు చేసిన ౧, ౨. ఈ గుణకాలచేతను గుణ్యము రెండు ప్రతులు పెట్టి గుణియించిన ౧౩౫, ౨౭౦ ఇవి స్థానాలు, ఏకస్థానాలు, దశస్థానాలు తప్పకుండ బెట్టిన ౧౩౫౦, [౨౭౦] కూడిన తొల్లింటిదే ఫలము ౧౬౨౦.

ఒండేని—గుణకములోపల రెండు పుచ్చిన ౧౦. వీనిచేతను, రెండుచేతను గుణ్యము రెండు ప్రతులు పెట్టి గుణియించిన ౧౩౫౦, ౨౭౦—కూడిన ౧౬౨౦.

ఒండేని—గుణకము ౧౨ లోను ౮ కూడిన ౨౦. దీనిచేత గుణ్యం గుణించిన ౨౭౦౦. వీనిలోను ౮ చేత గుణించిన ౧౦౮౦ పుచ్చిన ౧౬౨౦.

ఉదాహరణము—

గీ. విరులు శశినఖనిధివార్ధికరిరసార్థ
భువననిర్మితశివసద్మములకు గుడికి
.........తిరాజభుగు......జలధిసంఖ్య
చేసె విరుపయ కాళఁ డిచ్చినవి యెన్ని?

గుణ్యము—౨౩౫౬౮౪౨౦౧ గుణకము ౪౮౩౨౭౧౬౯౦౫ ఫలము ౩౫౫౫౩౫౬౯౫౦౧౨౦౮౪౨౨౯౫.

ఇది గుణకారము.

వ. ఇఁక భాగహారంబు నిరవర్తనంబును, నపవర్తనంబు నన ద్వివిధం బయ్యె దానికిం గరణసూత్రము.

గీ. అంత్యభాజ్యంబులోఁ బోవు యద్గుణ మయి
భాజకం బది ఫల మగు భాజ్యభాజ
కముల నపవర్తితంబులుగా నొనర్చి
పంచ నగు నొండె నటు సంభవించెనేని.

గీ. సంభవించినపుడు నవలెక్కచేత రా?
శిద్వయంబు నిరవశేషకముగ
గురవి లాఘువాద్యమై పాలుఁ గొనుఁ డపవ
ర్తనంబు గణకవరులు మెచ్చ.

గీ. కవులు పన్నిద్దఱికి మాత్తికంబు లిచ్చె
వేయు నార్నూటయిరువది విరుపవిభుని
కాళఁ డొక్కొక్క సుకవిభాగమున కెన్ని
[illegible]

ఒడ్డు—భాజ్యము ౧౬౨౦ భాజకము ౧౨ పాలుగొన్న లబ్ధము ౧౩౫ ఒంటేని భాజ్యభాజకాలు ౩ నపవర్గించిన ౫౪౧ పాలుగొన్న లబ్ధములో ౧౩౫ భాజ్యభాజకాలు ౪ అపవర్తించిన ౪౦౫ మూడోపాలు గొన్న లబ్ధము అదె ౧౩౫.

ఉద్దేశము—

చ. శరఖనవాక్షివార్ధికృత
సర్పనఖావనిఖేఘునందప
ట్చరపురసాయకప్రదర
[సాయక]రాముల విప్రజాతికిన్
ధరణినఖాంక వేదవసు
తర్క-శరాగ్నితురంగసంఖ్యకున్
విరుపయ కాశిఁ డిచ్చె నని
విందుము పాలికి నెన్ని మాడలో.

ఒడ్డు—భాజ్యము—౩౫౫౫౩౫౬౯౫౦౧౨ ౦౮౪౪౨౯౦౫ భాజకము ౭౩౫౬౮౪౯౨౦౧. లబ్ధము ౪౮౩౨౭౧౬౯౦౫.

ఇది భాగహారము.

వ. సకలవర్గంబు అఖండంబును, ఖండంబును, ఇష్టోనయుతంబును ననం ద్రివిధం బయ్యె నం దఖండంబున ననులోమంబును, విలోమంబును, ఖండంబును, ఇష్టోనయుతంబును ననఁ జతుర్విధం బైనవర్గంబునకుఁ గరణ సూత్రము.

గీ. అంత్యకృతి నిల్పి ద్విగుణగుణాంత్యపాత
ములగు బరాంకములు తమతమపై నరసి నిల్పి?
విడిచి యంత్యంబు దగ వ్రాసి నడపి యిట్లు
యాదిమాంకంబుదాఁకఁ జేయంగవలయు.

గీ. ఖండయుగళాభిహతి రెట్టి ఖండవర్గ
యోగమునతోడః గూడంగ నొండె వర్గ
వయ్యె........గ్రాశిహతి యభీష్ట
వర్గసంయుక్తముగ నొండె వర్గ వయ్యె.

క. కృతి యనఁగ సమద్వితరా
హతి యేకాదిమదశాంతిమైకాంకో
చితకృతిపాతము మా కా
యతమతి నెఱిఁగింపు రాఘవార్యతనూజా!

వర్గపాతము —౧/౧, ౨/౪, ౩/౯, ౪/౧౬, ౫/౨౫, ౬/౩౬, ౭/౪౯, ౮/౬౪, ౯/౮౧, ౧౦/౧౦౦.

ఉదాహరణము—

క. మది బొమ్మగంటకాశిఁడు
ముద మొంద నగాంకనయనములకు నిధు
బదివేలును [1] నైదింటికిఁ [లకున్
బగునాల్గింటికి నొసర్చు పరిపాటిఁ గృతుల్.

ఒడ్డు—౨౯౭, ౯, ౧౦౦౦౫, ౧౪ అంత్యకృతి నిల్పి యున్నప్రకారమున తుదనుండి మొదలికి వర్గించిన ననులోమము. ఆ ప్రకారమునసే మొదలనుంచి తుద వర్గించిన విలోమము. ఈ రెండు ప్రకారముల నైనవర్గువులు.

౮౮౨౦౯, ౮౧, ౧౦౦౧౦౦౦౨౫, ౧౯౬.

ఒంటేని...౪, ౫ వీని ఆహతి ౨౦. ఇవి రెట్ట గుణించిన ౪౦. అఖండల వర్గువులు ౧౬, ౨౫. వీని ఐక్యము ౪౧, కూడిన వర్గువచె ౮౧.౧౪ వీని ఖండలు ౮, ౬. వీని ఆహతి ౪౮. రెంట గుణించిన ౯౬. ఖండవర్గువులు ౬౪, ౩౬. వీని యైక్యము ౧౦౦. ఇది ౯౬ తోడ గూడిన వర్గువిదే ౧౯౬. ౧౪ వీని ఖండలు ౧౦, ౪. ఇందులోను వర్గువిదే ౧౯౬. ఒంటేని రాశి ౨౯౭ ఇందులో మూడు పుచ్చిన ౨౯౪. వేటె మూడు కూడిన ౩౦౦. వీని యాహతి ౮౮౨౦౦. ౩ వర్గువు ౯ కలయం గూడిన వర్గువిదే ౮౮౨౦౯. ఈ ప్రకారమునసే యెల్ల చోట్లను.

ఇది వర్గువు.

సకలవర్గమూలంబునకుం గరణసూత్రము—

చ. కడవిషయుంబునం బొ......
గృతి వుచ్చి పదంబు రెంటఁ దా
నుడుగక పెంచి దానఁ దగ
యుగ్మము పాల్గొన లబ్ధవర్గ మ
ప్పుడు తదనంతరాజమునఁ
బుచ్చి ఫలద్విపదంబు పంక్తియం
దిడి పలుమాఱు నిట్లు ఘటి
యించిన పంక్తిదళంబు మూల మా.

ఉద్దేశము—

క. ము న్నొనరించినవర్గువు
లన్నిటికిం దొమ్మిదింటి కట నాల్గిటికిన్
మున్నూటయువదియొక్కటి
కి న్నిలుపుము వేఱువేఱ కృతిమూలంబుల్.

ఒడ్డు—౮౮౨౦౯, ౮౧, ౧౦౦౧౦౦౦౨౫, ౧౯౬, ౯, ౪, ౩౬౧ వీనిమూలములు ౨౯౭, ౯, ౧౦౦౦౫, ౧౪, ౩, ౨, ౧౯.

ఇది వర్గమూలము.

---

1. బె రెంటికి నని వ్రాఁతప్రతి.

వ. సకలఘనంబు లఖండంబును, ఖండంబును, వర్గరాశిజంబును నన మూఁడువిధంబు లయ్యె నందు నఖండంబు అనులోమంబును, విలోమంబు నన నుభయప్రకారం బయ్యె. ని ట్లనులోమాఖండంబును, విలోమాఖండంబును, ఖండంబును, వర్గరాశిజంబును నసం జతుర్విధం బైనఘనంబునకుం గరణసూత్రము మూఁడుపద్యములు.

చ. [1] అరుగుగ నిల్పి యంత్యఘన మంత్యకృతిత్రిపదాహతాదిమో త్కర మటమీఁదఁ గూడి కడఁ కం త్రిజగత్సమనిఘ్న మాపదాం తరగ మిలాదివర్గ పుచి తంబుగఁ జేరిచి యాది కెండియుం దర మిడి యంత్యభావనఁ బ దంపడి యిట్లు రొనర్పఁగాఁ దగున్.

క. [2] ఒంటేని రాశి ద్విధవ తి ఖండద్వితయమునఁ జెంచి త్రగుణ్యన [మూఁటన్ రెండియు గుణించి మఱియును ఖండఘనైక్యంబుఁ గూడ ఘన మగు [యగున్.

గీ. [3] కణఁగి వర్గమూలఘనము వర్గించిన వర్గరాశిఘనము వచ్చు నిక్క మరయఁ గృతిఘనంబు లాద్యంశమున నుండి యెన్నిటికిని నైన నేఁగుడంచు.

క. ఘన మగు సమత్రిఘాతం బనఘా! యొకఁ డాది యగుదశాంక [ములకుఁ జ య్యన వేఱువేఱ చెప్పుము ఘనపాతము బొమ్మలాట కాళఁడు మెచ్చన్[4].

$$\frac{1}{1}, \frac{2}{8}, \frac{3}{27}, \frac{4}{64}, \frac{5}{125}, \frac{6}{216},$$

$$\frac{7}{343}, \frac{8}{512}, \frac{9}{729}, \frac{10}{1000}.$$

ఉదాహరణము—

క. అంచితమతిఁ గాళఁడు హ ర్షించఁగ నిటఁ దొమ్మిదిటికిఁ ద్రిఘనంబునకున్ బంచదశోత్తరలక్షకుఁ బంచఘనంబునకుఁ దేటపఱుపుము [ఘనముల్ ర.

ఒక్కు—౯, ౨౭, ౧౦౦౦౧౫, ౧౨౫ అనులోమవిలోమముగాఁ జేయఁగా నైనఘనాలు ౭౨౯, ౧౯౬౮౩, ౧౦౦౦౪౫౦౦౬౭౫౦౩౩ ౭౫, ౧౯౫౩౧౨౫.

ఒంటేని రాశి తొమ్మిది. ఖండాలు ౪, ౫. ఈ రెండు ఖండాల లబ్ధముచేతను రాశి గుణించి ౩ (త్రి?) గుణించినది ౫౪౦. ఖండము నాలుగు ౬౪,౧౨౫ ఐక్యము ౧౮౯ కూడఁగా నైనఘనము ౭౨౯. ఒంటేని రాశి ౪. దీని వర్గమూలము ౨. దీనిఘనము ౮. ఇది వర్గించిన రాశి ఘనంతోటిదే ౬౪.

ఇది ఘనము.

వ. సకలఘనమూలమునకుం గరణసూత్రము - మూఁడుపద్యములు.

క. [5] ఘన మంత్యఘనస్థానం బునఁ బుచ్చి పదంబు ద్విఘ్నముగఁ జేసి [రయం బునఁ దత్కృతిహతిఁ బా ? ల్గొని భాజ్యము ఫలము నిల్పుకొని...డిన్.

క. [7] ఫలవర్గాంత్యత్రిపదము తల...నాద్యమునఁ బుచ్చి తత్ఫలఘన మ వ్వలిఘనమునంగఁ బుచ్చఁగఁ బలుమఱు [ఘన]పంక్తి యేరుపడుఘనపదమై.

క. [8] ఘనమూలంబులు మునుపటి ఘనరాసులవలనఁ గొని జగద్విదితముగా నొనరింపుము సకలకళా ఘనుఁ డగుమనబొమ్మలాట కాళఁడు [మెచ్చన్.

౭౨౯, ౧౯౬౮౩, ౧౦౦౦౪౫౦౦౬౭౫౦ ౩౩౭౫, ౧౯౫౩౧౨౫. ఘనమూలాలు ౯, ౨౭, ౧౦౦౦౧౫, ౧౨౫.

ఇవి సకలపరికర్మంబులు.

వ. భిన్నపరికర్మాష్టకంబునకు నాదిభూతం బైన యంశసవర్ణంబు భాగజాతియు, ప్రభాగ

1. మూలము ౧౧, ౧౨ శ్లోకములు. 2. మూలము ౧౩ శ్లోకము. సూత్రము ౧౬. 3. మూలము ౧౩ శ్లోకము. సూత్రము ౧౭. 4. మూలము. శ్లోకము ౧౪. 5. మూలము. శ్లోకము ౧౫. 6. మూలము. శ్లోకములు ౧౪, ౧౫. 7. మూలము. శ్లోకములు ౧౪, ౧౫.

జాతియు, భాగానుబంధజాతియు, భాగాప
వాహజాతియు ననం జతుర్విధం బయ్యె
నందు భాగజాతికిం గరణసూత్రంబు.

క. [1] హరభాగము లితరేతర
హరము లగు......నొండె నపవర్తనఁ జే
కుఱినపరస్పరహరముల
హరాంశములు...పరాశి హరసామ్య
[మగున్.

ఉదాహరణము—

చ. [2] మునుకొని మూఁడురూపములు
మూఁడవపాలును బంచమాంశకం
బును వరుసన్ సమాన[హర
ములై] మొనర్పుము విస్మయంబుగా
ననఘ! చతుర్దశాంశకము
నర్వదిమూఁ డగునంశకంబు వీఁ
కున సమహారముల్ గ నొడఁ
గూర్పుము కోవిదు సంతసించఁగన్.

ఒద్దు— $\frac{౩}{౧}$, $\frac{౧}{౩}$, $\frac{౧}{౫}$ సమహారాలైన

$\frac{౪౫}{౧౫}$, $\frac{౫}{౧౫}$, $\frac{౩}{౧౫}$.

ఒద్దు— $\frac{౧}{౧౪}$, $\frac{౧}{౧౩}$ ఈ హారాలు ౧౪,౬౩

ఇవి ౭ చే అపవర్తించిన ౨, ౯ వీని గుణించి

సమహారాలు చేసిన $\frac{౯}{౧౨౬}$, $\frac{౩}{౧౨౬}$.

ఇది భాగజాతి.

వ. ప్రభాగజాతికిం గరణసూత్రము—

గీ. [3] ఛేదకంబుచేత ఛేదంబు గుణియించి
యంశకంబుచేత నంశకంబు
నాహతంబు సేయునది దీని గణితవి
శారదులు ప్రభాగజాతి యండ్రు.

ఉదా—

క. [4] ద్రమ్మార్ధత్రిలవద్విత
యమ్మునఁ దుర్యాంశకత్రయమ్మునఁ బంచాం
శమ్మున షోడశలవపా
ద మ్మర్థికి నిచ్చెఁ బసిఁడి తన్మితిఁ జెపుమా!

$\frac{౧}{౧}$, $\frac{౧}{౨}$, $\frac{౨}{౩}$, $\frac{౩}{౪}$, $\frac{౧}{౫}$,

$\frac{౧}{౧౬}$, $\frac{౧}{౪}$ సవర్ణించి యపవర్తించిన $\frac{౧}{౧౨౮౦}$

యీలాగున నిచ్చినది గద్య.

ఉదా—

చ. [5] ఎనిమిది పుట్లు వేఁడె మును
పేడవభాగము వేఁడి వానిచే
వెనుకఁ దదష్టమాంశములు
వేఁడెఁ బదంపడి యేడు వెండియుం
బనివడి వేఁడెఁ దద్దశమ
భాగము యాచకుఁ డంతమాత్ర నా
తనికి నొసంగె లోభిదార
ధాన్య మెఱుంగవె యెన్ని యయ్యెనో.

ఒద్దు— $\frac{౮}{౧}$, $\frac{౧}{౭}$, $\frac{౨}{౭}$, $\frac{౧}{౧౦}$ సవ

ర్ణించిన ను $\frac{౬}{౧౬౦}$, అపవర్తించిన ౧ $\frac{౧}{౦}$

ఇద్దుము.

క. [6] నాగములలోనఁ బంచమ
భాగంబుల రెండు నింద్రభాగములో ష
డ్భాగము లేడును సాష్టమ
భాగాగ్నులలోన దశమభాగముఁ జెపుమా.

ఒద్దు— $\frac{౮}{౧}$, $\frac{౨}{౫}$, $\frac{౧}{౧౪}$, $\frac{౬}{౭}$,

$\frac{౩}{౧}$, $\frac{౧}{౧)}$ వక్ష్యమాణభాగానుబంధసూత్ర

$\frac{౧}{౮}$

క్రమాన యీడ ఒద్దు సవర్ణించిన ౨ $\frac{౫}{౮}$,

$\frac{౧}{౧}$ యుక్తోక్తకరణాన నైనవి ౧౬, $\frac{౧}{౧౨}$, $\frac{౫}{౧౬}$

ఇది ప్రభాగజాతి.

వ. భాగానుబంధభాగాపవాహంబులకుం గరణ
సూత్రము. రెండు పద్యములు—

---

1. మూలము శ్లోకము ౧౬. పుట ౩౪.
2. మూలము శ్లోకము ౧౭. పుట ౩౫.
3. మూలము - సూత్రము ౨౧. పుట ౩౬.
4. పుట ౩౭. ఉదా ౭.
5. మూలములో లేదు.
6. వ్యాలములో లేదు.

గీ. [1] ఒకటిలోని లవము లొండికము లైనవి
యధరహారముచేత హారము నంశ
ములను బెంచి యంశముల కధరాంశముల్
ఋణము ధనముగాఁగ నెఱుఁగవలయు.

గీ. [2] స్వాంశ మధికోన మగు నొందునట్టి యంశ
కానుబంధాపవాహంబులందు హార
మధరహారమునఁ బెంచి స్వాంశాధికోన
కాదరభేదమునఁ బెందునది యములు ?

ఉదా —

గీ. [3] కణఁగి రెండుఁ బాతికయుఁ బాదవిరహిత
త్రయము నిట సవర్ణితమ్ము సేయ
నేమి యయ్యెఁ గవిమహేంద్ర! చెప్పుము
లాట కాళహస్తి యాత్మ మెచ్చ. [బొమ్మ

ఒడ్డు — ౨ ౩
౧ ౧ సవర్ణించిన ౯ ౧ ౧
౧ ౧ ౪ ౪
౪ ౪

ఉద్దేశము —

క. మూఁడేడు సోలెఁడు తక్కువ
యైనట్టి పదాఱుపుట్లు నార్ధము బుధు లౌ
నౌ నన సవర్ణితంబులు
గా నిప్పుడు చెప్పవలయుఁ గాళఁడు
[మెచ్చఁగ.

౧౬
౧
౬
౨౦ సవర్ణించిన
౦౧ ౨౦౭ ౫౯
౧౬ ౧౨ ౮౦
౦౧౪

ఉదా —

తరువోజ —

[4] చరణంబు స్వత్ర్యంశసహితమై మఱియు
స్వదశసంయుక్తమై చను నెంత యగుచుఁ
బరికించి మూఁడవపాళ్లు రెండేరు
పఱిచి నిజాష్టమభాగంబు వుచ్చి
యరుదాగ నిజసప్తమాంశత్రితయ
మట విహీనము సేయ నవి యెట్టి వయ్యె

నర యేమి యగు నిజాష్టాంశవిశ్లిష్ట
మై స్వసప్తమనవకానుబంధమున.

ఒడ్డు — ౧ ౨ ౧
౪ ౩ ౨

౧ ౦౧ ౦౧ సవర్ణించిన ౧/౨, ౧/౩, ౧/౧

౩ ౭ ౭
౧ ౮ ■

ఉదా —

క. [5] చరణాధికషట్కము నిజ
శరలవయుక్తముగ నెంత శరములు నిజభా
స్కరగానములను స్వా......
ర్ధరహితములు నైన నెంత తప్పక చెపుమా!

ఒడ్డు — ౬ ౫ ౬
౧ ౧ ౧ ౧
౧ ౦ ౨ తొల్తటియొడ్డు - ౧
౪ ౧ ౧ ౪
౧ ౨ ౨ ౧

భాగానుబంధములు చేసిన ౨ ౫/౪ సవర్ణించిన

౧ ౫
౨ ౪

ఇవి భాగానుబంధభాగాపవాహంబులు.

ఇది జాతిచతుష్టయము.

వ. భిన్నసంకలనవ్యవకలనంబులకుం గరణ
సూత్రము — రెండు పద్యములు —
[6] సారత్వము గలభాగములకు యోగాంతర
ములు గావలయును హారము లేనిరాశికిని రూప
ము హారముగాఁ దగఁ బడు నేర్పడరను ?

గీ. అపగతాశ్చర్యసదృశహారాంశకంబు
లైన రాసుల కెల్ల యథైకజాతి
భాగమునఁ జేయఁగావచ్చు యోగవియుతు
లింక నంశసవర్ణనాపేక్ష వలదు.

ఉద్దేశము —

గీ. పాదషష్ఠత్రిభాగార్ధ పంచమంబు
లేకముగఁ జేసి యెఱిఁగింపు మిపుడు మాకు
(సశేషము)

---

1. మూలము. సూత్రము ౨౨. పుట ౩౭. 2. మూలము. సూత్రము ౨౩. పుట ౩౯. 3. పుట ౩౭. ఉద్దేశకము చూడుఁడు. 4. పుట ౪౦. ఉదాహరణము ౯. 5. మూలములో లేదు. 6. పద్యము కుదురలేదు.